శ్రీకృష్ణాయనమః.

# ప్రపదనపారిజాతము.

प्रपदनपारिजात.

అను

దివ్యప్రబన్ధము

ఇది

శ్రీ బొబ్బిలి సంస్థాన పురోహితులగు

కొటికెలపూడి - కోదండరామయ్య గారిచే

రచియింపఁబడి

మహారాజరాజశ్రీ

మహారాజా సర్ వేంకటశ్వేతాచలపతి రంగారావు బహదరు

కే. సి. ఐ. ఇ. వారివలన

చెన్నపురి

శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

1906






శ్రీకృష్ణ

# ఉపోద్ఘాతము.

ప్రపదనపారిజాతమను నీగ్రన్థ మస్మదాస్థాన పురోహితులగు శ్రీ॥ కొటికెలపూడి కోదండరామయ్యగారిచే రచియింపఁబడి పితామహులగు రాజా శ్రీ శ్వేతాచలపతి రంగారావు బహదరు రి కంకితము చేయఁబడినది.

ఈగ్రన్థము విశిష్టాద్వైత సిద్ధాన్తమునకుఁ బ్రధానములగు మన్త్ర తిరుమన్త్రార్థములను భక్తిప్రపత్తుల స్వరూపమును నింక శ్యకములగు మతవిషయములను మఱి కొన్నిటిని బోధించునది గుటవలనను, దైవభక్తిని బ్రహ్లాదున కీడని పొగడ్తఁగన్న మాపి మహుల కంకితము చేయఁబడినదియగుటవలనను,దీనిని ముద్రింపించి కటించుట యావశ్యకమగుటంజేసి యస్మదాస్థాన విద్వాంసులచేఁ పరీతిని బరిశీలింపించి ముద్రితము చేయింపఁబడియె.

పూర్వ మీగ్రన్థమున వ్రాయఁబడిన వంశపురుషచరిత్రము తక్కిన న్థములతోఁ బాటుగ సరిగ నుండమిచే నిటీవల మాచేఁ బ్రకటింపఁ న బొబ్బిలిసంస్థాన చరిత్రము ననుసరించి సంస్కరింపించి వ్రాయింపఁ యె.

బొబ్బిలి..
06సంవత్సరము. }

వేం. శ్వే. రం.

శ్రీరస్తు.

---

# ప్రపదనపారిజాతము.

## ప్రథమాశ్వాసము.

శ్రీరాజజ్జనకాత్మజాహృదయ రా ♦ జీవాబ్జమిత్త్రుండు సీ
తారామాఖ్యపురీనివాసుఁ డగుసీ ♦ తారామదేవుండు తా
వీరాగ్రేసరు రావువంశతిలకుల్ ♦ శ్వేతాచలాధీశరం
గారాయక్షితినాథచంద్రముని మాం♦గళ్యాన్వితుం జేయుతన్,

సీ॥ రాజీవములరీతి♦రాజీవములరీతిఁ, దనరారుచున్న నే♦త్రముల
తోడ। ఘనకుంభములభాతి♦ఘనకుంభములభాతి, నలరారువక్షోరు♦హా
ములతోడఁ। దారావళులపోల్కి♦దారావళులపోల్కిఁ,గనుపట్టుచున్నన♦
ఖములతోడ। విషధరమ్ములమాడ్కి ♦ విషధరమ్ములమాడ్కి, డంబైన
గొప్పక ♦ చంబుతోడ॥ తే. గీ॥రామచంద్రునివామ పా♦ర్శ్వంబునను వ।
సించిభక్తుల నెల్ల ర♦క్షించుసీత। లలితగుణజాత శ్వేతాచ♦లపతిరంగ।రా
యవిభుఁ బ్రోచుఁ గాత ని♦రంతరంబు॥శా॥శ్రీరమ్యం బగుబొబ్బిలీపురిని
ల♦క్ష్మీరుక్మిణీసత్యభా। మాగత్నంబులు గొల్వ హేమగృహసీ♦మన్నిల్చి
భక్తుల్ తనుం। జేరం బ్రోచెడిగోపబాలుఁ డెలమిన్ ♦ శ్వేతాచలాధీ
శరం। గారాయాగ్రణి కిచ్చుఁ గాత ఘనమాం♦గళ్యాయురభ్యున్నతుల్॥
చ॥ అనుపమసత్యశౌచకరు ♦ ణాన్వితులై తనరారుచున్నస। జ్జనులకుఁ
గల్పవల్లి ఘన♦సద్గుణపాళికిఁ బాలవెల్లి భ। క్తిని బతిఁ గొల్చుచున్న
సుద♦తీతతిలోన మతల్లియైనక్రొ। న్ననవిలుకానితల్లి కృతి♦నాయకునింట
వసించుఁ గావుతన్॥ మ॥ ఘనకారుణ్యరసాతిరేక మెసఁగన్ ♦గన్పట్టు
గోపాలమే। ఘునిపార్శ్వమ్ములఁ జంచలాద్వితయమ♦త్యుగ్రాకృతి న్నిల్చు
నో। జను నెమ్మేనులు భాసిలం దనరుశ్రీ♦సాత్రాజితీరుక్మిణీ। వనజాతా
స్యల భక్తి వేఁడెదఁ గృతి♦స్వామిన్ దగన్ బ్రోవఁగన్॥ శా॥ దారా

ఖాలయమాతృబంధుజనక ♦ త్యాగంబు గావించి కాం । తారక్షోణికి
వెంట నేగి గతని♦ద్రాహార్హుఁడై భక్తితో । నీరేఁడబ్దము లచ్యుతాం
ఘ్రియుగళం ♦ బేకాకృతిం గొల్చి స । త్కారం బొందినలక్ష్మణుండు కృతి
భ♦ర్తకున్ వేడ్కతోఁ బ్రోచుతన్ ॥ సీ॥ ఆజానుదీర్ఘబా♦హార్గళంబులతోడఁ,
గమలసంకాశనే♦త్రములతోడ । శరదిందుకుందస ♦ చ్ఛాయగాత్రము
తోడ,రమణీయనీలాంబ♦రంబుతోడ । హలముసలాదిది♦వ్యాయుధంబుల
తోడఁ, జారువిశాలవ♦క్షంబుతోడ । మందస్మితోపేత♦మధురాననము
తోడ,బింబనిభాధరో♦ష్ఠంబుతోడ ॥ తే.గీ॥ హారకోటీరముఖభూష ♦ ణాళి
తోడ। దివ్యగంధంబుతోడ దే♦దీప్యమానుఁ। డైనబలరామవిభుఁడు శ్వే ♦
తాచలపతి।జనపతి కభీష్టసిద్ధులొ♦సఁగుఁ గాత॥ చ॥ సమరజయాలవాలము
వి♦శంకటవాలము దైత్యమర్దన । క్రమము సమగ్రవిక్రమ మ♦కల్మష
బింబము సూర్యబింబ మౌ । గమనుతరామనామసుము♦ఖంబు ముఖం
బయి మించువానర । ప్రముఖుఁడొసంగుఁ గాతఁ గృతి♦భర్త కభీష్ట
సుఖంబు లిమ్ముగన్॥ సీ॥ మధ్యందినసహస్ర ♦ మార్తాండమండలో, ద్దండ
తేజంబు సు♦దర్శనంబు । పటుతరాత్మధ్వాన ♦ బధిరీకృతామర్త్య, పరి
పంథికర్ణకో♦ టరము దరము । నిర్ఘాతసంఘాత♦నిష్ఠురస్వనిపాత, హత
శత్రుచయము గ♦దాయుధంబు।ప్రావృట్సమారంభ ♦ భాస్వత్తటిత్కోటి,
నవతాళతల్యంబు♦నందకంబు॥ తే.గీ॥ శక్రచాపోపమానంబు ♦ శార్ఙ్గధను
వు।యాచకాధారుఁడైన శ్వే ♦ తాచలపతి । రంగరాయావనీశస♦ర్వజ్ఞున
కును । సంగరమ్ముల జయము లొ♦సంగుఁ గాత॥ చ॥ వెలిగొడుగుల్ ఫణా
గ్రములు♦వెల్లనిపానుపు మేను దీపికా । వళులు వతంసదీధితులు♦వాలము
యామికుఁడై చెలంగ శ్రీ । జలరుహపత్త్రనేత్రుని ని♦ శాసమయంబుల
భక్తిఁ గొల్చుకుం । డలివరుఁ డిచ్చుఁగాతఁ గృతి♦సాధున కుజ్జ్వలభోగ
భాగ్యముల్॥ మ॥ పురుహూతస్థలికిన్ సుధాపహృతికై ♦పోవంగఁ ద్రోవన్
గరు । న్మరుదుద్ధూతమహాగిరుల్ చరణసీ♦మం జేరి సైన్యంబు । వైఖరి
దోడ్తోఁజను దేరఁగాఁ దనరు శ్రీ♦కంజాక్షువాహంబు సం । గరభూమిన్

విజయుంబొసంగుతను రం♦గారాయభూభర్తకున్॥ ఉ॥ సూత్రవతీకళ
త్రుఁడు వి♦శుద్ధచరిత్రుఁడు మందరోజ్జ్వల। గ్గాత్రుఁడు పాణిపద్మసము♦
దంచితవేత్రుఁడు చక్రిసత్కృపా।పాత్రుఁడు విష్ణుసైన్యవన♦పాలనచైత్రుఁ
డు సారసస్ఫుర। న్నేత్రుఁడు రంగరాయధర♦ణీపతి కిచ్చు నభీష్టసంప
దల్॥ చ॥ హరిపదసక్తు లున్నతత♦రాధ్వులు వర్జితదోషు లాగమా।
భరణులు ఖేచరస్తవన♦పాత్రులు భూరితమోహరుల్ మహా। పురుష
సమర్చితుల్ ప్రథమ♦పూజ్యులు కారణజన్ములైన ప। న్నిరువురు సాము
లిమ్ముగఁ గృ♦తీశున కిత్తురు సర్వసౌఖ్యముల్॥ శా॥ గర్వాహంకృతికామ
క్రోధమదరా♦గద్వేషసంశూన్యులన్। సర్వార్థాకరశబ్దతర్కముఖశా♦
స్త్రజ్ఞానధౌరేయులన్। సర్వారస్ఫుట వాక్ప్రపంచుల జగ♦త్స్తుత్య
ప్రభావాఢ్యులన్। గీర్వాణాంధ్రమహాకవిప్రవరులం♦గీర్తించెదన్ వే
డుకన్॥ తే.గీ॥ జగతి విపరీతమతు లౌట♦సత్కవీంద్ర।కావ్యముల నింద
సేయుమర్♦గాక కుకవు। లెఱిఁగి నిందించిరే వారి♦నేల దూఱ। వారిఁ
బుట్టించువిధి నన♦వలెను గాక॥ చ॥ అనఘరుచిం జెలంగుమణు♦లం దన
భిజ్ఞులకున్ బలెన్ మహా। జనవినుతంబులై తనరు♦సత్కృతికల్పనలందు
దోషముల్। గనఁబడుఁ గాకవీంద్రులకుఁ♦గా నవి దోషము లంచుఁ
దెల్పినన్। విన రటు గాన మౌనమె వి♦వేకి వహించి సహించు టింప
గున్॥ వ॥ ఇట్లు భగవద్భాగవతప్రార్థనంబు గావించి సుకవుల మన్నించి
కుకవులపైఁ గరుణించి ప్రపదనపారిజాతం బనునొక్కదివ్యప్రబంధంబు
రచియింపం బూనియున్న సమయంబున॥ సీ॥ తనదివ్యభక్తసుం♦దరికి
వైకుంఠుండు, పెరటఁబెట్టినకల్ప♦తరువుగాఁగ। దనకీర్తిశారదాం♦గన క
జాండావళుల్, గూర్చి కట్టుకడాని♦గుళ్ళుగాఁగ।దనశౌర్యదవహుతా♦శ
నునకు మధ్యాహ్న, కమలాప్తుఁ డంగార♦కణముగాఁగ। దనదానవారి
వా♦హినికిఁగల్లోలినీ, రమణుండు పటుశీక♦రంబుగాఁగ॥ తే.గీ॥దనరుజయ
భేరికాధణం♦ధణనినాద। దళితవేధోండభాండబం♦ధనసమర్థ। లలితగుణ
శాలి శ్వేతాచ♦లపతి రంగ। రాయ నృపమౌళి రిపుతమో♦వ్రాతహేళి॥

సీ॥ పద్మరాగోపల ♦ ప్రాకారరుచులచే, సాంధ్యరాగభ్రాంతి ♦ జన్వానులకు।
శక్రోపలోజ్జ్వల ♦ చ్ఛాదనచ్ఛవులచే, బహులాభ్రవిభ్రాంతి ♦ బర్హిణులకు।
వలభీసంఘటితోరు ♦ వజ్రదీధితులచే, జ్యోత్స్నావిభ్రాంతి స ♦ జ్జనములకును।
మహితకుట్టిమబద్ధ ♦ మౌక్తికప్రభలచే, మల్లికావిభ్రాంతి ♦ మధుపములకు॥
తే. గీ॥ మాటిమాటికిఁ జేయుచు ♦ మరుఁడు కేలఁ। జాయకత్తులు జళిపించు ♦
చందమున న। టించు వెలయాంధ్రగానప్ర ♦ పంచమున న। మంచితంబైన
యాస్థాన ♦ మండపమున॥ సీ॥ వేదశాస్త్రపురాణ ♦ విద్యలం దధికులై, బ్రహ్మ
వాదము సేయు ♦ బ్రాహ్మణులును । మండితాన్వీక్షికీ ♦ దండనీతిత్రయీ,
వార్తాఖ్య లగుసచి ♦ వవ్రజంబు । షణ్ముఖనీలవి ♦ ష్వక్సేనముఖ్యుల, హాసి
యింపఁ జాలునై ♦ న్యాధిపతులు । గార్గ్యవసిష్ఠవా ♦ క్పతిశుక్రముఖులకు,
జత సేయఁ దగుపురో ♦ హితగణములు॥ తే. గీ॥ బంధుమిత్రభటాదులు ♦
బలసి కొలువ। నమరగణములతోడి జం ♦ భారిరీతిఁ । దగ జయంతునిఁ
బోలుపు ♦ త్త్రికుఁడుఁ దాను । నిండుకొలువుండి కన్నుల ♦ పండువుగను॥
మ॥ నను గోపాలపదాబ్జభక్తియుతు నా ♦ నావేదవేదాంతబో । ధనిధిం
గొల్కులపూడిసత్కులజుఁ గో ♦ దండ్రామయాఖ్యాన్వితుఁ। ఘనకార్తాంతి
కసంఘసన్నుతుఁ గృత ♦ గ్రంధప్రజుఁ సత్యవా । క్యనిరూఢుఁ స్వపురో
హితోత్తముని వే ♦ డ్కం బిల్చి తా నిట్లనెఁ ॥ సీ॥ మందారహిమధామ ♦
మల్లికాకర్పూర, సమకాంతి గలజన్ని ♦ దములవాఁడు। సాంధ్యరాగప్రభా ♦
సముదాయముల నీను, కమనీయశాటీయు ♦ గంబువాఁడు । మహితత్రి
దండక ♦ మండలూద్వహములై, తనరారుచున్న హ ♦ స్తములవాఁడు।
కంఠలగ్నానేక ♦ కంజాక్షమాలికల్, విపులవక్షంబున ♦ వ్రేలువాఁడు॥ తే. గీ॥
ప్రకటితద్వాదశోర్ధ్వపుం ♦ డ్రములవాఁడు। నియతిమై యతివేషంబు ♦ నెగ
డువాఁడు । తాను రామానుజుఁడ నంచుఁ ♦ బూనువాఁడు । స్వప్నమున
రాత్రి మాకు సా ♦ క్షాత్కరించె॥ తే. గీ॥ ఇట్లు రామానుజుఁడు దోఁప ♦ నేము
వాని । యడుగుఁదామరలకును దా ♦ సోహమనుచుఁ । గడిమితో మ్రొక్కి
ముకుళిత ♦ కరులమైన। మమ్ముఁ గనుఁగొని పల్కె న ♦ మ్మౌనివరుఁడు॥ క॥ శ్రుతి

వాక్యసుప్రసిద్ధము। ప్రతివాదిభయంకరంబు♦ ప్రపదనరూపం । బతిశ
యయుత మగువైష్ణవ। మత మేఁ జేసితిని దొల్లి ♦ మానులు మెచ్చన్ ॥
క॥ దానిం బూర్వ మొసంగితి। మానవులకుఁ దెలిసినట్టి♦మహనీయులు
లక్ష్మీనాథుపదముఁజూడం। గా నేగిరి సకలయోగి♦గణములు వొగడన్॥
తే.గీ॥ మందమతులైనతక్కిన♦మానవులకుఁ।గలఁత యగుటను మతమె
ల్ల♦గాసిచేసి।పాపములె కృత్యములుగాఁగఁ♦బడసిపడిరి।నిరయమునసందు
చేమాకు♦నింద వచ్చె॥ క॥ ఈమత మంతయు సాంతము। గా మదిలోఁ
దెలిసినట్టి♦ఘనుఁడొకఁ డైనన్ । లేమిఁ బ్రపదనము సెడుటకు। మామ
కహృదయము విచార♦మగ్న మగుతఱిన్ ॥ క॥ వీరాగ్రేసరుఁ డమలవి।
చారుం డినుగంటివంశ♦చంద్రుఁడు భగవ। త్కారుణ్యసమేతుఁడు సీ। తా
రామప్రభువరుండు♦ధరణిజనించెన్॥ సీ॥ అభ్యసింపక వచ్చె♦నతనికిషట్ఛా
స్త్ర, సకలవేదాంతవి♦జ్ఞాన సరణి। తలఁపకున్నను వాని♦నిలయంబునకుఁ
జేరె, బలనైరినుతమైన♦భాగ్యలక్ష్మి। నిగ్రహింపక మున్నె♦నిఖిలారిభూ
పతుల్, వానికిఁ జేసిరి♦వందనములు । కోరకున్నను గల్గె♦ నారదాదులు
మెచ్చు, నారాయణునికరు♦ణాగసంబు॥ తే. గీ॥ సకలనైదికలౌకికా♦చా
ర్యుఁ డతఁడు। నిఖిలసుగుణంబులకుజన్మ♦నిలయ మతఁడు । మనుజమా
త్రుండె దేవాంశ♦మయుఁడుగాని।కానిచో నింత యోగ్యత♦గలుగుటెట్లు॥
తే.గీ॥ వంచకాచార్యపురుషదు♦ర్వర్తనమునఁ। బాడుపడియున్న ప్రపద
న♦పథ మతండు।బుద్ధిచేతను మావలె♦నుద్ధరించి।నీకు సాకల్యముగఁ జెప్పె♦
లోకు లెన్న ॥ క॥ ఆతం డుపదేశించిన। రీతిఁ బ్రపన్నుండవై చ♦రించెడి
నీకున్।భాతి శతవత్సరమ్ములు।తీతము లగుపిదప ముక్తి♦దేవుఁ డొసంగున్॥
ఉ॥ మానవనాథ యీప్రకృతి♦మండలమందు జనింప వింక నీ। చే నగు
కార్య మొక్కటి వ♦చించెద దాని నొనర్చి తేనియున్। మానవలోక
మంతయును♦మాధవలోకము త్రోవ నేగ సో। పానచయంబుగట్టినప్ర♦
పన్నవరుం డనుకీర్తి నీ కగున్ ॥ క॥ కరుణయు హరికైంకర్యము। విరతి
ప్రపన్నులకు సూక్త♦విధుఁలఁ జెల్లొటం।గరుణాకార్యముఁ జేసిన। నరుమధ్యమ

నిష్ఠచెడు న♦నర్గవశ మగునే॥ క॥ నీకుం బిత్రుభగినీపతి। వీఁకం జెప్పినప్ర
పత్తి♦ విధ మెల్లభువిన్ । వ్యాకోచం బగుటకును। శ్లోకములతో నాంధ్ర
కృతి ర♦చింపింపవలెన్॥ తే. గీ॥ అక్రమము మేము చేసిన♦నదియె ధర్మ
మనుచు శిష్యులు గావింతు♦ర నెడిభీతి । నిష్ఠఁ బాయక వర్తించు♦నేన
గృతు ల। నేకముగఁ గొంటిఁ జేసితి♦నైకకృతులు ॥ క॥ నేను మదం
వాసుల। తో నానతి యిచ్చినట్లు♦తోలుతం గృతిసం । తానం బొనరిం
చినచో। నానందించెదను జగము♦లానందించున్॥ తే. గీ॥ అవనిఁ బ్రపద
నపారిజా♦తాఖ్య గలిగి।తనరుదివ్యప్రబంధంబు♦తగ నొనర్చి।మీకు నంకిత
మొనరింప♦మేటి గలఁడు। తావకపురోహి తానసీ♦దేవులందు॥ క॥ వార్ధి
గంభీరధ్వని। తో గామానుజగురుండు ♦ తోరంబుగ నీ । తీరున వచించి
నియెను। నీరజహితుకాంతు లంత♦నింగిని బర్వెన్॥ తే. గీ॥ మేలుకొని లేచి
కల యెల్ల♦మీకుఁ దెల్పి । నారమారీతిగ్రంథంబు♦మీ రొనర్చి । కృతి
యొసంగుఁడు మాకు స♦మిద్ధసుగుణ । ధామ సుకవిలలామ కో♦దండ
రామ ॥ సీ॥ అభ్యసించితివి బా♦ల్యంబాది మాతోడ, సకలవేదాం
తార్థ♦శాస్త్రచయము । శంకరాచార్యశి♦ష్యత్వ మున్నను నీకు, రామా
నుజులమీఁద♦రక్తి గలదు । అన్యథావైపరీ♦త్యజ్ఞానములు లేవు, సర్వ
మతంబుల♦సముఁడవీవు। జన్మాంతరాభ్యాస ♦ సాంగత్యమునఁ జేసి, వెల
లేనిహరిభక్తి♦గలిగె నీకుఁ॥ తే. గీ॥ జిదచిదీశ్వరతత్త్వవి♦శేషములును।బ్రప
దనక్రమ మాచార♦పద్ధతులును। మాకు మించను మీవలె♦మఱి యె
ఱుంగు। వాఁ డొకండును గానఁగా♦రాఁడు మహిని ॥ వ॥ ఇట్లుబహు
మాన పూర్వకంబుగా వచియించిన కృతిపతిమంగళావతారం బైనవం
శావతారం బెట్టి దనిన ॥ తే.గీ॥ వంశపురుషులవరుస యీ♦పయినిసరిగ।
నుండకుండుటచేఁ గడు♦యుక్త మగుని।చారణముతోడఁ గ్రొత్తగ♦సరిగ
మార్చి।వ్రాయఁబడియెనునీక్రింద♦వరుసగాను॥సీసమాలిక॥ఈగ్రంథమున
నెగా♦కీవిధంబున మిత్ర, విందాపరిణయంబు♦నంచునుహారి। భక్తిదెల్పెడి
హారి ♦ భక్తిసుధోదయం, బుదఁగూర మాహాత్మ్య ♦ మునను దెలుఁగు

భాషలోనికిమార్పఁ♦బడినసంకల్పసూ,ర్యోదయమ్మునను స♦య్యాజరంగ।
నాయకపాత్రుఁడాం♦గ్లేయభాషనులిఖిం,చినబొబ్బిలిచరిత్ర♦మునవిశాఖ।
పురమండలచరిత్ర♦మునను వంశపురుష, నిర్ణయం బరయన♦నేకవిధము।
లుగ నుంటఁజేసి పొం♦దుగను దత్తద్గ్రంథ,ములఁగూర్చి వానిలో♦పలను
గల్గు। వానిశోధించి యే♦కోనవింశతిశత, తమ్మైనక్రైస్తవా♦బ్దంబునం
దుఁ। దత్కాలమునను సం♦స్థానమ్ము నేలుచు, వెలయు శ్రీవేంకట♦శ్వే
తశైల। పతిరంగరాయ భూ♦పతివర్యుఁ డింగ్లీషు, భాషయం దేర్పడ♦
వ్రాసినట్టి। బొబ్బిలిచారిత్ర♦మునవ్రాయఁబడియున్న, వంశీయపురుషుల♦
వరుసఁబట్టి।తక్కినయట్టిగ్రం♦థములంగ నీగ్రంథ,మును ముద్రితమ్ముగ♦
నొనరుచుతఱి॥ తే.గీ॥వంశపురుషక్రమమ్ము త♦త్ప్రభుని దేశ। మునఁదదా
స్థానకవియయి♦తనరు మండ। వేములకులసీతారామ♦ భూమిసురుఁడు।
మాఱుపునొనర్చి వ్రాసె నీ♦ తీరుగాఁగ॥ వ॥ తత్క్రమం బెట్లనిన॥
సీ॥ అనపోతవిభుఁడు మ♦హాపరాక్రమశాలి, గావునఁ దనశౌర్య♦
కలనఁ జేసి। యాజిరంగమునను♦ రాజుల నోడించి, కృష్ణా నదివఱకు♦
గెలిచి దేశ। మును దనకు నధీన♦ముగఁ జేసికొనియె నిం, కొకపరిపొసఁ
గిన♦యుద్ధమునను। దనమీఁద వచ్చిన♦ఘను లగుదొరలను, నూటిపై
నొక్కని♦గీటడంచి॥ తే.గీ॥ యేకవీరుం డటంచును♦నెన్నికఁ గనె।వేంక
టగిరికుటుంబపుఁ♦బృథివిపతుల। లోన నాఱవపురుషుఁడా♦మానఘనుఁ
డు। వెలమలకు నెల్లఁ గలిగించె♦విమలకీర్తి॥ సీ॥ సర్వజ్ఞసింగయ♦జనపతి
యెల్లవి, ద్యలనేర్చి తనపేరు♦సార్థకముగఁ। బండితకోటిచే♦బలుకవీం
ద్రులచేతఁ, బరివేష్టితుండయి♦ప్రౌఢిమెఱయ। విద్యావినోదియై♦వెలసెను
సింగభూ, పాలీయమను పేరఁ♦బరఁగుగ్రంథ।మురచించెసంస్కృత♦మునఁ
బండితుం డని, కవివరుండనియును♦గాంచెఁగీర్తి॥ తే.గీ॥నతఁడు వేంకటగిరి
వంశ♦మందు నుదయ। మందిన వసుంధరావరు♦లందు దశమ। పూరు
షుండయి జను లెన్నఁ♦బేరు వడసెఁ। దగదె యాతని వర్ణింప♦ జగతి
యందు॥ క॥ అలవేంకటగిరి పురరా। జులలోఁ బదునేనవపురు♦ షుం

డగుచు మహిం। బొలిచెఁ బెదరాయఁ డాతఁడె। వెలసెను నిర్వాణరాయ♦
విభుఁడను పేరన్॥ సీ॥ మొగలాయి ప్రభులకై♦ప్రూని షేర్మహమదు, ఖానుం
డనెడు పేరు♦గలిగినట్టి। సరదారుఁడు మనదేశమును జయింపఁగ, వచ్చెనా
తనితోడ♦వచ్చినట్టి। యిరువురు ప్రభుల్లో♦నితఁడొక్కరుండయి, యుండెఁ
దత్కాలపు♦యుద్ధములను। బలుసాగు మొనరించి♦పాదుషావలన రాజా
మనునట్టి సం♦స్థానముఁ బ్రతి॥ తే. గీ॥ ఫలముగను నొందె రెండవ♦ప్రభువు
విజయ । నగర రాజ్యము మొదటి వాఁ♦డుగ గణింపఁ । బడిన మాధవ
వర్మయన్♦పుడమి జేఁడు। వీరిలోఁ బెద్దరాయపృ♦థ్వీవరునకు॥ సీ॥ సంస్థాన
ము నొసంగు♦సమయంబునందె వం, శక్రమంబుగను రా♦జా బహదరు !
మొదలైన బిరుదులు♦ముఖ్యమౌ తెల్లజెం, డాను పుబత్తును♦ఢక్క యాది।
గలిగిన రాచచి ♦ న్నెలొసంగఁ బడెను త్త ,రపు సరకారులం♦దపుడు పోరి ।
సందడియడఁగనా♦జనపతి కూడవ, చ్చినయట్టి లింగప్ప♦యనుసుతునకుఁ ॥
తే.గీ॥ దనకు సమకొన్న యీ రాజ్య♦మును నొసంగి। తండ్రి తాతల నాఁటిదై♦
తనరు వేంక । టగిరి రాజ్యమ్మునకును ది♦రుగఁ జని యెను । బెద్దరాయవ
సుంధరా♦విభువరుండు॥ చ॥ జనకుఁడు సమ్మదమ్మున నొ♦సంగిన రాజ్యము
నొంది లింగపా। వనివిభుఁ డుండఁ బర్వతపుఁ♦బ్రాంతములందుఁ బితూరిఁ
జేయుదు । ర్జనులను గండడంచుటకు♦సాయము గమ్మని యప్డు దేశమే ।
లినప్రభు లప్పుడప్పు డల♦లింగమహీతలనాథుఁ గోరఁగన్॥ ఉ॥ అమ్మను
జేశ్వరుండు దన♦కానసథమ్ముగ నీడ నొక్కచో । ర్గమ్మును దాని చెంతనె
పు♦రంబును దా రచియించి వానికిన్ । సమ్మతి షే ర్గహమ్మ దను♦సాహెబు
ప్రాపకుఁ డోట వాని నా । మమ్మొనరించె భూజనులు♦మానుగ బెబ్బులి
యంచుఁ బిల్వఁగన్॥ తే.గీ॥ షే రనఁ మరుష్క భాషను♦జెలఁగును బులి।
పెద్దపులి యను పద మయ్యె♦బెబ్బులి యన । బెబ్బులియె నాఁడు నాఁ
టికి♦బొబ్బిలి యనఁ । బొలిచె నక్షరములు మార్పుఁ♦బొంద నిపుడు॥
క॥ ఆలింగపరాయమహీ । పాలుఁడు బస్తరు మొదలగు ♦ ప్రాంతములఁ
బితూ। రీలవలని యలజడి ని। ర్మూలించెఁగడిందిశ్రమము♦పూనిచలమునన్॥

తే.గీ॥ షేరుమహామదుఖానుఁ డా♦తీరునను సి।కాకుళంపుసర్ లష్కరు♦
కార్యభార । మును వహించుచు నుండ నా♦తనిసుతుండు । వేఁటకయి
యొక్క యడవికి♦వెడలె నపుడు॥ ఉ॥ గంజము మండలంబునను♦గ్రాలు
పళాససమీప భూమిలో। నం జెలువారునొక్క గహ♦నంబున నుండును
రంగవాఁక యం । చుం జనులాడుచో టచటఁ♦జొప్పడియున్న పితూరి
కాండులోఁ। గొంజక యత్తురుష్క విభు♦కూరిమి పుత్త్రుని బట్టె నుద్ధతిన్॥
ఉ॥ దిట్టముగా వెదుర్పొదలు♦తీరిచికట్టినయట్టు లొప్పుచుం। జుట్టు నెసంగు
చున్న యల♦చోటు తురుష్కుల కైదు నగుట్టుపుం। ధట్టిక లోనఁజొచ్చుటకుఁ♦
దావు నొసంగక యుంట నయ్యెడన్ । బుట్టినవంత నయ్యవన♦భూపతి
యేమియుఁ దోఁప కయ్యెడన్॥ ఉ॥సాయము గమ్మటంచునల♦సాహెబు
వేడఁగ లింగపతుమా । నాయకుఁ డెంతయున్ బలము♦నన్ గడి దేఱిన
యాత్మ సేనతో । నాయటవీప్రదేశమున♦నవ్విధినొప్పెడు రంగవాఁకకుం।
బోయి విరోధు లున్న యెడ♦ముట్టడి చేసి కలంచి యుద్ధతిన్॥ ఉ॥ ఒక్క
దినంబు యుద్ధమున♦ నుక్కఱ వానిని బట్టి వానిచేఁ । జిక్కి నలంగినట్టి
యల♦షేరు మహమ్మదుఖాను సూనునిన్ । గ్రక్కున వీడఁ జేసి యల♦
రాజవరేణ్యుఁడు చింత చేఁ గడున్ । స్రుక్కిన యానవాబునకు♦సూనుని
యప్పన చేసెఁ జేసినన్॥ చ॥ క్షితిపతి యీగతిం దనకుఁ♦జేసిన యప్రతి
మోపకారమున్ । మతిఁ దలపోసి యయ్యది జ♦నంబుల కెల్లను మే
లటంచుఁ దాఁ । బ్రతిభ దలిర్ప నంతయును ♦ వ్రాసెను సమ్మతిఁ బాదు
షాకు నా । చతురుఁడు రాజవర్యునకుఁ♦జాల సిఫారసుగాఁగ నత్తఱిన్॥
సీ॥ ఇటు వ్రాయఁ బాదుషా♦యెంతయు ముద మంది, లింగప నరపాల♦
పుంగవుండు । తనజమీందారిలోఁ♦దనరుచుండిన యెన్ని, గ్రామంబులకు
నొక♦రాత్రియందుఁ। దోరణమ్ములు సొంపు♦మీఱఁ గట్టించునో, శాశ్వతం
బగు మొఖా♦సాగ వాని । ననుభవించుటకునై ♦యాజ్ఞ నొసంగె నా, గతిఁ
దోరణమ్ములు♦గట్టఁబడిన॥ తే. గీ॥ గ్రామముల్ పదిరెండయి♦గణన కెక్కె।
నవియె పోటుగ్రామము లను♦సార్థకంపుఁ।. బేరఁ బిలువంగఁబడి జమీ♦

దారిలోన। నొప్పుమీఱుచునున్న వి♦యిప్పటికిని॥ ఉ॥ అప్పుడె పాదుషా
వలన♦నందెఁ గుటుంబపరంపరాక్రమం। బొప్పఁగ రంగరా వసుధు♦
ను జ్జ్వలమాబిరు దాతఁ డద్దిరయ్యే। యప్పటినుండి యీకులము♦నందు జనిఁ
చినయట్టి పూరుషుల్। తప్పక వారినామముతు♦దగ్ గదియింతురుము
ఖ్యచిహ్నతన్॥ తే. గీ॥ రంగరాఁకవిభుఁడు రణ♦రంగ మందు। గెలుపుకోఁ
డనుసర్థముల్ ♦ దెలుపు రంగ। రాయబిరు దిది యేలెడు♦రాజులకును। కాక
మగ పేరులకు నెల్లఁ♦గలదు తుదను॥ క॥ ఆలింగపరంగమహీ। పాలుఁడు
హీరమండలంబుఁ♦బాలించెడుభూ। పాలుని రణమున మరియొక। వేళను
వధియించె ననుచు♦వినఁబడుచుండుర్॥ క॥ ఆత్మజులు లేమిఁ గొనియెను♦
నతఁడు వేంక। టగిరిరాజుల జ్ఞాతియై♦తగఁ బ్రసిద్ధుఁ। డైనమాధవ
రాయని ♦ సూనులందు। దత్తునిఁగను వెంగలరాయ ♦ ధరణివరుని॥
సీ॥ వెంగలరంగరా♦ డ్విభుని బాల్యమునందె, లింగపనరపతి ♦ పుంగ
వుండు। కాలధర్మము నొందఁ♦గాఁ గన్నతండ్రిమా, ధవరావు
గొన్ని నా♦ళ్ళ వలఁ బెద్ద। యన్న పద్మారావు♦ గొన్ని నాళ్ళును జిన్న,
యన్న నారపరావు♦గొన్ని నాళ్ళు। సంస్థానకార్యముల్ ♦ సవరించిపిమ్మట,
యుక్తవయస్సున♦నొప్పగింప॥ తే. గీ॥ నేరుపున రాజ్యతంత్రము♦నిర్వ
హించి। బ్రాహ్మణులకును నగ్రహా♦రంబు లొసఁగి। చెఱువులను లోఁతు
విరివియు♦మెఱయువాని। ద్రవ్వఁ జేసెను వెంగల♦రంగవిభుఁడు॥ తే. గీ॥
అవియెయ్యలరాజు యొక్క♦యునతనిఁ గన్న। పెంచినట్టితండ్రులయును♦
బేర నొప్పుఁ। బద్మరావునారపరావు♦వ్యవహరించు। తఱిని దమ పేరఁ
ద్రవ్వించి♦రిరు చెఱువులు॥ ఉ॥ వెంగలరంగరాయవిభు♦వెన్క సుతుండు
మతాభిమాన మొ। ప్పం గడు ధర్మశీలుఁ డన♦వాసికి నెక్కి నమేటి
సొంపు మీఱ। అంగను నేలె రంగపతి♦రంగనరేంద్రుఁ డతండు గాంచె
శ్రీ। రంగము లోనుగాఁ గలపు♦రాతనమై తగుక్షేత్రజాతముల్॥
క॥ ఆయవనీశునితమ్ముం। డై యలరినయట్టి పెదజ ♦ నార్దనరంగా। రాయ
మణి కూర్చెఁ బ్రజ బళి। రా యన లకవరపుకోట♦ రాజ్యముఁ

గూడన్॥ క॥ ఆరంగపతినరేంద్రుని । గారాముతనూజుఁ డగుచు♦ఘనత
వహించెన్ । శ్రీరాయఁడప్పరంగ । క్ష్మారమణుం డతనిబాల్య♦కాలము
నందున్॥ తే.గీ॥ రంగపతిరంగనరపతి♦పుంగవుఁడు । కాలధర్మము నొందఁ
ద♦త్కాలమందుఁ । బెదజనార్దనరంగరా♦డ్విభుని జ్యేష్ఠ। సుతుఁడు లక్క
వరపుకోట♦పతియు నగుచు॥ క॥ తనరిన వేంకటపతిరం । గనరేంద్రుఁడు
కొన్నినాళ్ళుఁ♦గడపట నారా । యనిసుతుఁడు జనార్దనరా । వును దీర్చిరి
రాజకార్య♦పుందంత్రములన్॥ తే.గీ॥ అంతటను యుక్తమైనవ♦యస్సు
నందిరాయఁడప్పరంగరాయధ♦రావరుండు । నేరుపు సమర్థతయు సొంపు♦
మీఱుచుండఁ । బాలనము చేసె మహి బహు♦వత్సరములు॥ క॥ ఆ
పుణ్యుఁ డిట్లు రాజ్య । వ్యాపారముఁ దీర్చి పుత్త్ర♦వంతుఁడు గామిన్
గోపాలకృష్ణరంగ । క్ష్మాపాలకు దత్తపుత్త్రుఁ♦గాఁ గావించెన్॥ తే.గీ॥ అట్టి
గోపాలకృష్ణరం♦గావనీంద్రుఁ । డలరుగోపాలరాయని♦యాత్మజుఁడయి ।
యమ్మహీపతి కనుజన్ముఁ♦డై చెలంగె । రమ్యగుణపాళి వెంగళ♦రాయ
మౌళి॥ సీ॥ శ్రీరావుగోపాల♦కృష్ణరంగారాయ, విభుఁడు రాజ్యము నేలు♦
వేళయందు । విజయనగరరాజ్య♦విభుఁడైనపెద్దవి, జయరామరాజను♦
జనవిభుండు । పదునేఁడునూఱుల♦పయి నేఁబదింటిమీఁ, దను నేఁడవది
యయి ♦ తనరుక్రైస్త । వాబ్దంబునను బుస్సి♦యనుఫ్రెంచిసరదారుఁ,
దనకుఁదోడ్పాటుగా♦నొనరిచికొని॥ తే.గీ॥ బొబ్బిలిపురంబుకోటను♦ముట్ట
డించె । నప్పు డభిమానరతుఁడై ♦ యమ్మహీశ । వరుఁడు ప్రాణంబుపయి
నాస♦సరకుగొనక । చూపె సాహసధైర్యముల్♦చోద్యముగను॥ క॥
పదియాఱునూటిపయి డే । బ్బదిపై నెన్మిదవశాలి♦వాహనశకమై । పొద
లిన ధాత్ర్యబ్దంబునఁ । గదనముబొబ్బిలిని నడిచెఁ♦గడు నబ్బురమై॥ తే.గీ॥
ఘోరతర మైనయట్టి యా♦పోరివలన । రావువారికి వారేలు♦రాజ్య
మునకు । వారికులమునఁ బుట్టిన♦వారి కెల్లఁ । గలిగెఁ బూర్వాధికం
బగు♦ఖ్యాతి జగతి॥ క॥ నాఁటియులయుద్ధపుంగథ । పాటలుఁ బద్యములు
నగుచుఁ♦బలువిధముల నే । చోటులఁ బ్రసిద్ధి గనె నది । యేటికి వేఱు

గను ఖ్యాత♦నీసమయమునన్ ॥ తే.గీ॥ వసుధ నిటు ఖ్యాతిఁ గన్న గో♦పా
కృష్ణ । రంగరాయమహీపతి♦పుంగవునకు । నాత్మసంభవుఁ డగుచు నీ
యవనిఖ్యాతి । నెనసె వేంకటరంగమ♦హీవిభుండు॥ సీ॥ తనతండ్రి ర
యుద్ధ♦మునఁ జంపఁబడియెనో, కడు ఘోరతరముగ♦నడిచినట్టి । బొబ్బిలి
యుద్ధము♦పొసఁగునప్పుడు కుటుం, బము వారి కెల్లను♦ప్రాప్త మైన
గతినుండి తనతండ్రి♦గారియభిప్రాయ, మునకును వ్యతిరేక♦ముగన
నొక్క । వృద్ధునిచే బహు♦విధములఁ గాపాడఁ,బడి ప్రాణరక్షను♦బడ
బ్రతికి। తే.గీ॥ నట్టి వేంకటరంగరా♦యాంధ్రనీంద్రుఁ। డెసఁగె గోపాలకృష్ణ
మ♦హీకళత్ర। వర్యునికుటుంబమునను జీ♦వరకు నిలిచి । యున్నపూరుష
వరుఁడయి♦యొప్పుమీఱు ॥ క॥ అల వేంకటరంగమహీ । తలపతి రాజ
మునందుఁ♦దన బాల్యమునన్ । నిలిచి కపటంపుఁ దలఁపునఁ। బిలిపింపఁగ.
జేర నరిగె♦విజయనగరమున్॥ తే.గీ॥ అరిగి యట వారు నిర్బంధ♦పఱుప
నిలిచి । వారికపటప్రయత్నముల్♦నేరుపుమెయి । నెఱిఁగి వేంకటరంగ
మ♦హీవిభుండు । హైదరాబాదునకు నేగె♦ననువు మీఱ॥ సీ॥ హైదరా
బాదున♦క ళ్లగి వేంకట, రంగమహీపాల♦పుంగవుండు । నైజామువారి
దై♦నయనుగ్రహమునకుఁ, బాత్రత నొందున♦ప్పటికి దేశ । మాంగ్లే
యులయధీన♦మయ్యె నప్పటివారి, యధికారి యీయన♦నధికగౌర ।
వమ్మునఁబిలిపించి♦సమ్మతిఁబిత్రుపితా, మహులక్రమమ్మున♦ మహితమైన ॥
తే.గీ॥ రాజ్యమునొసంగెమరలనా♦రాజమణికి। రాజచిహ్నములన్నియుఁ♦
బూజితముగ । నిచ్చియాభూమినాయకుఁ♦డేలె నాఱు । నొక్కసంవత్స
రము రాజ్య♦మున్నతముగ॥ సీ॥ హైదరాబాదున♦నటులుండి నైజాము,
వారియనుజ్ఞను♦ బడసి దేశ । మున కేగుదెంచున♦ ప్పుడు పొగడ్తను
గన్న, గుఱ్ఱంబు డంకాను♦ గొమరుమిగుల । వేంకటరంగభూ♦ విభున
కానైజాము, వా రొసంగిరి దయ♦ బహుమతిగను । నతఁడె యీపుర
మునం♦దమర దుర్గమ్మును, నిర్మించె నెంతయు♦నేర్పు మీఱ ॥ తే.గీ॥ నది
యెనంగును గోశాల♦ లశ్వశాల । లమరుధాన్యపుశాలలు♦ నతివిశాల।

మ్యసౌధంబులును విచి♦త్రగృహములును।గలిగి వైభవసంపత్తి♦దెలుపు
చుండి ॥ సీ॥ అతివిశాలంబయి♦యతిసమున్నతమయి, తనరారు నెయ్యది♦
ఘనత మీఱ। దారుమయంబులై♦తనరుకంబంబుల, వరుసచే నెయ్యది♦
వన్నెమీఱు । నుద్యోగులును రాష్ట్రి♦ యులును బల్దెఱఁగులఁ,బ్రజ
లెప్పు డెచ్చట♦బలసి యుంద్రు । సంస్థానకార్యముల్♦ సరవిఁ దీర్చుచుఁ
బ్రథా, నోద్యోగు లెచ్చట♦ నొప్పుచుంద్రు ॥ తే.గీ॥ హైదరాబాదునందు
నొ♦ప్పగుడివాను । ఖానలను బోలునట్టి ది♦వానుఖాన । నబ్బురంబుగ
నిర్మించె♦బొబ్బిలీపు । రంపుఁగోటను వేంకట ♦ రంగవిభుఁడు ॥ తే. గీ॥
బొబ్బిలిని మున్ను జరిగిన♦పోరివలన । నెంతయును శిథిలత్వంబు♦నెనయు
వెలమ । వారిమొదలింటి వైనయా♦చారములను । నిలిపె నెప్పటిరీతి
నా♦నృపవరుండు ॥ సీ॥ తనకరాగ్రస్ఫుర♦ త్కౌక్షేయకప్రభల్, పరిపంథి
నృపులద♦ర్పం బడంపఁ । దనవితరణ సము♦ద్భవహేమవర్షంబు,యాచక
కౌమంబు♦నడఁచుచుండఁ । దనదండ నీతిసం ♦ జనితభానుచ్ఛవు, లన్యా
యతిమిరసం♦ హతి నడంపఁ । దనసమున్నతవసు♦ ధాపాలనస్ఫూర్తి,
వర్ణాశ్రమోప ద్ర♦వము నడంపఁ ॥ తే. గీ॥ గవులు దప్పక నొప్పించి♦
కరము గొనక । తగనిదండం బొనర్పక ♦ ధర్మమార్గ । మించు కేనియు
విడువక♦ యేలె రాజ్య । మంగజాకృతి వేంకట♦రంగనృపతి॥ సీ॥ వేంక
టరంగరా♦ డ్విభునిరాజ్యపుఁ గాల, మాటింటిపై నొక♦ యబ్దమైన।
నంతలోనసె యాతఁ ♦ డగ్రహారమ్ము ల, నేకమ్ములొసఁగెమ♦ హీసురు
లకు । ఫలవృక్షము లనేక♦ ములు గల్గి విలసిల్లు, తోఁటలువేయించె♦
సూటి మీఱఁ । గొద లేక యేవేళ♦ నుదకపూరితము లౌ, చెఱువులు
చేయించె♦ విరివి మెఱయ॥ తే. గీ॥ మరియు నీరీతిఁ బెక్కు ధ♦ర్మము
లొనర్చె । నిలిపె నెప్పటియట్ల బొ♦ బ్బిలిపురంపు। రాజ్యమును బెక్కుఁ
దెఱఁగుల♦ శ్రమము నొంది । రాజమాత్రుండె వేంకట♦ రంగవిభుఁడు॥
తే.గీ॥పుత్త్రవంతుఁడు గామి నా♦భూవరుండు।బొబ్బిలికుటుంబశాఖయై♦
పొలుచుపాల । తేరుకాపుర మగురావు♦. వారియింట । జనన మొందిన

ఘను దత్త♦తనయుఁ జేసె । రాయఁడపరంగ నరపాలు♦రమ్యశీలు
సీ॥ శ్రీరాయఁడప్పరం♦ గారాయునరపతి, పదియేడునూఱుల♦ పయిఁ
దొంభదినహూణశకవర్ష♦మందు జనన మంది, పదునెనూఁడువర్షములఁ
ప్రాయము దన। కగుడు వేంకటరంగ♦జగతీపతికి దత్త,తనయుం డగుచు
బదు♦నెనిమిదిశత। ములపైఁ దృతీయాబ్ద♦మునఁ బదియవకెల, నిరువదీ
యొకటవ♦వరదినమున॥ తే.గీ॥శాశ్వతపుఁగాలఁగొనియెసం♦స్థానమునకు
నిండియాదేశ మెల్లన♦ఖండమహిమ। నేలుచుఁ బ్రభుత్వమునఁ జాలఁ
నెసఁగుబ్రిటిషు। దొరతనమువారివలనను♦గరిమ మెఱయ॥ ఉ॥ అమ్మను
జేశ్వరుండు వసు♦ధామరకోటికిఁ బెక్కులగ్రహా। రమ్ము లొసర్చి బొబ్బిలి
పు♦రమ్మున రాజమునంగు నన్నస। త్రమ్ముల నాల్గుజాతుల కు♦దారమన
స్కుత నిల్పి ధర్మకా। ర్యమ్ము లనేకముల్ సలిపి♦ఖ్యాతి యెసంగఁగ నేలె
రాజ్యమున్॥ మ॥ ఘనుఁ డాభూపవరుండు భక్తి యెసఁగం♦గా వేణు
గోపాలదే। వున కీబొబ్బిలిపట్టనంబునఁ గడుం♦ బొల్పారుదివ్యాలయం।
బును నిర్మింపఁగఁ బూని తత్ప్రచన నం♦పూర్ణత్వముం బొందులో। వనె
యాలోకము వాసి కైకొనియె శ్రీ♦నారాయణస్థానమున్॥ క॥జననుతుఁ
డాజనపతి కొని। యెనుగ్రయమునకుం గరాడ♦యెట్టేటును నం। బన
వలస యనెడి పేరఁ। ఘనతరమయి వన్నెఁ గన్న♦గ్రామముఁగూర్చ॥
ఆ. వె॥ కాశియాత్రఁ జేసి♦ గంగకావడిఁ దెచ్చి। నట్టివాని కెల్ల♦ నమ్మ
హీశుఁ।డొసఁగుచుండె భక్తి♦నొక్కొకరూప్యము।నిప్పటికిని నట్టి♦వీయఁ
బడును॥ చ॥ అవయవలోపముల్ గదిరి♦ యందునఁ జేసి స్వతంత్రజీవన।
మ్మువడయఁ జాలనట్టి జన♦ములే దనవీటికి రాఁగ లుప్తమా। నవయవ
మొక్కొటొక్కటికి♦నాదట నొక్కొక రూప్యమిచ్చున। య్యవనివిభుండు
తత్కృప మొ♦కంతయుఁ దప్పమ నేటి కయ్యెడ॥ క॥ శ్రీరాయఁడప్ప
రంగ। స్మారమణుఁడు నిత్య మొక్క♦ సాలగ్రామం। బారఁగ దాన
మొసంగు ను। దారత వేదవిదుఁ డైన♦ధరణి సురునకున్॥ క॥ ఏకా
దశీవ్రతం బా। భూకాంతుఁడు నియమపూర్వ♦ముగ సలుపుచుఁ దా।

శ్రీకాంతుని రుక్మాంగద । భూకాంతుని రీతిఁ దనిపి♦పొందె సుకృతమున్॥
క॥ చవి వొల్చెఁగి మాంసభక్షణ । ము వర్జనము సేఁత యధిక♦పుణ్యం
బని యు । య్యవనిపతి మాంసభక్షణ । ము విడిచి వర్తిల్లె నియమ♦
పూర్వముగాఁగన్॥ తే.గీ॥ ఆత్మవత్సర్వభూతాని♦యనెడు శాస్త్ర । వచన
మును బాటి చేసి య♦ వ్వసుమతీశుఁ । డెట్టిజంతువులకు హాని♦ పుట్ట
కుండఁ । బట్టి యెల్లప్పుడును గని♦ పెట్టుచుండె॥ క॥ ఆపన్న సంగమ
వశస । భూపతి నిశ్శంకనృపతి♦ మును గడుఁ గరుణన్ । గాపాడెను
రాయఁడప । క్ష్మాపాలవరుండు కొంత♦కాలము దనుకన్॥ చ॥ పురమున
వేదశాస్త్రములఁ♦ బూర్ణముగాఁగ నెఱింగినట్టి స । త్పురుషుల నుంచి
వారికిఁ బ్ర♦ భూత సుఖస్థితి నిచ్చి వారిచే । నిరత మనేక విద్యల స♦
నేకులు నేరుచునట్లు లక్ష్మహీ । వరుఁ డొనరించె విద్యలకు♦వాసముగాఁ
బుర మొప్పునట్లుగన్॥ సీ॥ అక్ష్మహీపతి కుద♦య మ్మైరి శ్వేతాచ, లపతి
రంగారాయ♦నృపతియును జ । నార్దనరంగరా♦యపతి సీతారామ,
చంద్రరంగారాయ♦జనవిభుండు। వేంకటరంగ రా♦యాంక ప్రభుండు నా,
నలరునాత్మజులు స♦మస్తసుగుణ । గణములఁ బూర్ణులు♦కమనీయరూపు
ల,య్యాత్మజుల్ దనుఁ గొల్వ♦నతఁడురాజ్య॥ తే. గీ॥ మేలి క్రీస్తుశకము
పదు♦నెనిమిది శత । ములపయిని ముప్పదవదయి♦పొలుచువత్స । రమ్ము
జనవరి యనెడుమా♦సమ్ము పదియు । నేడవదినమ్ము వైకుంఠ♦మెలమిఁ
గొనియె॥ క॥ ఖ్యాతుం డగురాయఁడప । క్ష్మాతలనాథుండు విష్ణు♦సద
నముఁ జేరన్। శ్వేతాచలపతిరంగధ। రాతలపతి పూనె నపుడు, రాజ్యభర
మ్మున్॥ క॥పదునెనిమిదివందలపైఁ।బదియునవత్సరమగస్టు♦పదియేనవనాఁ
డుదయించి యీనృపతి ము । ప్పదిరెండబ్దములు పృథివిఁ♦బరిపాలించెన్॥
ఉ॥ అక్ష్మహీతాత్ముఁ డిర్వదవ♦యబ్దమునందె యథోక్తరీతి రా । జ్యమ్మున
కేగుదెంచి యను♦మంతయు న్యాయముఁ దప్ప కేలి స । త్కర్మ్మములు లో
నుగాఁ దనదు♦తండ్రి యొనర్చినయట్టిధర్మకా । ర్యమ్ములు వృద్ధి నొందు
నటుల♦న్నివిధంబులఁ జేసెఁ బ్రాజ్ఞతన్॥ సీ॥చిరకీర్తి యైనశ్రీ♦శ్వేతాచ

లాధీశ, రంగరాయనృపాల♦పుంగవుండు । జనకునియుద్దేశ♦మును
వేర్పుట్ల తనకునువిధిమైన♦పని యగుటను। రాయఁడప్పావని♦రమణుం
గట్టింప, మును శ్రీతితోఁడను♦మొదలు చేసి । నట్టియాలయము స
మగ్రముగాఁగ ని, ర్మించి మించినభక్తి♦మెఱయ నందు । శ్రీవే
గోపాల♦కృష్ణదేవుని రుక్మి, ణీసత్యభామల♦తో సమేత॥ తే. గీ॥ ముగః
బమనెనిమిదిశత♦ములకు మీఁద । ముప్పదేడవశకవర్ష♦మునఁ బ్రతిష్ఠ
సలిపి పదివేలరూప్యముల్♦సరిగ వత్స । రమ్మునకు వచ్చుభూము ల♦ర
ణము చేసె॥ శా॥ శ్వేతాద్రీశ్వరరంగరాయవసుధా♦సీమంతినీనాయకుఁ
డేతద్రాజ్యములోనఁ జేరినదిమై♦యేపారుచున్నట్టిశ్రీ । సీతారామపురి
బ్రతిష్ఠఁ గని సు♦శ్రీ మీఱుచున్నట్టిశ్రీ । సీతారాములకుఁ సమర్
ణముఁ జే♦సెఁ భూము లీతీరునన్॥ సీ॥ అమ్మహీవరుఁడు రా♦జ్యము
నేలేడు వేళఁ, బదునెనిమిదినూర్ల♦పయిని మూఁడు। పదులపై రెండవ
వత్సరమ్మునను గం, జముమండలమున వి♦శాఖనగర । మండలమ్మున
జాల♦మెండుకొన్న పితూరి, దారులచేఁ గల్గు♦నారటంబు। వారించుటకు
నయి♦ప్రత్యేకముగఁ గమి,షనరుగ నేర్పాటుఁ♦గనినయట్టి॥ తే.గీ॥ రసలు
దొరవారు గోర గౌ♦రవము మెఱయఁ । దగిన సేనను బంపి యు♦ద్ధాని
చేబి । తూరిదారులఁ బట్టించి♦దొరతనంబు।వారి మెప్పును గాంచెనా♦
ప్రభువరుండు॥ సీ॥ శ్రీమంతుఁడై యొప్పు♦శ్వేతాచలపతి రం,గారాయనృ
పతి శే♦ఖరుఁడుమాడు। గులుజమీందారుని♦వలన దండి సురవ, రము జగ
న్నాథపు♦రమ్ముపీని । ప్రాంతంబులైనయ♦ప్పలరాజపురమును, వంతర్ల
పాలెము♦పప్పుసెట్టి । సేరియుఁ గొనియెను♦జీడికాడయు జగ, న్నాథ
పురమ్ము న♦నంగ నొప్పు॥ తే.గీ॥ చుండు నెస్టేటు గొనియెను♦మండపాక।
కులజుఁడైన జగన్నాయ♦కునివలనను । నన్నుగుణంబైనయట్టి క్ర♦యమ్ము
నిచ్చి । రాజ్య మభివృద్ధి సెసఁగంగఁ♦బూజ్యగతిని॥ తే. గీ॥ కలబరిగివంశ
జుఁ డగు భా♦స్కరనృసింహ । రావుపంతులవలన నా♦రాజవరుఁడు । గొని
యెఁ గింతలి మంతెన♦యసెడుపేర్లఁ । బరఁగుహుండాల సోదరీ♦పతికి

నొసఁగ॥ సీ॥ వేలంబులోపల♦విజయరాఘవపద్మ, నాభరాజను జంపె♦
నకులజుని మెు। ఖానయై విజయన♦గరరాజ్యమంమన, వెలయునన్న
మరాజు♦పేఁటకొత్త వలస నాఁ దగుగ్రామ♦ములు దంతులూరివా, రి
మొఖాస యైనగ్రా♦మమును దుమ్మ। పాలను బెద్దింటి♦వారివలన జమ్ము,
గుజ్జంగివలస యా♦పజ్జ నంబ॥ తే గీ॥ టివలసయు మరి దువ్వాపు♦నవలఁ
జింత। పల్లిపేఁట సేరీపేఁటఁ♦బదియును నెని। మిదిశతంబుల పై నలు♦
వదిఁట మూఁడ।వదియయిన యేఁటఁ గొనియె నా♦ప్రభువరుండు॥ మ॥
తనకుఁ భావుకుఁడై దివా నయినసీ♦తారామయఖ్యాతుతో। ల్తన
యుండై తగురామరాయమణికిఁ♦దాఁ గింతలిఁ మంతెనఁ। జనకుం
డిచ్చినయుంగరాడను మన♦స్సంశుద్ధితో నిచ్చి చే। సెను బొప్పిపైిట
రు గాఁగ నవ్విభుఁడు హ♦ర్షింపం గడుం బాంధవుఁ॥ తే. గీ॥ మరియు
నొకభావుకుండయి♦పరఁగుచున్న। రాజగోపాలరాయని♦కాజనపతి।
చీడికాడయెస్టేటును♦ జిత్త మరల।నొసఁగి ప్రొప్పైిటరుగఁ జేసెఁ♦బొసఁగ
నతని॥ శా॥ దాతృత్వంబు దయారసంబు భగవ♦త్కైంకర్య నిష్ఠాప్తి
యుఁ। భూతవ్రాతహితప్రవృత్తియు సహో♦ద్భూతంబులై యొప్ప
నా। శ్వేతాద్రీశ్వరరంగరాడ్విభుఁడు చే♦సెఁ భూమిదేవాళికిఁ। ఖ్యాత
ప్రక్రియ నగ్రహారము లనే♦కంబుల్ మనః ప్రీతితోఁ॥ క॥ తను నమ్మి
కొలుచు సేవక। జనులకు నవ్వారిగాఁగ♦స్వర్ణము గృహముల్। ధన
ములు భూములు గ్రామము।లనేకము లొసంగె నలజ♦నాధిపుఁడుతగఁ॥
సీ॥ హరిభక్తియందుఁ బ్ర♦హ్లాదుని దలఁపించు, నమ్మహీశుఁడు ప్రత్య♦
హమ్ము దెల్ల। వాఱుజామున నె గో♦పాలదేవునియాల, యమునకు నేగి
భ♦క్త్యతిశయమున। భగవంతు సేవించి♦భవనమ్మునకు వచ్చి, స్నా
నాదికృత్యముల్♦సలిపిపిదప। భోజనమ్మునకును♦బూర్వము దేవుని, దర్శించి
నుపలసం♦ధ్యాసమయము। నందును దేవుని♦సందర్శనముఁ జేయు, నిది
నిత్యకృత్యమై♦యొసఁగునతని॥ తే. గీ॥కిట్టి విహాపరముల నించు♦కేనిలోప।
మెనయఁ కుండఁగఁ బొల్చె నా♦ జనవరుండు। తోడిరాజులు పొగడంగఁ♦

వాడి గలిగి । తగదె యాతని వర్ణింప♦జగతి మనకు ॥ క॥ ఆపదల మునుఁగ కుండఁగఁ । గాపాడె ఋణంబు లిచ్చి♦కరుణాపరుఁడై । భూ పాలుర నెందఱనో । యాపుణ్యుం డధికసుకృత♦మందుట యరుదే ॥ చ॥ పురమున నల్లడఁ నికట♦భూములఁ దీయనినీరు గల్గుపు । ష్కర ణుల రాష్ట్రిమం దతివి♦శాలముగై జలపూరితంబు లౌ । చెఱువులఁ బెక్కుతోఁటలను♦జెల్వుగ నిల్పి మహీవరుండు సో । దరజనకాదినామ ములు ♦ దైవము పేరులె యుంచె వానికిఁ॥ ఉత్సాహ॥ చాల ధనము వ్యయము చేసి♦సత్యశీలుఁ డమ్మహీ । పాలవర్యుఁ డిప్పురంబు♦పజ్జనిల్పె వేణుగో । పాలవల్లభం బనంగఁ♦బరఁగుచుండునట్టిమేల్ । పూలతోఁట నొక్కదానిఁ♦బుష్కరిణికిఁ జెంగటఁ॥ తే. గీ॥ అట్టి శ్వేతాచలపతిరం♦గావనీంద్రు। పేరఁ గోదండరామాఖ్య♦విబుధుఁడంకి । తమ్ముగ నొనర్చె నీప్రబం♦ధమ్ము నెలమి । దాని సందర్భ మిూక్రిందఁ♦గానఁబడును॥

క॥ ఏవంవిధగుణవితతికి।భావభవాకృతికి హృదయ♦పద్మనిహితసీ।తా వల్లభాంఘ్రియుగరా । జీవదళితదురితతతికి ♦ క్షితిధరధృతికిన్॥ క॥ వీరు నకు సకలసుగుణా । ధారున కరిభయదఖడ్గ ♦ ధారునకుఁ గుభృ । ద్ధీరు నకు మహోదారున । కారాధితవైష్ణవాగ ♦ మాచారునకున్ ॥ రేచ ర్లగోత్రునకు విహి । తాచరణపవిత్రునకు వ ♦ రాంగీనుతస । ధ్రీచీనగా త్రునకుఁబటు । యాచకవనచైత్రునకు హ ♦ తామిత్రునకున్ ॥ మార జయంతసమానా । కారునకుం జల్లమాంబి ♦ కారాయఁడప । త్మారమ ణకుమారునకుఁ । భూరితరభుజాగ్రనిహిత ♦ భూభారునకున్॥ రంగద భంగశతాంగతు । రంగమతంగజపదాతి ♦ రాజద్ధ్వజినీ । సంగతభూ భరఖిన్నభు । జంగమవరకమఠ కరటి ♦ శైలేంద్రునకున్॥ చటులతర పటహజనితో । త్కటభాంకృతిదళితపద్మ♦గర్భాండున । కుద్భటభటపటి ష్ఠహేతి । స్ఫుటహేతిత్రుటితశుచిన♦భోమణిఘృణికిన్॥ వ॥ అభ్యుదయప రంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన ప్రపదనపారిజాతం బనుదివ్యప్ర బంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన॥ సీ॥ సకలాగమంబుల ♦ సకలా

గమంబుల, దీపించుచున్నన ♦ ద్విజచయంబు । సుమనోగణంబుల ♦
సుమనోగణంబులఁ, గని సంతసిలుమాధు ♦ కరకులంబు । రామపాద
ములందు ♦ రామపాదములందు, రసమొందుకన్యకా ♦ ప్రకరములును।
బద్ధాసనమ్ములఁ ♦ బద్ధాసనమ్ముల, సతతమ్ముఁ దనరుహం ♦ సవ్రజంబు॥
తే. గీ॥ గల్గి శ్రీమన్ముకుందాంఘ్రి ♦ కమలయుగళ । సంతతధ్యానయో
గని ♦ ష్ఠాగరిష్ఠ । కోవిదావాసయోగ్యని ♦ కుంజపుంజ । రంజితం బగునై
మిశా ♦ రణ్యమందు॥ చ॥ మునివరు లాచరించుమఖ ♦ ముల్ గన
వచ్చునిలింపకోటి కొ । య్యన మకరందపూరముల ♦ నర్ఘ్యము పాద్య
మొసంగి షట్పద । ధ్వనులను బల్కరించి సుమ♦తల్పములందు వసింపఁ
జేసి పం । డినఫలముల్ భుజింపఁగ ఘ♦టింతురు తద్వనవల్లికాంగనల్॥
మ॥ పులులం జేరి చరించు గోవులు మృగం ♦ బుల్ చిట్టెడుల్ గూడి
వ । ర్తిలు సింగంబులు గున్న యేనుఁగుల న♦ర్థింబెంచు మార్జాలి రా। చిలు
కం జేరికసేయు సైరిభములం ♦ జేపట్టు నశ్వంబు లు। జ్జ్వలమాసింద్రత
పః ప్రభావయుతమై♦ వర్ధిల్లునక్కానలోన్॥ క॥ మునిహోమధూమ మం
బర । మున కేగెడివేళ యాగ ♦ ముంభాగంబుల్ । గొన వేల్పులఁ
బిలుచుటకై । యనిమిషలోకమున కరుగు ♦ నట్లు తగు వనిన్॥ సీ॥
శ్రీచూర్ణచిహ్నాల ♦ క్షితధవళోర్ధ్వపుం, డ్రములు ఫాలంబులం ♦
దమరువారు । నారాయణముకుంద ♦ నరహరిగోవింద, యంచు శ్రీహ
రిని గీ ♦ ర్తించువారు । జలజాక్షమాలికల్ ♦ తులసిపూసలపేరు, లెల
మి వక్షములఁ జె ♦ న్నలరువారు । జలజనాభునియందు ♦ సంసక్తహృ
దయులై, మాటిమాటి కొడళ్ళు♦మఱచువారు॥ తే.గీ॥ సాత్త్వికపురాణ
ములు దెచ్చి ♦ చదువువారు । గంధపుష్పఫలాదులఁ ♦ గమలనాభుఁ।
బాంచరాత్రోక్తసరణిఁ బూ ♦ జంచువారు। తద్వనంబునఁ దనరారు ♦
తపసు లెల్ల॥ వ॥ మరియు రసాలతాలహింతాలతక్కోలతమాలపనసా
మ్రకపిత్థామలకబిల్వపిచుమందవటాశ్వత్థజంబూకదంబనింబ ఖర్జూరనారి
కేళవకుళచంపక మల్లికామాగధీ మందారకరవీరకోవిదారకదళీపు

వ్నాగతిందుకప్రముఖ సకలవిటపిమతల్లికాభిరామంబును లాలిత్యాతిర
స్కృత చైత్రరథనందనారామంబును సింహశరభశార్దూల సైరిభసామ
జవృకజంబుకశశచమరీకృష్ణమృగభల్లూకప్లవగగోలాంగూల కడంగరీ
యస్సైంధవ ఖడ్గవరాహప్రముఖాన్యోన్య జాతివిరోధ విరహితవివిధమృ
గసమేతంబును దరుచ్ఛాయాతిశీతంబును గీరశారికాషట్పదబకశకుం
తకారండవ చక్రచకోరక్రౌంచచటకకోకిలా హంసర్షిమయూరగరుడ
గండభేరుండ వాయసాదివిహంగ మోత్తుంగనినాదముఖరితంబును ఫల
పుష్పసమిచ్ఛదభరితంబును విమల కమల కల్హారసుధామాధురీ ధురంధ
రబంధురకబంధకలితకాసార కల్లోలమాలికావగాహనాలసాలస సమీ
రకిశోరవారాపహృతపథికజన శ్రమంబును వర్ధితశమంబును గగనమం
డలావధిక విరాజమాన మణిగోపురమండప ప్రాకారదీర్ఘికాంచితకును
మవనసమేత ప్రాసాదమధ్యంగత శ్రీమన్నారాయణ చరణకమలసేవార్థ
యాతాయాతభాగవత సుందరీ సుందరతర కచబంధ కూటజలధరపట
లసందర్శన నటన్మయూరపింఛాలంకృతంబును బరిపాలితసుకృతంబు నగు
చు మహాభారతంబునుం బోలె భీమార్జునాతిశయసంకులంబై శ్రీభాగ
వతంబునుంబోలె హరిప్రభావబంధురంబై స్వర్గలోకంబునుంబోలె సుధ
ర్మాశ్రయంబై నందనవనంబునుంబోలె మందారసంతానసహితంబై
బ్రహ్మలోకంబునుంబోలెఁ బుణ్యాతరాగమాంతగంధభరితంబై వారవ
ధూ సౌందర్యంబునుంబోలెఁ బల్లవాతనుసుఖప్రదంబై ధనికగృహం
బునుంబోలె సమంచితకాంచనంబై హిమవన్నగంబునుంబోలెఁ బున్నా
గభరితంబై తసరారి బహుమహీజాన్వితంబై యమితసుకృతిజనకంబై
మిథిలాపురింబునుం గ్రేణిసేయుచు బహుళగజరిపుసంకులంబై పర్వతసు
తాసీకాశ్రయంబై కైలాసంబును ధిక్కరించుచు ననంతధర్మాభిరామంబై
మనుసమాజాశ్రయంబై భానుసంతానంబును దిరస్కరించుచుం దపః
ప్రభావభరితంబయ్యును బుండరీకాశ్రయంబై హరిబలాక్రాంతం బయ్యు
ను బలాశిపరిపూర్ణంబై బ్రహ్మవిద్యాభరితం బయ్యును బహువిటపాశ్ర

యంబై ఋగ్యజుస్సామాథర్వణ వేదఘోషసంకులంబును హరికైంకర్యపరాయణానేక భాగవతాశ్రయంబును విశిష్టాద్వైత సిద్ధాంతబద్ధంబును బ్రపన్నజన శరణ్యంబును సంపాదితపుణ్యంబును యతివరమతానుగుణ్యంబును సకలాశ్రయహిరణ్యంబును మోక్షరమాపణ్యంబును నైన నైమిశారణ్యంబునందు॥ శా॥ సూతున్ మాధవపాదపద్మయుగళీ♦ స్యూతాతి శుద్ధాశయా। న్వీతున్ శ్రీపతిసచ్చరిత్రకథనా ♦ నీతున్ ముకుందాంఘ్రిసం। జాతున్ గాఢతమశ్ప్రభాతుఁ గరుణా♦సత్యక్షమాశాంతివి। ఖ్యాతుఁ సంతతహృష్టసర్వమునిసం ♦ ఘాతుఁ బ్రశంసించుచున్॥ తే. గీ॥ బ్రహ్మవిదులైన శౌనక♦ప్రముఖమునులు। నిత్యహరిసేవనాదులు♦ నెఱపికృష్ణ। పాదపంకజయుగళసం♦ బంధ మొప్ప। కథలువినఁగోరి యాతని ♦ కడకుఁ జేరి॥ క॥ సూతునిచే సంపూజితులై। తాపసవరులు నిజని ♦ జాసనముల సం। ప్రీతి నుపవిష్టులై స్తని। తాతిశయా ర్భటి వచించి ♦ రాతనితోడన్॥ సీ॥ పాతకవ్రాతజీ ♦ మూతసంతతికిఁ బ్ర, భంజనంబులు వృత్ర ♦ భంజనములు । రాగమోహామదాది♦నాగంబులకు మృగ, వల్లభంబులు పక్షి♦వల్లభములు। యోగీంద్రనివహాను ♦ హోత్పలంబుల కర్క, మండలములు చంద్ర ♦ మండలములు। జననజరామృత్యు ♦ ఘనతమస్తతికిఁ బ్ర, భాకరమ్ములు ప్రతి♦ భాకరమ్ము॥ఆ. గీ॥లనృతదంభలోభ♦వనరాసులకుఁ గుంభ।సంభవంబులరణి♦సంభవంబు। లహాహవిష్ణుసత్క♦థామృతంబులు వాని। వినుటకంటెదొడ్డ♦తనము లేదు॥ చ॥ కలుషలతాలవిత్రములు ♦ ఖండితకామమదాదిగోత్రముల్ । సులలితయోగిపాత్రములు ♦ శోభనగాత్రము లార్యజైత్రముల్ । ఖలజననేత్రముల్ సుకృత ♦ కర్మవనీఘనసైత్రముల్ సము । జ్జ్వలతరమోక్షసూత్రములు ♦ సారసనాభచరిత్రముల్ మహిన్॥ సీ॥ హరికృష్ణగోవింద ♦ గరుడకేతన యంచు, నిరతంబు వచియించు ♦ నీచుజిహ్వ। కంటఁగస్తైనరీతిఁ♦ గంజాక్షురూపంబు, గనుపట్టుచుండు నీ ♦ మనమునందు। హరిసేవనంబు దా ♦ స్యం బర్చనంబును, గావించుచుండు నీ ♦ కరము లెపు

డు। అర్చావతారుఁడై ♦ హరి వసించినచోటి, కరుగుచుండును నీదు ♦ చ
రణయుగము॥ తే. గీ॥ భాగవతధర్మవేదివి ♦ పరమపురుష। భక్తులం దగ్రణి
విదివ్య ♦ భవ్యనవ్య। సుగుణరాశివి వ్యాసశి ♦ ష్యుఁడవు నిను ను। తింపఁగా
జాలుదుమె సూత ♦ ధీసమేత॥ ఆ. గీ॥ మున్ను ద్వాపరాంత ♦ మునఁ బురాణ
ము లెల్లఁ। దెలిపి తీవు మేము ♦ తెలియ వింటి। మందు హరిప్రపత్తి ♦ "య
రణిగతాగ్నిశి। ఖాళిరీతి గూఢ ♦ మగుచు నుండె॥ ఆ. గీ॥ భువినిగర్మయోగ ♦
మును జ్ఞానయోగంబు। భక్తియోగమును బ్ర ♦ పత్తి యనెడి। సాధన
ములలోనఁ ♦ జక్రి మెచ్చిన యుపా। యంబు ప్రపదనం బ ♦ టంద్రు బు
ధులు॥ తే. గీ॥ శ్రీవిభునియాజ్ఞచేతను ♦ శేషుఁడవని। యందు రామాను
జాఖ్యతో ♦ నవతరించి। శిష్యులకుఁ బ్రపదనమెల్లఁ ♦ జెప్పె ననుచు। సంగ
రాశనువలన వి ♦ నంగఁ బడియె॥ మ॥ ఏటికిఁ జక్రి శేషుని మ ♦ హీస్థ
లికిం జను మంచుఁ జెప్పె నే। వీట నతండు పుట్టెఁ బృథి ♦ వీస్థలి నెట్లు చ
రించె శిష్యులన్ । వాటముగాఁగ నెట్లు కొనె ♦ వారల కెట్లుప్రపత్తిఁ జె
ప్పె నీ। నోట వినంగఁ గోరితి మ ♦ నూనగతిన్ వివరించి తెల్పుమీ॥
క॥ పారాశర్యమునీంద్రుని। కారుణ్యరసంబునం ద్రి ♦ కాలజ్ఞతఁ జె। న్నా
రెడి నీవెఱుఁగని శ్రీ। నారాయణుకథలు జగము ♦ నన్ లేవుగదా॥
క॥ అనిశౌనకుండు వలికిన। విని సూతుఁడు విష్ణుభక్తి ♦ వివశుండై
కాం। చనచేలుని ఘనశీలుని। మునిలోలుని మదిఁదలంచి ♦ మ్రొక్కియు
తనితోన్॥ క॥ సురనరకిన్నరవిద్యా। ధరగరుడోరగనిశాట ♦ తాపసు
లందె। వ్వరికైన సకృత్యముగా। శరణాగతి తెలియ దిది ని ♦ జము
మునీంద్రా॥ క॥ హరిమూర్తియైనమామక। గురునికటాక్షంబుచేన ♦
కుంఠిత మగు నీ। శరణాగతిమార్గము నే। నెఱిఁగితి నీక దీని మీకు ♦ ని
పు డేర్పఱతున్॥ మ॥ హరివాల్లభ్యముచే సుధారసము దు ♦ గ్ధాంభోధిలోఁ
దోఁచునై। ఖరి రామానుజమౌనివర్యకృపచేఁ ♦ గన్పట్టువేదాంబుధిం।
బరమంబైన ప్రపత్తిమార్గరస మే ♦ పారైనఁ ద్రావన్ నరుల్। మరి జ
న్మింపరు ముక్తి కేగెదరు సా ♦ మర్థ్యం బవంధ్యంబుగన్॥ క॥ అరుణంబు

లు॥ నిగమాంతా । భరణము లగువిష్ణుపాద♦ పంకజములకున్ । శరణము
చొచ్చినమనుజుఁడు।హరిపురమున కేగి సంత ♦ తానందుఁ డగున్॥ తే.
గీ॥ ఇంచుకంతైనఁ గర్తృత్వ ♦ మెపుడు గొనక । పరమపురుషునిపై నిజ
♦ భార ముంచి। హరిని బూజించుచును సుకృ♦తాఘరహిత । పద్ధతిఁ
జరించుచుండుఁ బ్ర ♦ పన్నుఁ డెపుడు॥ సీ॥ తరువులలోఁ గల్ప ♦ తరువు
చందమున ధే,నువులందుఁ గామధే♦ నువువిధమున । గిరులలోపల మేరు
♦ ధరణీధరంబట్లు, నదులలో జాహ్నవీ ♦ నది తెఱఁగున । మానులలో
వ్యాస ♦ మానీంద్రుమాడ్కి సుం, దరులందు జానకీ ♦ తరుణిపోల్కిఁ ।
తారలలో సుధా ♦ ధామునిపద్ధతి, గ్రహములలోన♦భాస్కరునిరీతి॥ తే.
గీ॥విద్యలందును వేదాంత ♦ విద్యజాడ । వేల్పులందును నల్లని♦వేల్పుపగి
దిఁ । బద్మనాభునిపైఁ జేయు ♦ ప్రపదనంబు । మోక్షసాధనములలోన♦
ముఖ్యతమము॥ క॥ అతిసులభం బతిగూఢం । బతిగాఢం బఖిలజనస ♦
మారాధ్యము సం। చితకర్మనాశకర మా । శ్రితకల్పకమీప్రపత్తి ♦ సె
ప్పం దరమే॥ తే.గీ॥ అంధునకుఁ జూపు పంగున♦కద్వగతియు । మూకున
కు వేదపఠనంబు ♦ ముష్కరునకు । సత్యవాక్యముఁబోలె న ♦ సాధ్యమ
గును। బ్రపదనము లేనివానికిఁ ♦ బరమపదము॥ క॥ హరికరుణాసంపూ
ర్ణుఁడు । పరమోపాయంబు తనకుఁ ♦ బ్రపదన మనుచున్ । శరణాగతుఁ
డై పొందును । బరమపదము యోగిజనులు ♦ ప్రస్తుతి సేయన్॥ మ॥
మును రామానుజమౌని శిష్యులకు స ♦ మ్మోదంబుతోఁ జెప్పె నం । చు
ను సూతుండు వచింప శౌనకముసీ ♦ శుం డాతనిం గాంచి యో । ఘన
వృత్తాంత మెఱుంగ మాకు మదిలోఁ ♦ గౌతుహలం బయ్యె మ । న్నన
తోఁ జెప్పు మ టన్న సూతుఁడును స♦న్మానంబుతో నిట్లనెన్॥ సీ॥ మణి
మయప్రాకార ♦ మండపంబులతోడ, రమణీయతరగోపు ♦ రములతో
డ । మహనీయతరహేమ ♦ మందిరంబులతోడ, విమలతరోద్యాన ♦
సమితితోడ । ఘనసుధాసంపూర్ణ ♦ కాసారములతోడఁ, గర మొప్పుచు
న్నయ ♦ చ్చరలతోడ । దక్షకశ్యపముఖ్య ♦ తాపసావళితోడ, సకలలో

కాధికో♦జ్జ్వలతతోడ॥ తే.గీ॥ రూపవంతమ్ములైనత్ర♦యీపురాణశాస్త్ర
పుణ్యానదీసద ♦ సవనధర్మ । యోగసాంఖ్యాదికములతో ♦ నొప్పు మిగి
లి । కనకగిరిమీఁద బ్రహ్మలో ♦ కంబు దనరు॥ ఉ॥ పచ్చనివాఁడు విష్ణు
పద ♦ భక్తి వెలింగెడువాఁడు వాణిపై । ముచ్చటగల్గువాఁడు నలు ♦
మోములవాఁడు త్రయీపురాణముల్ । మెచ్చినవాఁడు లోకముల ♦ లీ
ల సృజించినవాఁడు పాపముల్ । వ్రచ్చినవాఁడు తద్భువన♦వల్లభుఁడైన
విధాత ప్రీతితోన్॥ క॥ కనియె సనకుని సనందను । సనత్కుమారుని స
నత్సు ♦ జాతుని వారల్ । దనుజారిపాదపద్మము । లనుపమగతిఁ గొల్చు
చుండు ♦ రాత్మలయుండున్॥ చ॥ హరిపదభక్తియుక్తులు స ♦ మంచిత
తేజులు బ్రహ్మభావనా । పరులు మహానుభావులు కృ ♦ పారసపూర్ణులు
యోగిసత్తముల్ । పరిహృతకామరోషులు సు ♦ పర్వగణస్తవనీయు లా
గమా । భరణులు శాంతిదాంతిముఖ♦భవ్యగుణుల్ సనకాదు లిమ్మహిన్॥
క॥ ఆనలువు రొక్కతఱి చతు । రాననగృహనికటకల్ప ♦ కారామగ
తా । నూనమణివేదియందా । సీను లగుచు విష్ణుమహిమఁ ♦ జెప్పుకొను
తఱిన్॥ క॥ స్ఫురితము లయ్యెను వారల । పరిశుద్ధము లైనహృదయ ♦ ప
ద్మంబుల ని । ద్ధరణీతలంబు సకలము । దురితాన్విత మగుట పుణ్య ♦ దూ
ర మగుటయున్॥ క॥ కరుణారసభరితాంతః । కరణు లగుచుఁ జింతఁ
బొంది ♦ కమలభవసుతుల్ । హరితోడఁ జెప్పి జనములఁ । బరిశుద్ధులఁ జేయ
మదిని ♦ భావించి తగన్ ॥ ఉ॥ అంబుజమిత్త్రమండలస ♦ హస్రలసన్మణి
కాంచనప్రభా । డంబర మెల్ల దిక్కులఁ గ ♦ డల్కొనుదివ్యవిమాన మె
క్కి మా । ర్గంబునఁ బుణ్యలోకములు ♦ గాంచుచు వానిసమృద్ధి కాత్మచి
త్తంబుల సంతసిల్లుచును ♦ దాపసు లేగిరి చక్రిపీఠికిన్॥ స్రగ్ధర॥ కని
రావాగ్జానిసూనుల్ ♦ కలితనవతటి ♦ ఘర్మవేళాదిమధ్యం । దినమార్తండా
ఘ్యదాంచ ♦ ద్వీపులమణివిభా ♦ దీప్తసౌధాగ్రజాగ్ర । ద్ఘనభేరీభూరినిర్ఘా♦
దదళితజలదా ♦ ధ్వస్ఫుటాలంబదండ । ధ్వనతానూనుధ్వజాళీ ♦ వినుతపట
చయా ♦ న్వితవైకుంఠలక్ష్మిన్॥. తే. గీ॥ హీరమయగోపురప్రభా ♦ పూర

మగ్న। వినుతతాళశతోత్తాల ♦ కనకసాల। మాపురంబున నావర ♦
ణాంబుగుంభి। తాంబుజభవాండభాండంబు ♦ డంబుఁ బూను॥ మ॥ సరసీ
జాప్తసహస్ర మొక్కటఁ జేఁబ్రా ♦ కైచ్ఛలంబునం బోఁచునై। ఖరి వర్షావ
సరంబునం గగనభా ♦ గం బెల్ల విద్యుత్ప్రభా। భరితంబైన తెఱంగునం
బురముల్ ♦ బ్రహ్మాండభాండోద్భవ। స్ఫురజాంబూనదభూరికాంతివితతుల్ ♦
భాసిల్లు నశ్రాంతమున్॥ తే.గీ॥ తత్పురము కట్టుతటి వన్నె ♦ తక్కునైన।
పసిఁడిపూఁదెలు నభముపైఁ ♦ బొఱనైచి। రవియె సున్ము సుధాంశుచం ♦
డాంశుతార। కాగ్రహమ్ములై వెలుఁగు లో ♦ కంబులందు॥ క॥ యోగం
బును గర్మఫల। త్యాగము వేదాంతబుద్ధి ♦ దనరుజనులకుఁ। భోగార్హ
మైనతత్పుర। మేగతి వర్ణింప శక్య ♦ మెవ్వరి కైనన్॥ సీ॥ మణిగోపురా
గార ♦ మండపోజ్జ్వలము కాం, చనమయప్రాకార ♦ సప్తకంబు। బహుళ
మందారాది ♦ పాదపోద్యానంబు, గోమేధికోపల ♦ కుట్టిమంబు। ఘనత
రామృతపూర్ణ ♦ కాసారనిర్ఝరం, బమృతాతిశాయిఫ ♦ లాన్వితంబు।
సైంధవద్విపభట ♦ స్యందనోదీర్ణంబు, హరినీలకృతకృత ♦ కాచలంబు॥
తే. గీ॥ వజ్రమయదండకల్పిత ♦ ధ్వజయుతంబు। స్థూలముక్తామయవి
తాన ♦ జాలకంబు। గోగయుతకామధేనుసం ♦ ఘుష్టమగుచుఁ। బరఁగు
నప్పురి కన్నుల ♦ పండువుగను॥ చ॥ జలధరనీలదేహులు వి ♦ శాలవి
లోలవిలోచనాంబుజుల్। కలితచతుర్భుజాన్వితులు ♦ కాంచనచేలుసు
హీరరత్న కుం। డల కటకాంగుళీయమకు ♦ టప్రముఖాభరణాన్వితుల్
సము। జ్జ్వలితసితోర్ధ్వపుండ్రు లగు ♦ చక్రిభటుల్ చరియింతు రప్పురిన్॥
సీ॥ తొలుకారు మెఱుఁగుఁదీ ♦ గెల మించు దేహముల్, తళతళలాడు నే ♦
త్రములసొబగు। కలువ లే వని మెంచఁ ♦ గాఁ దగుమధ్యముల్, కాదం
బినులఁ బోలు ♦ కచభరములు। బింబఫలంబుల ♦ బెదరించు మోవులు,
తలిరులరీతి భా ♦ సిలుపదములు। కనకకుంభముల ట్లు ♦ కనుపట్టుకుచ
ములు, హల్లకంబులఁ గేరు ♦ హస్తములును॥ తే. గీ॥ నిండుచందురు
హసియించు ♦ నెమ్మొగములు। స్వర్ణకాహళముల [illegible]లు ♦ జంఘికలును।

గరికరంబులవై ఖరిఁ ♦ బరఁగుతోడలు । గలిగి చరియింతు రప్పురి ♦ కాంత లెపుడు॥ క॥ భేరీమృదంగకాహళ । భూరితరధ్వానములను ♦ బోషించుచు శ్రీ । నారాయణకరగతశం । ఖారావముతత్పురమ్ము ♦ నందలరారున్॥ మ॥ ప్రళయాదిత్య సహస్రమండలవిభా ♦ ప్రఖ్యాతమై దానవో । జ్జ్వలదృగ్భీషణమై స్ఫురత్కహకహా♦ధ్వానాన్వితంబై రమా। లలనావల్లభ పార్శ్వభాగగతమై♦ రాజత్సహస్రారమై । జలజాతాసనసేవ్యమై వడిఁ దగున్ ♦ జక్రాయుధం బప్పురిన్ ॥క॥ అనుచున్ సూతుఁడు దెల్పిన । విని శౌనకముఖ్యమౌని ♦ విభు లెల్ల ముదం।బున నవ్వలికథ మాకున్ । వినిపింపు మటంచు భక్తి ♦ వెలయఁ బలుకఁగన్॥

మ॥ నవకారుణ్యనదీన దీనజనదై ♦ న్యధ్వంసనాయత్తసుద్రవిణాసంఖ్యనిధీన ధీనయయుతో ♦ ద్యన్మిత్రసంతాన తా । నవయాతాహిత మాన మానవనుతా ♦ నంతోజ్జ్వలద్దాన దా । నవవిద్వేషిసమాన మానమదశూ ♦ న్యప్రాజ్ఞకోటిస్తుతా॥ అంత్యనియమఘటిత షోడశవిధ కందము॥ వీరాదివీర ధర్మో । దారా చారుతరహార♦దైన్యవిదారా।మేరుగిరిధీర దానా । ధారా నీరధిగభీర ♦ ధనవిస్తారా॥ లయగ్రాహి॥ క్రూరపటుసారయుతవీరభటవారహతవైరివసుధారమణ చారుతరహస్తా । దారనఖపూరదళి తోరుతరసారగణికారు చిరహారయుతభూరికుచకుంభా । శారదపటీర హిమనారదబలారిగజహీర నవహారఘనసారశశితారా క్షీరమయవారినిధిపారదతుషారగిరినీరజకుమార హయతారసితకీర్తీ॥

గద్య॥ ఇది శ్రీమదుభయకవిత్వరచనానల్పచాతుర్య కొట్కాల పూడివంశకమలవనసూర్య హారితసగోత్రధుర్య జ్యోతిషాగమాచార్య శ్రీమన్నారాయణాంబుజధ్యానగతస్థైర్య సకలమతవేదాంత సిద్ధాంతాని వార్య వేంకటకృష్ణసోమయాజికుమారవర్య కోదండరామార్య కార్యంబైన ప్రపదనపారిజాతంబునందుఁ బ్రథమాశ్వాసము॥

శ్రీకృష్ణార్పణమస్తు॥

శ్రీరస్తు.

# ద్వితీయాశ్వాసము.

శ్రీజానిపాదయుగళాం । భోజవిధేయా దయాది ♦ భూరిసుగుణవి। భ్రాజిత సుగుణాధేయా । రాజ శ్వేతాచలపతి ♦ రంగారాయా॥ వ॥ అవధరింపుము సూతుండు శౌనకాదిమహామునుల కిట్లనియె॥ క॥ ఈరీతిం దనరారుము। రారిపురముఁ జేరి గోపు ♦ రాంతికమునఁ దౌ।వారికుల చెంత బ్రహ్మకు । మ్రారులు పుష్పకము డిగ్గి ♦ మహితగమను లై॥ క॥ వైకుంఠ పురముఁ జొచ్చి నిరా । కులులగువిష్ణుభట్టుల ♦ సం దడిఁగనుచున్॥ శ్రీకాంతుగృహమునకు ను । త్సేకముతోఁ బోయివారు ♦ శేఖరులచటన్॥ సీ॥ దివ్యాయుధోపేత ♦ దీర్ఘబాహాచతు, ష్కమునందుఁ గంకణం ♦ గదము లలర । సజలధారాధర ♦ చ్ఛాయదేహమునందు, సిరి మించుహేమకౌ ♦ శేయ మొప్ప । హరినీలఫలకన ♦ మగ్రవక్షము నందుఁ, గౌస్తుభంబును రమా ♦ కాంత వెలుఁగ । రాకాంతశశిబింబ♦ రమణీయముఖమందుఁ, జంద్రికావిశదహా♦ సంబుతోఁప॥ తే.గీ॥ మౌళిభాగంబునను రత్న ♦ మకుట మమరఁ । గమలనిభలోచనమ్ములఁ ♦ గరుణదోఁప । నమితమాణిక్యఘటితసిం ♦ హాసనమున । వేడ్కఁగూర్చున్న శ్రీమహా ♦ విష్ణుఁజూచి॥ చ॥ అతులితభక్తితోడ నన ♦ కాదులు నల్వురు సాఁగిమ్రొక్కిరం । చితకరుణార్ద్రవీక్షణవి ♦ శేషనిభూతివి యచ్చరాత్రికీ । శతధృతిశర్వశక్రముఖసర్వసురాధిపచక్రవర్తికీ । శ్రితమునివర్యచిత్తసర♦సీరుహవర్తికి విష్ణుమూర్తికీ॥ తే. గీ॥ ఇట్లు సాష్టాంగదండంబు ♦ లింపుతోనొ । నర్చి ముకుళితహస్తులా ♦ నందబాష్ప । కలితనేత్రులు కంపిత♦ కంటకితవి । నమ్రతనులై మురారిముం ♦ దటను నిలిచి॥ వ॥ ఇట్లు వినుతించిరి॥ చ॥ జయజయ పద్మనాభ హరి♦ చక్రిముకుంద మురారి విష్టరా । శ్రయ మధువైరి తార్క్ష్యహయ ♦ శార్ఙ్గి జనార్దన వార్ధికన్యకా । ప్రియ పరమేశ కేశవ క ♦ రిస్తుత వామన హరి

జోజ్జ్వల। న్నయన సువర్ణచేల సుర ♦ నాథ కృపానిధి భక్తరక్షకా॥ క॥
దండంబు పద్మగ ♦ ర్భాండరక్షకునకు, దండంబు పాలిత ♦ పాండవు
నకు। దండంబు మార్తాండ ♦ మండలస్థితునకు, దండంబు లలితవే♦దండ
పతికి । దండంబు భండనో ♦ ద్దండదోర్బలునకు, దండంబు సన్నుతా♦
ఖండలునకు।దండంబు సద్గుణ♦ కాండనారాశికి, దండంబు మణిహేమ♦
కుండలునకు॥ తే.గీ॥దండ మష్టాపదాంబర♦మండితునకు। దండ ముజ్జ్వ
లన్వైకుంఠ♦మండనునకు। దండము నిశాటభయదప్ర♦చండఘృణికి। దండ
ములు నీకు శార్ఙ్గకో♦ దండపాణి॥ ఉ॥ సారసలోచనాయ దర♦చక్రగదా
సిధనుర్ధరాయ సం। సారపయోధిమగ్నఘన♦సంయమిరక్షణతత్పరాయ
విస్తారికృపాబ్ధయే దివిజ ♦ సంఘనుతాయ పరాత్పరాయ ల। క్ష్మీరమణా
య దేవముని ♦ కీర్తితసద్గుణినే నమోస్తు తే॥ క॥ ప్రళయపయోరాశిజల
మ్ములలో సేతువు జనించు♦ పోల్కిఁ దనువు భా। సిలఁ బ్రాణినికులము నలు
వకు। నెలకొల్పిన మత్స్యమూర్తి ♦ నిన్నినుఁ గొల్తున్॥ క॥ పరిణయము
కొఱకు మకరా। కరుకన్నియ నడుగఁ బోవు ♦ గతిఁ గమఠమవై। గిరి
క్రిందఁ జొచ్చి యమృతము। సురలకుఁ బొడమించునీకు ♦ జోహారు హరీ।
క॥ చిఱునవ్వు మొలకవైఖరి। వఱలు విషాణాగ్రమందు ♦ వసుమతి మఱి
రా। కరపంక మంటుగతిఁ దగు। బరఁగు కిటిప్రభుని నిన్ను ♦ భావింతు హ
రీ॥ క॥ నిర్ఘాతసదృశనఖముల। దుర్ఘటబలు హేమకశిపు ♦ దుని
మి సురల కత్యాఘ్రానంద మొనర్చిన। దీర్ఘసటాపటల మొప్పు♦ దేవునకు
నతుల్॥ క॥ శ్రీమహితుం డైనబలిన్। వామనరూపంబుచేత ♦ వంచిం
చి సుర।గ్రామణికిన్ స్వారాజ్యము। సేమముతో నొసఁగునీకు ♦ జేయి
మోడ్తు హరీ॥ చ॥ సమదకుఠారనిర్దళిత ♦ శాత్రవరక్తనదీతరంగసం
ఘములను దోఁచుమాధ్యమిక ♦ కంజహితప్రతిబింబకోటిచం। దమున ని
జప్రతాపదిన ♦ నాయకమండలముల్ వెలుంగ భూ। రమణగజేంద్ర
సింహ భృగు♦రాముని నిన్ను నుతింతు మాధవా॥ ఉ॥ రామునిఁ బంధు
కంధరవి♦రాముని దానదయాదిసద్గుణా।రాముని సంగరాంగణతి♦రస్కృ

శభార్గవరామునిఁ మహో।ద్దాముని గోటిసూర్యనిభ♦ధామునిఁ బాలిత
సర్వసదేవతా।గ్రాముని సుందరాంగజిత♦ కాముని నిన్ను నుతించి మ్రొ
క్కెదన్॥ క॥ లాంగలము ముసలముం గొని। సంగరరంగమున శత్రు♦
జనుల యమపుర। ప్రాంగణవాసులఁ జేసి చె। లంగెడుబలదేవు నినుఁ ద♦
లఁతు ముకుందా॥ క॥ నల్లవహల్లకగంధీ। పల్లవసదృశాధరోష్ఠ♦ పావని
రతసం। ఫుల్లహృదయాబ్జభరితమ। హోల్లాసుని నిన్నుఁ గొల్తు♦ నుర్వీ
రమణా॥ క॥ పురసక్తంచరభామల। పరవుల్లుగ నేలి వారి♦ వల్లభుల
మహే।శ్వరుబాణవహ్ని వేల్చిన। నిరుపమబౌద్ధావతారు♦ నిన్నినుఁ
గొల్తున్॥ క॥ రంగదభంగసితాంగతు। రంగము పై నెక్కి యవన♦ రా
జుల నసిచేఁ। దృంగింపఁగలికితనువు। ప్పొంగి కొనం దలఁచు నిన్ను♦ భూ
షింతు హరీ॥ సీ॥ చిదచిద్విశిష్టు న♦ శేషకల్యాణగు, ణాధారు సకలవే♦
దాంతవినుతు। విశ్వసర్గస్థితి♦ విలయకార్యస్వతం, త్రుని సర్వశబ్దవా♦
చ్యునిఁ బరేశు। జీవప్రకృతిభిన్ను♦ జిదచిచ్ఛరీరి బో,ధానందరూపు స♦
ర్వాత్మ శేషి.। స్వాజ్ఞానిబద్ధమా♦ యాకాలకర్మునిఁ, బరమపదాధీశుఁ♦ బ
రమపురుషు॥ తే.గీ॥ నిత్యసంకల్పసిద్ధని♦ర్ణిద్రదివ్య। మంగళాకారు దానవ♦మ
ర్దను నిఁబ్ర। పన్నజనవత్సలుని భక్త♦ పారిజాతు। నిను నుతింపఁగ మే
మేమి♦ నేర్తు మయ్య॥ క॥ దాసానుదాసులము కగు। ణాసాంద్ర కటా
క్షవీక్ష♦ ణంబుల మము మా। దాసులలోఁ గూర్చి భవా। యాసము
లణఁగింపు తాప♦ సాశ్రితచరణా॥ క॥ నిగమము లన్నియుఁ దానక
సుగుణలవము చెప్ప లేని♦ చోనిఁక మేమా।పొగడెదము మందబుద్ధుల
మగుమాపైఁ గరుణఁ బూన♦ వయ్య ముకుందా॥ క॥ నీవు కదల్పక బ్ర
హ్మం। డావలిలో గటికిపోఁచ♦ యైనఁ గదలునే। తావకఘనకృప వెలిగా।
నేవిధమున లగ్గు గల్గు♦ నెవ్వరికైనన్॥ తే.గీ॥ ముక్తి కోరినవానికి♦ముఖ్య
సాధ।నంబు నీదయ గాని య♦న్యంబు గాదు। కానిచో భక్తియోగుల♦
కన్నఁ। దొలుతఁ। బరమపద మేటి కరుగుఁ బ్ర♦పత్తిపరుఁడు॥ సీ॥ నవ
నతుల్యములైన♦భవదీయనామముల్, పల్కుకఁ జాలనిజిహ్వ♦ పాడుజిహ్వ।

కందర్పుఁ గేరుని ♦ సుందరాకారంబుఁ, జూడఁ జాలనికనుల్ ♦ పాడు కను
లు। మధురంబులైననీ ♦ కథ లెల్ల నాలకిం, పఁగను జాలని చెవుల్ ♦ పా
డు చెవులు। మోక్షదంబైననీ ♦ మూర్తి పూజించుటఁ, బరిహరించుకరం
బు ♦ పాడుకరము॥ తే. గీ॥ అరుణకమలోపమానమై ♦ యలరునీదు। పదము
దలఁపనిహృదయము ♦ పాడుహృదయ। మిదియమానిశ్చయంబునీ ♦ రదని
భాంగ। శంఖచక్రగదాఖడ్గ ♦ శార్ఙ్గపాణి॥ దండకము॥ శ్రీమద్రమా
మానినీపీనవక్షోజకాశ్మీరపంకాంకితోరఃస్థలీవ్యోమభాగోల్లసత్కౌస్తు
భాళీకబాలార్క శోణప్రభాపుల్లభక్తావళీనేత్రపద్మా మహాయోగిచిత్తా
బ్జసద్మా పుటస్వర్ణమాణిక్యసంసిద్ధకోటీరకేయూరమంజీరహారోర్మికాకుం
డలద్వంద్వకాంచీరటత్కింకిణాలంకృతశ్యామలాకారకాదంబినీ నిత్యశం
పాలతా ప్రస్ఫురద్దివ్యకౌశేయవాసా లసన్మందహాసా శచీవల్లభోద్దండ
శుండాలశుండాయతోద్యచ్చతుర్బాహుదండో జ్జ్వలత్పాంచజన్యాసికౌ
మోదకీచక్రముఖ్యాయుధాసీకనిర్భిన్నదైతేయనాథా ప్రసంసిత్రభూ
మండలా రక్షితాఖండలా శంఖచక్రాబ్జవజ్రాంకుశచ్ఛత్రచాపాసిమత్స్యా
దిమాంగళ్యరేఖావళీకేసరాన్వీతపాదాంబుజాత ప్రవద్భూరిమారందధా
రాయమాణోరుభాగీరథీవారిసంసిక్తమర్త్యాఘసంఘాతవిధ్వంసకా దుష్ట
దైత్యావళీహింసకా పద్మగర్భత్రినేత్రామరేంద్రాదిదేవౌఘచూడామణీ
రంజితాంఘ్రిద్వయీసంస్థితిస్థానచాంపేయపీఠాశ్రితానేకపాంచాలికా
మ్రేడితాసంఖ్యవేదాంతభామాస్తుతా సర్వవస్తుస్థితా పద్మగర్భాండభాం
డములెల్లఁ లయంబైనకాలంబునన్ జ్ఞానశూన్యుల్ జడప్రాయులై
స్వాపవేళన్ బలెన్ మాయలోఁజిక్కి దుఃఖించుచున్నట్టియీజీవులన్ భోగ
మోక్షార్హులఁ నీవు వీక్షించి కారుణ్యవారాశివై యుద్ధరింపన్మ
దింబూని జాయస్వ యంచు న్వచింపంగనీయిచ్చ మాయామహాదేవిపైఁ
బడ్డనమ్మాయచేతన్మహాతత్త్వమున్ దానియందియహంకారమున్ దానఁద
న్మాత్రలున్ బుద్ధిచిత్తంబులుఁ నెమ్మనంబింద్రియంబుల్ సురల్ భూత
ముల్ పుట్టెఁ దద్భూతజాలంబులన్నింపుసంయోజనంబాచరింపంగ బ్రహ్మాం

డముల్ స్థూలభూతంబులుం గల్గెనంత న్నిజానాదికర్మస్ఫురద్వాసనా యోగ్యదేవాది దేహంబులం దీసమస్తాత్మలం జొచ్చి కర్మానురూపంబు లై నట్టిభోగ్యంబులం జెందుచు న్వాసనాయోగ్యకర్మంబులం జేయుచు న్మానవుల్ తొల్లి సృష్ట్యాదియందంచితజ్ఞానసంపన్నులుగ దీర్ఘజీవుల్ మహాత్ముల్ సుపర్వోపముల్ ధీరులై యుండియున్ గొంతకాలంబు పోవంగ నంతంతకుం గామలోభానృతద్వేషదంభాదులం గూడి శిశ్నోదరాధీను లై నష్టవిజ్ఞానులై జ్ఞానకర్మంబులం మాని పాపంబులం జేయుచుం గీటకప్రాయులై యున్నచో వారిరక్షింపఁగా నీవువేడ్కం సజాతీయకార్యావళీయుక్త దేవాదిదేహంబులం బూనుచుం ద్వాపరాంతంబునం గృష్ణదేహంబుతో దుష్టులం ద్రుంచి శిష్టావళిం నిల్పి ధర్మంబు వర్తింపఁగాఁ జేసితాధర్మముల్ నాల్గువేలబ్దముల్ భూమియందు న్వెలింగెం భవద్దివ్యలీలావతారంబు లెన్నంగ మాకుందరంబే ముకుందా మురారీ హృషీకేశ దాశార్హ చక్రాయుధా మాధవా కేశవా వాసుదేవా నమస్తే సరోజాతనేత్రా నమస్తే నమస్తే పురారాతిమిత్రా నమస్తే నమస్తేధరిత్రీకళత్రా నమస్తేనమస్తే సురస్తోత్రపాత్రా నమస్తే నమస్తేనమః॥ క॥ అనుచుం సనకసనందన।సనత్కుమారకసనత్సు♦జాతులుతెన్నం।వినుతింపసం తసిల్లుచు।వనజాతాక్షుండుపల్కె♦వారలతోడం॥క॥ మీకుం మీతండ్రికి వా। ణీకాంతకు సోదరులకు♦ నిత్యము శుభమే। చీకాకుపడదు గద భూ। లోకం బంతయును బౌద్ధ ♦ లోకముచేతం॥ శా॥ ధన్యుల్ మీరలు మాధవార్చనరతుల్♦ధారాళచిత్తుల్ జగ।న్మాన్యుల్ సత్యదయాక్షమాన్వితులు కా♦మక్రోధమాత్సర్యలో। భాన్యుల్ మామకదివ్యమూర్తులు సమ ♦ స్తాదిత్యసంస్తుత్యసౌ। జన్యుల్ యోగపరాయణుల్ కృతమతుల్♦ శక్యంబెమిమ్మెన్నఁగం॥ తే. గీ॥ కమలకంటెను గరుడుని ♦ కంటె మరుని। కంటె విధికంటె మామకాం♦గంబుకంటె। గంగకంటెను బాలేటి♦కంటె భక్తు। లనయమును మాకుఁ బ్రియులైన ♦ జనులు విన్నఁడు॥ క॥ దార సుతధనంబులపై। కూరిమి దిగఁద్రోచి సుఖము ♦ గోరంతైనన్। గోర

క నన్ను భజించెడి । వారిబుణముదీర్చికొనఁగ ♦ వశమే నాకున్॥ క॥
అనుచుఁ శ్రీహరి పలికిన । విని సంయము లిట్టు లనిరి ♦ విశ్వేశ్వరనీ ।
ఘనకారుణ్యము గల్గిన । మనుజులకుఁ శుభమె కాని ♦ మఱియొండగు
నే॥ క॥ ధారుణికి విభూషణ మగు । భారతఖండంబు దురిత ♦ భరితం
బగుటఁ । వారిజలోచననీతో । వారక విన్నపముఁ జేయ ♦ వచ్చితిమిట
కుఁ॥ తే. గీ॥ కేవల మహింసయే కాదు♦తావకాంఘ్రి । భక్తుఁడనురక్తి
తోడను ♦ శక్తికొలఁదిఁ । బ్రాణులకు మేలు సేయుట ♦ పాడియనుచుఁ ।
జాటిచాటి వచించెఁ బ్రాఁ ♦ జదువు లెల్ల॥ క॥ దానము మిత్త్రిత్వము
బహు । మానంబు నభేదదృష్టి ♦ మామకభక్తుల్ । మానక ప్రాణులపైఁ
దగఁ । బూనుఁడనుచు మీరుచేయు ♦ బోధ కలుగుటఁ॥ క॥ మనుజు
లకు మేలు సేయుఁ । మనమునఁ దలపోసి నీదు ♦ మనుమల మగుమే ।
మనఘా వచ్చితి మిచటికి । విన వలె మే మాచరించు ♦ విన్నపమెల్లఁ॥
మ॥ హలికిం బ్రీతి యటంచుఁ గాళి కిది యో ♦ గ్యంబంచు సౌత్రా
మణీ । కలితం బంచు సుపర్వులెట్లు సురలై ♦ కన్పట్టి రంచున్ మహా । ఫ
లదం బంచును వైదికం బనుచు భూ ♦ పాలార్హ మంచున్ స్వశి । ష్యుల
కుం జెప్పుచుఁ గల్లుద్రావెడిమను ♦ ష్యుల్ నిండి రుర్వీస్థలిన్॥ ఉ॥ శూరు
లమందిరస్థలులు ♦ సూడఁ దరంబగు జెట్టు భూమిబృం।దారకులంతభీరు
లు గ♦నం బడ రంచుఁదదీయవిత్తముల్ । చోరులు హింసకుల్ గొనిన♦
చో బలియుల్ తమ రాక్రమింతు రా । చోరహృతార్థ మంతయును ♦
జూడరు దండధరప్రభావముల్॥ సీ॥ సురరా జహల్యతో ♦ సురతంబు సే
యఁడే, కూడఁడే కృష్ణుండు ♦ గోపసతుల।రతి సేయఁడే మౌని ♦ సతుల గి
రీశుండు, కలియఁడె పుత్త్రికఁ ♦ గమలభవుఁడు । మాండకర్ణిసురప్ర♦మ
దల రమింపఁడె, వ్యాసమునీంద్రుఁడే ♦ వరుసఁబుట్టె । మానెనే కౌశిక ♦
మౌని మేనకపొత్తు, గురుకాంతను విధుండు ♦ కోరలేదె॥ తే. గీ॥ య
నుచుఁ బండితులును వారి♦గనియితరులు । వావి వరుసయుఁగులమును♦
వన్నె వాసి । దలఁపక పరాంగనలయందుఁ ♦ దగులుకొనిరి । వారిసతు

౦న్యనరులకు ♦ వశ్యులైరి॥ తే.గీ॥ మాటవాసికి ధర్మక♦ర్మముల తెలుఁగు। క్షితిసురులు పలుక నవి తమ ♦ చెవి కరుంతు । దమ్ములై సోఁక ఖలులు క్రో♦ ధమున వారిఁ।జంపుదురు యజ్ఞపశువులఁ ♦జంపుమాడ్కి॥ తే. గీ॥ అనృతములు బూసటలు కుహ ♦ నాన్వితము ల । రంతుదంబులు కొం జెముల్ ♦ పంతములు ప । రాపవాదము లాడెద ♦ రఖిలజనులు । పార్థి వుని చెంత నైనను ♦ భయములేక॥ తే. గీ॥ కూటసాక్షిత్వమును లంచ ♦ గొండితనము । తగవులందును బకుపా ♦ తంబు గొనుట । నిగమముల గు రువుల వట్టి ♦ నిందసేఁత । ధరణిజనులకు నిత్యకృ ♦ త్యంబు లయ్యె॥ ఉ॥ కాముల వృద్ధులం బశుల ♦ బాలురఁ బక్షులఁ గీటకంబులన్ । భామల కుక్షికంబులను ♦ బంగుల మూకుల విప్రవర్యులన్। గోమటులన్ ఝషం బులను ♦ గొర్కెరలన్ బులులన్ వృకావళిన్।వేమఱుఁజంపుచుండ్రు పృథి♦ వింగలమర్త్యులువల్లపడ్డచోన్॥ సీ॥ పెండ్లియాడుటె కాని ♦ ప్రియభామఁ గూడఁడు,పరభామినులతోడఁ ♦ దిరుగుచుండు।నప్పుసేయుట కాని♦యది దీర్పఁదలఁపఁడు, కానికార్యములకుఁ ♦ గర్చుసేయుఁ । కత్తి పట్టుటె కాని♦ ములుల్పై నడవఁడు, సాధుజనంబులఁ ♦ జంపుచుండుఁ । జదువుకొంటయె కాని ♦ చక్రిఁ గొల్వఁగఁబోఁడు, సంభావనల కంచు ♦ జగతిఁ దిరుగుఁ॥ తే. గీ॥ బరులసొమ్ము హరింప లో ♦ పలఁ దలంచి । జన్నములు నన్నదా నముల్ ♦శౌరిసేవ । తపము జపమును గావించుఁ♦దప్పకుండఁ । గానిసద్గతిఁ దలఁపఁ డో ♦ క్కనరుఁడైన॥ చ॥ శివునకు రక్తపూర మభి ♦ షేకమొ నర్తురు భద్రకాళికిన్ । వివిధమృగోరుమాంసములు ♦ వేమఱు గూర్తురు రేవతీసతీ । ధవునకు భోగ్య మంచు సుర ♦ తప్పకయిత్తురు గీనిచేత సం । భవ మగు మోక్ష మందు రివి ♦ మర్త్య లొనర్చెడిభక్తికృత్యముల్॥ సీ॥ హనుమద్దేవరు వీరవర్యుఁడును గీ ♦ శాధీశుఁడుర్గ గాన నా । తనికిం ప్రీతి యటంచుఁ బూజనము లు ♦ త్సాహంబుతోఁ జేసి చం । ద్రనిభా స్యచ్ఛవు లొప్పుమద్య ముపహా ♦ రం బిచ్చి కంఠంబుదాఁ । కను బా ౦ బొనరించుచుండెదరు వే ♦ డ్కన్ బ్రహ్మవంశోద్భవుల్ ॥ క ॥ బల

దేవశిష్యులు మహో । బలనందనుఁ డొట మద్య ♦ పానోన్మత్తా । త్ము
రక్షించు ననుచు శి । ష్యులకుం జెప్పెదరు భూమి ♦ సురవరు లకటా ॥
సీ ॥ అతిపాతకమ్ముల ♦ కాలవాలములు మ, హాపాతకమ్ముల ♦ కాక
ములు । సమపాతకములకు ♦ జన్మదేశము లుప, పాతకములకు దీ ♦ ర్ఘ
గృహములు । సంకరీకరణౌఘ ♦ జాతికిఁ దండ్రులు, మలినీకరణదోష ♦
ములకు గురులు । భువిని జాతిభ్రంశ ♦ ముల కాటపట్లవా, త్రీకరణ
ములకు ♦ దివ్యఖనులు ॥ తే-గీ॥ తలఁపఁ బ్రాసంగికముల కు ♦ త్సవదినమ్ము
లల ప్రకీర్ణకములకు రా ♦ జాశ్రయములు । జనులు తద్వర్తనంబు లీ ♦ సరణి
నున్న । వేమి వచియింపఁ గలవార ♦ మింక మహాత్మ ॥ సీ॥ స్నానంబు
సంధ్యయు ♦ సత్యవాక్యము పితృ, తర్పణం బనుమాట ♦ తలఁప రాదు ।
హోమంబు జప మట్ల ♦ యుడిగె సభ్యాగత, పూజనం బతిథుసం ♦ పూ
నంబు । శౌచంబు సమసె శి ♦ ష్టాచార మడఁగెను, దేవపూజ యొనర్పు ♦
తెలుఁగు దొలఁగె । వేదముల్ చెవులకు ♦ వింతలు పంచయ, జ్ఞంబులు
సున్న దా ♦ నంబు మిధ్య॥ తే గీ॥ మఱియు నైమిత్తికంబులు ♦ మడిసెఁ
గామ్య । కర్మముల్ సెప్ప నేటికిఁ ♦ గమలనాభ । నిన్నుఁ దలపోయు
దురె యట్లె ♦ నీచజనులు । వైదికం బెట్లు నశియించె ♦ వసుధలోన॥ తే-గీ॥
కల్లలాడుట దున్నుట ♦ నల్లమందు । భక్షణముసేయుటయు ధూమ ♦
పాన మన్య । సుదతిఁ గూడుట లోభంబ ♦ సూయ విప్ర । జాతిలోఁ గల్గి
యుండె భూ ♦ చక్రమందు ॥ మ॥ జగముల్ మిథ్యలు బ్రహ్మ సత్య మను
చున్ ♦ స్వాంతంబులో నమ్మి హే । చ్ఛగ వర్తింతుము మాకు ము
నిజ మం ♦ చుం బాపకర్మంబు లె । ల్ల గరిష్ఠంబుగఁ జేయుచుండెదరు
లీ ♦ లం గొందఱుర్వీసురుల్ । తగునే వారికి వారిఁ జూచిననజనుల్ ♦
ధర్మచ్యుతిం జెందరే ॥ శా॥ పర్యంకంబుల నాంధ్ర నుంచి పురుషుల్ ♦
పాకం బిలాశుద్ధి సౌ । ఖ్యార్యం బంచు వచించి చేసెదరు కాం ♦ తల్ భర్త
చేతం బనుల్ । ధుర్యత్వంబునఁ గొంద రేటి కిఁక మీ ♦ తోఁ బెక్కు
వేల్చెప్పఁ ద । చ్చర్యల్ చిత్రవిచిత్రముల్ ప్రతివిధిక్ ♦ సల్పక వలెన్

సేనికెన్ ॥ సీ॥ ఒరునిల్లు మూపెడి ♦ తఱి సత్యవాక్యంబు, వేశ్యకాంతల
ష్ట్ల ♦ వితరణంబు । సారసాక్షులు తన్నుఁ ♦ గోరంగ శౌచంబు, తా
లప లేకున్న ♦ తఱి నహింస । కూ్రరకార్యము సమ ♦ కూడ సంతో
షంబు, సుస్థిరత్వంబు సు ♦ షుప్తివేళ । హాలారసము గ్రోలు ♦ నప్పుడు
సమబుద్ధి, సాగతాగమసద ♦ స్యముల శ్రద్ధ ॥ తే. గీ॥ ప్రబలరోగము రా
జిత ♦ భాషణంబు । చిన్నతనమున బ్రహ్మచ ♦ ర్యోన్నతియును । గాని
యుక్తయొండు వేళలఁ ♦ గలుగవిందు।నొక్కగుణ మైన జనులకు♦నిక్కమ
ముగ ॥ క॥ బలియు రగుమాను లీగతిఁ । బలికిన విని సభ్యులను గృ ♦
ష్ణామతిఁ గని శ్రీ । జలజాతనేత్రుఁ డిట్లనె । జలధరగంభీరరవము ♦ చం
పము దోఁపన్ ॥ ఉ॥ వింటిగె నీరు చెప్పుపృథ ♦ పేజనవృత్తము సభ్య
ఆర మీ । వంటిమహాత్ము లుండియు ని♦వారణసేయక యుంట ధర్మ
మే । బంటుతనంబు గల్గు నొక♦పార్షదుఁ డైన మ జెన్వ గైన నా ।
పంటచెలిం జనించి పరి ♦ పాలన సేయుఁడు ధర్మమార్గముల్ ॥ మ॥
అనుమన్ విష్ణుఁడు పల్కువో నుదయవే ♦ శాదిత్యబింబస్ఫుర । ద్ఘన
మాణిక్యసహస్రసంయుతఫణా ♦ గ్రస్ఫారకాంతిచ్ఛటల్ । వనజాతాక్షు
సభాంతరాళమునఁ బ ♦ ర్వన్ వేడ్కతో లేచి ని । ల్చె నిజప్రాభవము కెల్ల
వారు చెలఁగన్ ♦ శేషుండు సన్నద్ధుఁడై ॥వ॥ నిల్చి భగవంతునితో నిట్ల
నియె ॥ చ॥ వలదు రథాశ్వదంతిభట ♦ వర్గ మసర్గళచాపబాణముల్ ।
వల దొకమర్త్యుఁ డైన సమ ♦ వర్తిగృహంబున కేగకుండ మే । నులు
కసిగంద కుండఁగ న ♦ నున్ మనుజుల్ నుతి సేయునట్లు భూ । తలమున
మోక్షధర్మము య ♦ థావిధి నిల్పెదఁ బంపవే యనన్ ॥ తే. గీ॥ ముద
ముతోడ ముకుందుఁడా♦మునులఁ బద్మ । గర్భపుత్రి కంపి తనమ్రోలఁ♦
గ్రాలుచున్న । శేషు నీక్షించి కారుణ్య ♦ సింధుఁ డగుచు । నతనితో నిట్లు
లనియె స ♦ మగ్రఫణితి ॥ ఉ॥ ధీరుఁడ వైన నీవు వసు ♦ దేవుస కుద్భవ
మూచు దుష్టసం । హారము సేయఁగా పిరళ ♦ మయ్యెఁ బ్రజావళి యిప్పు
డాగతిన్ । శూరగుణంబు చూపక వి ♦ శుద్ధచరిత్ర త్వదీయవాక్యవి ।

స్తారముచేత మానవులఁ ♦ జక్క నొనర్చి యశంబుఁ బూనుమీ ॥ మ॥ తలచై యెప్పుడిబౌద్ధులన్ గెలిచి మ ♦ ద్ధర్మంబు శుక్లేందువై । ఖ వర్ధిల్లఁగఁ జేయుఁ డంచు మును మ ♦ త్కౌక్షేయకోద్యద్గదా । దర చక్రప్రముఖాయుధంబుల సము ♦ ద్యద్భూషణశ్రేణి ను । ర్వరకుఁ బంపితిఁ జేయ లేరయిరి వా ♦ రల్ మామకాజ్ఞాక్రియల్॥ తే-గీ॥ అవ నిచప్పన్న దేశంబు ♦ లందు దుష్టు । లధికులై యున్నవా రిప్పు ♦ డందు లోన । ద్రవిడభూముల దుర్జనుల్ ♦ ప్రబలు లగుట । నచట జన్మించి సాధింప ♦ వయ్య జగము॥ తే. గీ॥ ద్రవిడదేశంబులోఁ గంచి ♦ దరని భూత । పురవరంబున నాసూరి ♦ కులవరుండు । కేశవాఖ్యుఁడు హరి భక్తి ♦ కీలితుండు । కలఁడు వానికి జనియింప ♦ వలయు నీవు ॥ ఉ॥ ఆతనిపత్ని రూపసుగు ♦ ణాన్విత పద్మముఖీలలామ వి । ఖ్యాతచరిత్ర కాంతిమతి♦కాంతునియాజ్ఞఁ జరించుచు న్ననుం।బ్రీతి దలిర్పఁ గొల్చుచు ధ ♦ రిత్రికి భూషణమై వెలుంగు నీ । వాతలిరాకుఁబోఁడికి మ ♦ హాత్మ జనింపుము దాన మే లగుఁ ॥ తే. గీ॥ పాంచరాత్రోక్తరీతి నా ♦ బ్రా హ్మణుండు । పుత్త్రకామేష్టి మముఁ గూర్చి ♦ భువి నొనర్చు । చున్నవాఁ డేగు మని చెప్పి ♦ వెన్నుఁ డూర । కున్నచో శేషుఁ డపుడు న ♦ ముత్సన మున ॥ మ॥ వనజాతప్రతిమానముల్ మునిమనో ♦ వాసంబు లుద్య ద్వికా । ర్తనబింబచ్ఛవు లాగమాంతనుతిపా ♦ త్రంబుల్ రమాసేవ్య ముల్ । ఘనచక్రాసిగదాబ్జశంఖముఖరే ♦ ఖాశ్రేణులై నట్టియా । తని పాదంబుల కాచరించెను నతుల్ ♦ దాసోహ మంచుం దగఁ॥ క॥ ఈ గతి వందారుండై । భోగీంద్రుఁడు విష్ణునాజ్ఞఁ ♦ బొంది ధరిత్రీ । భాగ మ్మున కరుదేరం । గా గమనోన్ముఖతఁ బూను ♦ కాలంబందుఁ ॥ సీ॥ క్షితిమండలమునఁ గాం ♦ చీదేశమున భూత, పురమున నాసూరి ♦ వరకులుండు । కేశవాచార్యుండు ♦ కీర్తిమంతుఁడు తన, దేవి యైనట్టి కాం ♦ తిమతి తాను । బుత్త్రులు లేకున్నఁ♦బుత్త్రకామేష్టి ది, వ్యాగమ పద్ధతి ♦ నపుడుచేసి । యవభృథస్నాతుఁడై ♦ నంత రే చూ లయ్యె,

ఫణిపతి దానిగ ♦ ర్భమునఁ జొచ్చె॥ తే. గీ॥ సంత సనవమాసములు
నిండె ♦ నప్పుడు మేష । మాసమున రౌద్రభమున స ♦ మస్తఖగము ।
లుచితగతి నున్నతశ్రీఁ బుత్త్రుఁ ♦ డుదయ మయ్యె । జాతకర్మాదు లొన
రించె ♦ జనకుఁ డపుడు॥ తే. గీ॥ కోరి రామానుజుం డని ♦ పేరు పెట్టి ।
యుపనయనము వివాహమ ♦ హోత్సవంబు । సలిపి కాంచికిఁ బం
పించెఁ ♦ జదువుకొనఁగ । నతఁడు యాదవశిష్యుఁడై ♦ యచటఁ జదివి॥
శా॥ శ్రీరంగంబునఁ బూర్ణదేశికుకడన్ ♦ సిద్ధాంతవిజ్ఞాతయై । ధీర
త్వంబున సన్న్యసించి సకల ♦ ద్వీపంబులన్ ద్రొక్కి బౌ । ద్ధారం
భంబులు మాన్పి భూస్థలి విశి ♦ ష్టాద్వైతమార్గంబు వి । స్తారంబై
తగఁ జేయుచుం బ్రపదనా ♦ ధ్వం బేర్పరించెన్ దయన్॥ వ॥ ఇట్లు
సూతుండు పలికిన శౌనకుండు రామానుజుం బ్రశంసించి యతండు
చెప్పు ప్రపదనప్రకారంబును దదీయశిష్యవర్యులు సేయు ప్రశ్నంబు
లును వారలకతం డొసంగుప్రత్యుత్తరంబులును సవిస్తరంబుగాఁ
జెప్పవే యనిన నతం డిట్లనియె॥ మ॥ ధరణీభాగము సర్వమున్ గెలిచి
ది ♦ గ్దంతావళవ్రాతముం । ఖురదంతంబులకున్ స్వకీయయశ మ ♦ స్తో
కద్యుతుల్ గూర్పఁగా । స్థిరచిత్తుం డగు కేశవార్యసుతుఁ డం ♦ తేవా
సులుం దాను గ్ర । మ్మఱ నేతెంచెను గాంచికిన్ క్షితినితం ♦ బప్రస్ఫుర
త్కాంచికిన్॥ సీ॥ ఈరీతిఁ గాంచికి ♦ నేతెంచి వరదరాజస్వామిపదము
ల ♦ ర్చనముచేసి । మండపంబందు స ♦ మాసీనుఁడై సరామానుజా
చార్యుని ♦ యాదవుండు । యజ్ఞమూర్తియుఁ జేరి ♦ సాష్టాంగము
లొనర్చి, వీనుల కింపుగా ♦ వినుతిఁ జేసి । ముకుళితహస్తులై ♦ ముందరఁ
గూర్చుండి, ప్రపదనం బనుమహో ♦ పాయ మడుగ॥ తే.గీ॥ నిట్లు
పల్క జగద్గురుం ♦ డేను మీకుఁ । బ్రపదనం బెల్లఁ జెప్పెదఁ ♦ గపట
ముడిగి । భక్తి యాసక్తి ధృతి బుద్ధి ♦ బలము శ్రద్ధ । గలిగి వినుఁడు
గతేతర ♦ కాంక్షు లగుచు॥ సీ॥ బహుజన్మకృతకర్మ ♦ పటలమత్తగ
జేంద్ర, పంచాననరవంబు ♦ ప్రపదనంబు । స్వామిసిద్ధ్యేతుక ♦ వాల్ల

భ్యకృతము_క్తి, భామినీవదనంబు ♦ ప్రపదనంబు । శమదమహారిభ_క్తి♦ సత్యశౌచక్షమా, ర్జవదయాసదనంబు♦ప్రపదనంబు । కామలోభక్రోధ♦ గర్వమత్సరదంభ, భంజకకేదనంబు ♦ ప్రపదనంబు॥ తే.గీ॥ ప్రకటితా గామిమథనంబు ♦ ప్రపదనంబు । భాగవతజీవితధనంబు ♦ ప్రపదనంబు। ప్రబలసంసృతినిధనంబు ♦ ప్రపదనంబు । భవ్యతరసాధనంబు తం♦ త్ప్రపదనంబు॥ రగడ॥ భగవంతునిశ్రీ ♦ పాదముఁ జేర్పఁగఁ । దగ సోపా నప♦థంబు ప్రపదనము।శ్రీవైకుంఠ వి♦శేషకృపాసం । భావితనిజసం♦భ వము ప్రపదనము । జనులకు ము_క్తికి♦సలుపు పెండిలికి । ఘనముహూర్త యో♦గంబుప్రపదనము। సంచితకర్మని♦చయతమమునకు స । మంచితర విబిం♦బంబు ప్రపదనము । గౌరవసహితా♦గామికర్మద్రుఘ । నీరదఝుం ఝూ♦నిలము ప్రపదనము। దాసవినుతశమ♦దమకరుణాది । శ్వాసవిచా రా♦శ్రయముప్రపదనము।వైరాగ్యాహ్వాయ♦వారిరాశికిని। దారకాధిపో♦ దయము ప్రపదనము । సంసారార్ణవ♦చటులాటవికిఁబ్ర । శంసితవహ్ని♦ జ్వాల ప్రపదనము । కామలోభమద♦గర్వమత్సర । గ్రామవినాశన♦క రము ప్రపదనము । శ్రవణకీర్తనా♦ర్చనవందనముఖ । నవభక్తులకును♦ నగరి ప్రపదనము । యాదృచ్ఛికసుకృ♦తాన్వితమనుజస । మాదృతసా ల♦భ్యంబు ప్రపదనము । సకలమునీశ్వర♦సాధ్యసిద్ధసుర । నికరముచే వ♦ర్ణితము ప్రపదనము। పరమపదస్థిత♦భవ్యజనములకుఁ । బరమానంద♦ ప్రదము ప్రపదనము । ధర్మము కామము ♦ ధనము మోక్షమును । గూర్మిఁ గోర సమ♦కూర్చుఁ బ్రపదనము । జననజరామృతి♦సర్పదష్టులకు। వినతాసుతమను♦వితతి ప్రపదనము । హరి మెచ్చినకా ♦ ర్యంబుప్రపదన ము।మురవిరోధికిని♦ముద్దుప్రపదనముఁ । వేదాంతములకు♦వీథిప్రపదనము పాతిత్యంబులఁ♦బాపుఁబ్రపదనము । కోరినకోర్కులఁ ♦ గూర్చుఁ బ్రపద। నము । తీఱనివేడ్కలఁ ♦ దెచ్చుఁ బ్రపదనము । సకలసిద్ధులను ♦ సల్పుఁ బ్రపదనము । వికలతఁబొందక♦వెలుఁగుఁ బ్రపదనము । ప్రపదనతుల్యో♦ పాయము లే దని । విపులశాస్త్రములు ♦ వేదము లనియెన్॥ వ॥ శాస్త్ర

క్తలక్షణలక్షితుం డగుగురునికడ నైనను భగవంతునిపాల నైనను వైదికసంస్కారసంపన్నుం డై నపురుషుండు తప్తచక్రాంకనంబును బుండ్రమాలాధారణంబును భగవద్దాసాహ్వయంబును దిరుమంత్రద్వయమంత్రచరమ మంత్రమంత్రార్థోపదేశంబును భగవదర్చనంబును ననియెడుపంచసంస్కారంబులుం గలిగించుకొని చిదచిదీశ్వరతత్త్వత్రయప్రకారంబును విశ్వసర్గస్థితిప్రళయలక్షణంబును విష్ణు పరాత్పరత్వంబును బ్రకృతిహేయత్వంబును బరమపదవైభవంబును విశిష్టాద్వైతక్రమంబును నెఱింగి మధ్యానినిష్ఠాగరిష్ఠుండై హరియందు నవవిధభక్తులం జేయుచు సంసారనివృత్తికై భగవత్ప్రపదనంబు గావింప వలయు ననిన దేవా దీని నన్నిటి వివరింపవే యని యాదవశర్మాదిశిష్యు లడిగిన రామానుజుండు తొలుత గురులక్షణంబులు వినుం డని యిట్లనియె॥ తే. గీ॥ చిదచిదీశ్వరతత్త్వవి ♦ శేషములు ను। పాయము లపాయములు కర్మ ♦ పథము లెఱిఁగి। బుద్ధిమంతుఁడు వక్తయు ♦ బోధకాగ్ర। గణ్యుఁ డగు వైష్ణవుని దేశి ♦ కత్వ మొప్పు॥ క॥ అంతర్బాహ్యశుచిత్వము। శాంతియు సత్కర్మనిష్ఠ ♦ సద్వృత్తము వే। దాంతజ్ఞత గలిగి రమా। కాంతునిఁ గొలుచువాని దేశి ♦ కత్వం బొప్పున్॥ క॥ కేవలము కరుణచే శి। ష్యావళికిన్ గూర్చి ద్రవిణ ♦ మాసింపనిభూ। దేవవరేణ్యుఁడు గురుఁ డగు। చోష్ణునిప్రోలు తనకుఁ ♦ జోర సాధ్య మగున్ ॥ క॥ విను మేడుతరము లెంచిన। జననీజనకాన్వయముల ♦ సచ్చరితముఁ బొ। యనిసత్కులీను వైరా। గ్యనిధిం గొన వలయు గురునిఁ ♦ గా బుద్ధియుతుల్॥ క॥ తన భారము హరిపై నెవ్వనిమూలంబునను బెట్టి ♦ వైరాగ్యయుతుం।డును శాంతుఁడు తా నగు నా। తని గురువరుఁ డని నుతింపఁ ♦ దగు భువి గోనన్॥సీ॥ ఆచారవంతు గృ ♦ హస్థు యౌవనయుతు, సద్వృత్తశీలుని ♦ సద్యశస్కు। భగవత్పరాయణు ♦ భాగవతారాధ్యు, నిస్సంశయుని జ్ఞాన ♦ నిధిమహాత్ము। భార్యాసుతసమేతు ♦ భక్తు నుదారు లో, కప్రియు హృద్యవా ♦ క్కలితు సదయు। సముచిత్తునిఁ గృతజ్ఞు ♦ సత్యసంధునిఁ

క్రోధ, కామాదివర్జితుఁ ♦ గలుషరహితుఁ॥ తే.గీ॥ క్లేశశూన్యుని ధీరు స♦
క్లిష్టకర్ము । సౌమ్యవేషు నరోగుఁ బ్ర ♦ శస్తదేహు । వినయవంతు
నిజగురుసే ♦ వనవిశిష్టు । గురునిగాఁ గొన్న సులభంబు ♦ పరమప
దము॥ క॥ న్యూనాంగుని వికలాంగుని । మానమదక్రోధదంభ ♦ మత్స
రసహితున్ । దానదయాసత్త్వార్జవ । హీను గురునిఁ జేసికొన్న ♦
హీనత గల్గున్॥ తే.గీ॥ గురుల మని శిష్యులను దోఁచు ♦ కొనెడివాఁడు।
కలుషములె చూపుఁ గాని మేల్ ♦ గఱపఁ డెపుడు । వాని నన నేల
సద్గతిఁ ♦ బడయఁగోరి । వానిఁ జేరిననరు నన ♦ వలెను గాక॥ సీ॥ వేష
ధారియుఁ బర ♦ విత్తాపహారి సు, రాపానరతుఁడు క ♦ రాళరూపుఁ।
డనధీతవేదవే ♦ దాంతుండు పరభామి, నీబద్ధహృదయుండు ♦ నిందకుం
డు । నపకీర్తిభాజనుం ♦ డార్యవంచకుఁ డస, త్యాలాపుఁడును గుహ♦
నాన్వితుండు । స్వాచారశూన్యుండు♦హరిభక్తిరహితుండు, పాపకర్ముండు
కృ ♦ పావిహీనుఁ॥ తే.గీ॥ దైనమనుజుండు హరి యేటి ♦ కనుచుఁ దాన।
ముక్తి యొసఁగెద నను నను♦రక్తిఁ దనకు। ధనము లర్పింపుఁ డను నట్టి♦
దనుజసదృశు । గురునిఁగాఁ గొన్న సద్గతి ♦ తెఱఁగు సున్న॥ క॥ తగిన
ట్టిగురువు దొరకిన । భగవత్తుల్యునిఁగ వాని ♦ భావింప వలెన్ । దగని
గురుం జండాలుని। పగిది విడిచి యొందుగురునిఁ♦బ్రార్థింపఁ దగున్॥ తే.గీ॥
మంచిగుణ మొక్కటియునైన ♦ మానరాదు । కానిగుణ మొక్కటి
యునైనఁ ♦ గలుగ రాదు । గురున కట్టిగురుం డెందు ♦ దొరకఁడేని।
వనజనాభుని గురునిఁగాఁ ♦ గొనుట మేలు॥ ఉ॥ దూరము పోఁ డొకిం
తయును ♦ దోషము లేదు సమస్తసద్గుణా । ధారుఁడు సర్వవేదసము♦
దాయము పుట్టినయిల్లు విత్తముల్ । గోరఁడు భక్తియున్ మతియుఁ♦
గూర్పఁగ సద్గతిఁ జేర్పఁ గర్తయై । వారిజనాభుఁ డుండఁ బెర♦వానిగురుం
డని వేఁడ నేటికిన్॥ ఆ.గీ॥ ఆఁడుదానిచేత ♦ నబ్రాహ్మణునిచేత । వైష్ణవుండు
గాని ♦ వానిచేత। శఠునిచేతఁ జనదు ♦ చక్రాంకితుండౌట । మిగులఁ బడిన
విడువఁ ♦ దగును వాని॥ క॥ హరిమూర్తి లోహ మనియును । గురుఁ

డు నరుం డనుచుఁ దలఁపఁ ♦ గూడదు సాక్షా । చ్ఛరహూపి యైనదై
వము । పరమాచార్యుండు సుగుణ ♦ భరితుండైనన్ ॥ చ॥ వననిధి
దాఁట భిన్నమయి ♦ వర్తిలునోడయు నాజి శత్రులన్ । దునుమఁగ
దారుఖడ్గమును ♦ దుష్టభుజంగముఁ బట్ట మంత్రలాం । ఛనమును రాజ్య
భారము వె ♦ సన్ భరియింపఁగ మూఢమంత్రియున్ । జననుత విష్ణుఁ
జేర్పఁగ న ♦ సద్గురుఁడున్ సమ మండ్రు పండితుల్ ॥ తే.గీ॥ గురుఁడు
లేకున్న శాస్త్ర మే ♦ కరణిఁ దెలియుఁ । బరమపురుషునికరుణ స ♦ ద్గు
రుఁడు దొరకు । నాతఁ డేజాతి యైన స ♦ మర్చనీయుఁ । డైనఁ దగ
దొరునకు ముద్ర ♦ లాచరింప ॥ క॥ జ్ఞానము భక్తియుఁ గర్మవి । ధా
నము మంత్రము ప్రపన్న ♦ తయు దేశికుచేఁ । బూనన్ సఫలత యా
తఁడు । లేనియెడల నొక్కటియు ఫ ♦ లింపదు సుమ్మీ॥ క॥ తనువు
ధనము చుట్టలు తన । కనిత్య మని జన్మమృతిజ ♦ రాదులు నిత్యం ।
బని తెలిసి గురునిపాలికిఁ । జన వలె మోక్షార్థి భక్తి ♦ సంయుక్తుండై ॥
తే.గీ॥ సంసరణమందు విరతి మో ♦ క్షంబునందు । రక్తి భగవత్పదం
బుల ♦ భక్తి లేని । జనున కేటికి గురుసమా ♦ శ్రయము తెఱఁగు । వాని
వచియించె శ్రుతి నడ ♦ పీనుఁ గనుచు॥ వ॥ ఇంక శిష్యలక్షణంబులు
వివరించెద॥ సీ॥ విషయభోగములందు ♦ విరతుండు శుచి దాంతుఁ,
డనసూయుఁడు దయాళుఁ ♦ డాశ్యయుతుఁడు । శ్రద్ధాన్వితుఁడు సదా ♦
చార్యవరాన్వేషి, మేధావి దక్షుండు ♦ మృదువచనుఁడు । చతురుండు
ధీరుండు ♦ సత్స్వభావుఁడు ధార్మికుఁడు హరిపాదభ ♦ క్తుండు సత్య ।
సంధుఁడు శాంతుఁ డా ♦ ర్జవయుతుండు కుటుంబ, వంతుండు సౌమ్యుం
డ ♦ వంచకుండు॥ తే.గీ॥ మోక్షకామి సమిత్పాణి ♦ ముకుళితకరుఁ । డ
గుచుఁ దనుఁ జేరి ప్రార్థించు ♦ నట్టిశిష్యుఁ । గొన్నినాళ్ళు పరీక్షించి ♦
గురుఁ డెఱింగి । పంచసంస్కారము లొసంగ ♦ వలయు నంత॥ తే.గీ॥
మంచిగుణములు లేనిదు ♦ ర్మనుజులకును । బంచసంస్కారములు సేఁత ♦
పాతకంబు । శిష్యపాపం గురో యని ♦ చెప్పె శాస్త్ర । మది యెఱుం

గనివాని క ♦ నర్థ మరుదె॥ చ॥ గురుఁడు వచించు కార్యములఁ ♦ గూ ర్చుచుఁ దద్గురుదారపుత్త్రులన్ । గురునిగతిం దలంచుచును ♦ నూతన విద్యలఁ జెప్పికొంచు న । త్తఱి ధన మెవ్వ రిచ్చిన ము ♦ దంబున నొజ్జ కొసంగుచున్ గురున్ । హరివలె భక్తిఁ జూచి విన ♦ యమ్మున శిష్యుఁ డు ద్రిమ్మర న్వలెన్ ॥ క॥ ఆచార్యుఁడు కోపించిన । వాచాలతఁ బ్రూన రాదు ♦ వానిగృహమునన్ । నీచపుఁబని యైనను సం । కోచింపక చేయ వచ్చు ♦ గురుభక్తుఁ డిలన్॥ క॥ క్షమఁ దాపము పుండ్రము నా । మము మంత్రము యాగ మనుస ♦ మంచితసంస్కా । రము లైదును గలమను జుఁడె । కమలాక్షునిభటులలోన ♦ గణుతికి నెక్కున్ ॥ తే.గీ॥ పుండ్ర మును శంఖచక్రాంక ♦ ములును సార । సాక్షమాలయు జన్నిద ♦ మంబ రంబు । సంతతముఁ దాల్ప వలె దాస ♦ జనుఁడు నిమిష । మైన విడి చినఁ గీడగు ♦ నండ్రు బుధులు॥ తే.గీ॥ పాదుకాశయనాసన ♦ ప్రభృ తులకును । దక్కఁ దక్కినవస్తుసం ♦ తతికిఁ బుత్త్ర । దారపశుభృత్యు లకుఁ బుండ్ర ♦ ధారణంబు । శంఖచక్రాంకన మొనర్పఁ ♦ జను బుధుం డు॥ మ॥ ధరణీదేవులు రాజు లార్యులును గాం ♦ తల్ శూద్రులున్ బాహులన్ । దరచక్రాంకితు లూర్ధ్వపుండ్రసహితుల్ ♦ దాశార్హదాసా హ్వయుల్ । వరణీయద్వయమంత్రసక్తు లగుచున్ ♦ వైకుంఠుఁ బూజిం చినం । బరమస్థానము వారిసా ♦ మ్మనుచు సం ♦ భావింతు రార్యోత్త ముల్॥ తే.గీ॥ దక్షిణభుజంబునందు సు ♦ దర్శనాంక । మన్యభుజమందుఁ బాంచజ ♦ న్యాంకమును ధ । రించునది విష్ణులోక మా ♦ సించు జనుఁ డు । తప్తముద్రలు దాల్చు టు ♦ త్తమము సుమ్ము॥ క॥ సురగరుడోర గవిద్యా । ధరకిన్నరవరులు తప్త ♦ దరచక్రాంక । స్ఫురితభుజులై ముకుం దుని । మఱవక చరియింతు రెల్ల ♦ మానులు పొగడన్ ॥ క॥ చక్రాం కితుఁ డగుమర్త్యుఁ డ । వక్రగతిన్ యోగిజనులు ♦ వర్ణింపంగా । శక్రా దిదుర్లభం బగు । చక్రిపురముఁ జేరు దురిత ♦ సంఘచ్యుతుఁడై ॥ తే.గీ॥ తప్తచక్రాంకనం బైన ♦ తతికిఁ గలుగు । పాతకంబులు నశియించు ♦

భక్తతతికి । నతఁడు మధ్యమనిష్ఠయం ♦ దధివసింప । వెన్నునిపదంబు
తంగేటి ♦ జున్నుగాదె॥ తే.గీ॥ పాంచరాత్రోక్తసరణిఁ గా ♦ వించుకొ
నఁగ । వలయు నాచార్యుచే నైన ♦ వనజనాభు । చేత నైనను దర
చక్ర ♦ చిహ్నలవిధి । కృతము లైనను మరల ధ ♦ రింపవలయు॥ మ॥
కటులాభర్త విధాతకుం దెలిపె వే ♦ డ్కన్ దేవదీక్షావిధా । నము పూ
ర్వంబును దాని మీఁదఁ దెలియన్ ♦ వారుత్తు వైకుంఠలో । కము
వాంఛించినవాఁడు ముందుగ నుషః ♦ కాలంబునన్ లేచి శౌ । చముఖ
క్షాళనమజ్జనాదివిధులు ♦ త్సాహంబుతోఁ జేయుచున్॥ మ॥ సతియుం
దాను విశుద్ధవస్త్రధరులై ♦ సద్వైష్ణవోపేతులై । కృతనిష్ఠన్ హరిమం
దిరంబునకు న ♦ ర్థిం బోయి నారాయణున్ । జితదైతేయు ననాది
మధ్యనిధనున్ ♦ దేవున్ జగన్నాథు న । చ్యుతునిం గూర్చి ప్రదక్షిణ
త్రితయ మ ♦ చ్చో భక్తిఁ జేయ న్వలెన్॥ తే.గీ॥ దండసదృశప్రణా
మముల్ ♦ దైత్యవైరి । కాచరించి యథావిధి ♦ నర్చనంబు । సలిపి సద్భ
క్తితోడ సం ♦ స్తవమొనర్చి । వందనం బొనరింపంగ ♦ వలయు మరల॥
చ॥ శ్రితజనవాంఛితప్రదు న ♦ శేషసుపర్వసమర్చితున్ దయా ।
న్వితు జగదేకసద్గురుఁ బ ♦ విత్రచరిత్రుని విశ్వనాథు నం । చిత
సుగుణాంబురాశి నినుఁ ♦ జేరి భజించితి నాజవంజవో । ద్ధతజల
రాశిమగ్ను నను ♦ దానవమర్దన యుద్ధరింపవే ॥ తే.గీ॥ నీవు నిర్హే
తుకకటాక్ష ♦ నీరనిధివి । భక్తజనరక్షణైకత ♦ త్పరుఁడ వగుట । నబ్జ
లోచన యిపు డన ♦ న్యాశ్రయు నన్నుఁ । బాలనము చేయు నిత్యసం ♦ బంధ
మొసఁగి॥ తే.గీ॥ శంఖచక్రాంకనము మాకు ♦ సల్పుటకును । నేఁడు
మాయింటి కరుదెమ్ము ♦ నీరజాక్ష । యనుచు విజ్ఞాపనముఁ జేసి ♦ య
రని యెదుటఁ । బంచగవ్యంబొనర్చి త్రా ♦ వంగ వలయు ॥ మ ॥ ఇనుఁ
డస్తంగతుఁ డైనవేళ సతితో ♦ శ్రీశాలయక్షోణికిం । జని పూజాదిక
మాచరించి పిదపన్ ♦ సర్వేశు నాజ్ఞం దద । ర్చను సంబంధులచేతఁ
గైకొని తద ♦ స్వచ్ఛత్రవాదిత్రవే । దనినాదంబులు మీఱ వాహనము

మిం◆దగ విష్ణునిన్ నిల్పుచున్॥ మ॥ కరదీపంబులతోడ నర్చకులతో◆
ఘంటామృదంగాదిబం । ధురవాద్యంబులతోడ భాగవతసా ◆ ధుశ్రేణి
తోడఁ రమా । వరునిం దోడ్కొని చామరద్వితయసే ◆ వాదక్షుఁడై
యాత్మమం । దిరదేశంబున కేగుదెంచి యచట ◆ దేవార్హపీఠంబునన్॥
శా॥ శౌరి న్నిల్పి నమస్కరించుచును బూ ◆ జల్ స్తోత్రముల్ భక్తిస ।
త్కారంబుల్ తగ సల్పి శాంతియుతుఁడున్ ◆ దాంతుండుఁ దానై జప ।
ప్రారంభంబు మహోత్సవంబు చెలువా ◆ రం జేసి యాపిమ్మటన్ । నారీ
రత్నముతో జనార్దనుని చెం ◆ తన్ వేడ్క నాసీనుఁడై ॥ తే. గీ॥ వేదవే
దాంగతత్త్వజ్ఞు ◆ విష్ణుభక్తు । మంత్రమంత్రార్థవిదుని స ◆ మర్థు నొక్క ।
మనుజు నాచార్యునిఁగఁ గొని ◆ మఱియు నట్టి । బ్రహ్మఋత్విజులను వరిం ◆
పఁగను వలయు ॥ తే.గీ॥ వినుము సూత్రవతీశపూ ◆ జనముఁ జేసి । యం
తఁ బుణ్యాహవాచనం ◆ బాచరించి । దంబుగాఁ బంచవర్ణచూ ◆ ర్ణంబు
చేత । నిలుప వలయు దళాష్టక ◆ నలిన మచట ॥ క॥ అనలము వర్ణపం
చక । సూనంబుల శాస్త్రవిహిత ◆ శుద్ధపథమునన్ । శ్రీనాథభక్త
వర్యుఁడు । తా నర్చన మాచరింపఁ ◆ దగు నవ్వేళన్ ॥ క ॥ ఆచార్యబ్రా
హ్మణ్యంబుల్ । ప్రాచేతశ్శంఖమండ ◆ పములు క్రమముతో । వే చేసి
శంఖచక్రాం । కాచరణార్థంబు వైది ◆ కాగ్ని నిలుపుచున్ ॥ క॥ వీణాసం
గీతములఁ బు । రాణమ్ములఁ ◆ దానునాఁటి ◆ రాత్రి గడపిని । ప్రాణుఁడయి
కాల్యకర్మ । శ్రేణి యుదయవేళ జనుఁడు ◆ సేయవలెఁ దగన్॥ ఉ॥ అంతట
యాజకుండు జల ◆ జాక్షునిముందర నిల్చి భక్తిన । త్యంతవినమ్రుఁడై
ముకుళి ◆ తాంజలియై వదనంబుఁ జూచి శ్రీ । కాంత ప్రపన్నపాల భవ ◆ ఖం
డన వీనికిఁ బంచసంస్కృతుల్ । సంతసమొప్పఁ జేయుమని ◆ శౌరికిఁ దెల్పి
తదాజ్ఞఁ బూనుచున్॥ తే.గీ॥ జనుఁడు పుణ్యాహవాచన ◆ శంఖచక్ర । పూ
జనములు యథాక్రమం ◆ బున నొనర్చి । వరుణకలశాంబువులు శిష్యు ◆
శిరమునందుఁ । జల్లి యగ్నిముఖం బొప్ప ◆ సలిపి మఱియు ॥ క॥ అనలశి
ఖలందు సౌద । ర్శనహోమ మొనర్చి శంఖ ◆ చక్రంబులు రెం । డును

యాజకుండు తప్తము । లొనరిచి స్వకీయహస్త♦యుగమునఁ గొనుచున్॥
తే.గీ॥ చక్రికరములచేఁ జేయు ♦ సరణి శిష్యు । దక్షిణభుజంబునందు సు ♦
దర్శనంబు । సవ్యబాహువు పైఁ బాంచ ♦ జన్య మంకి । తములు గా
వింప వలయు మం ♦ త్రములతోడ ॥ క ॥ ధవళోర్ధ్వపుండ్రమును శ్రీ।
షణ్ణామ మొనర్చి హరికి ♦ దక్షిణమున శిష్యవరేణ్యు నిలిపి యామ్య।
శ్రవణంబున మంత్రజపము ♦ సలుపఁగ వలయున్ ॥ క ॥ మను వుపదే
శించినపిద।పను దరచక్రములు రెండు ♦ పంచామృతసే। చనమునఁజల్లా
ర్చి జనా । ర్దనుపూజ లొనర్పు మనుచుఁ ♦ దగఁ దెల్ప వలెన్ ॥క॥ ఈవి
ధమునఁ జక్రాంకితుఁ । డై వైష్ణవుఁ డబ్జనాభు ♦ నర్చకు బ్రహ్మణ।వారిరి
బుత్విగ్భాగవ । తావళిఁ బూజించి ద్రవిణ ♦ మధిక మొసఁగుచున్॥
తే.గీ॥ ఉత్సవుల శిబిక నునిచి ♦ యుత్సవములు।సలుపుచును బద్మనా
భుని♦సదనమునకుఁ । గొంచుఁ బోయి ధ్వజాంతిక ♦ క్షోణి నిలిపి । వారి
నచ్చోటఁ బూజింప ♦ వలయు భక్తి ॥ మ॥ దరచక్రాంకన మట్లు మాధ
వునిచెం ♦ తన్ దేవదీక్షావిధా । నరతుండై యగునట్టివైష్ణవుఁడు నా♦
నాదేవతాసన్మునీ। శ్వరసంస్తుత్యచరిత్రుఁ డౌచును దుదిన్ ♦ వైకుంఠలో
కంబు శ్రీ।ధరుకారుణ్యముచేతఁ బొందు నిది త ♦ థ్యం బెట్లు చర్చించి
నన్ ॥ తే.గీ ॥ దేవదీక్షావిధానంబు♦దెలిపినాఁడ । నింక నాచార్యదీక్ష
మీ♦కెఱుకపఱతు । సద్గుణాన్వితు లైనయా ♦ చార్యశిష్య । జనులు
సమకూాజనీదీక్ష ♦ సలుప వలయు ॥ సీ ॥ కాల్యంబునను లేచి ♦ కరణీ
యములు దీర్చి,హరిపూజ గావించి ♦ గురుఁడు స్నాతుఁ।డగు శిష్యునకుఁ
గరం ♦ బందుఁ గౌతుకబంధ,మొనరించి రజతకాం ♦ చనముఖప్ర।కల్పి
తశంఖచ ♦క్రములు విష్ణుని మోలిఁ,నర్చించి గృహ్యాగ్ని ♦ నచట నిలిపి।
పురుషసూక్తమ్మునఁ♦జరు వాజ్యమును వేల్చి, సలలితాష్టోత్తర ♦ శత
ము మూల ॥ తే. గీ॥ మనువునను విష్ణుగాయత్రి ♦ నొసరువిష్ణు।మంత్ర
మున హోమ మొనరించి ♦ మఱియు ధూప । దీపనైవేద్యముఖములఁ♦
దృప్తిచేసి। వహ్నితప్తంబు లొనరింప ♦ వలయు వాని ॥క॥ పూజాహో

మాదులు ని।ర్వ్యాజంబుగ సలిపిశిష్యు♦వరుఁడుగురుండం।భోజాక్షునకున్ ముద్రల।కోజఁ బ్రదక్షిణముచేసి♦యురుతరభక్తిన్॥ తే.గీ॥ప్రాఙ్ముఖుండయి శిష్యుని♦భక్తియుతుని। మంత్రజలములఁదడిపి స♦మగ్రశంఖ।చక్రచిహ్నముల్ భుజముల♦సలిపి ముద్ర। లంబువులఁ జల్లఁ జేసి దం♦డంబు లిడుచు॥ క॥ వనజాక్షుముద్రలను బూ।జనము మరలఁ జేసి వహ్నిఁ ♦ జక్కఁగ నుద్వా। సన మొనరిచి పుండ్రాదిక। మనుమతి గురుఁ డాచరింప♦నగు శిష్యునకున్॥ సీ॥ అర్చాకృతి ధరించి ♦ హరి యున్నదివ్యభూ, మిని ధవళంబైన♦మృత్తుఁ దెచ్చి। లౌకికసంస్కృతు ♦ లను శుద్ధిఁ జేసి మం,త్రంబుఁ జెప్పచుఁ దిల ♦ కంబు నాసి। కాగ్రంబు మొదలు ఫా ♦ లాంత్యంబుగా విష్ణు, పాదంబురీతి సౌ ♦ భాగ్య మొప్ప। ధవళయుగంబు మ♦ ధ్యమభాగవిరళంబు, చతురంగుళవిశాల ♦ మతిమసృణము॥ తే. గీ॥ గాఁ గరాంగుళిచేఁ దాల్పఁ ♦ గా వలయును। మధ్యమవిరళమందు హే♦ మప్రభలఁ జె। లంగుశ్రీచూర్ణ రేఖఁ బూ ♦ నంగ వలయు। విష్ణులోకంబు గోరిన ♦ విబుధవరుఁడు॥ మ॥ వికృతాకారము పాదవర్జితము ని♦ర్వీర్యంబు నచ్ఛిద్రమున్। వికలంబున్ గుటిలంబు భీషణము న ♦ న్వోష్యంబుగా బొట్టు దాల్పక పూర్వోక్తగతిన్ ధరించిననరుల్ ♦ ప్రాపింతు రబ్జాక్షులో। కకనత్కాంచన రత్నసంఘటితజా ♦ గ్రత్సౌధభాగంబులన్॥ తే.గీ॥ మోక్షము లభించు నంగుష్ఠ ♦ మునను లక్ష్మి। తర్జనిని బశుసుతులు మ ♦ ధ్యమముచే న। నామికను మోక్ష మతులఘు ♦ నత్వము గ। నిష్ఠికను వశ్య మగు బొట్టు ♦ నిల్పె నేని॥ క॥ ఉరమునఁ గడుపున భుజముల। శిరమున నంసములఁ బృష్ఠ ♦ సీమల నుదుటన్। హరిభక్తుఁ డూర్ధ్వపుండ్రము। లురువుగ మంత్రములతోడ ♦ నుంపఁగ వలయున్॥ క॥ శ్రీచూర్ణరేఖలు మృతా। శౌచంబుల మాని యితర♦సమయంబుల సం। కోచింప కుంప వలె శి। ష్టాచారము శాస్త్ర మిట్టు లలరారుఁ జుమీ॥ మ॥ పితృదేవాతిథిభక్తపూజనము భూ ♦ బృందారకారాధనం।బు తపం బగ్నిసమర్చనంబు జప మం ♦ భోజాక్షసంసేవయున్।

స్తుతిపాఠంబులు దానయజ్ఞములు సం ♦ శుద్ధోర్ధ్వపుండ్రంబు ఫా । లతలంబందు వెలుంగఁ జేయ వలెను ♦ ల్లాసంబుతో మానవుల్॥ చ॥ తిలకము లేక మర్త్యుఁడు పి ♦ తృప్రముఖార్చన మాచరించుచో । ఫలితము గాదు కర్త కశు ♦ భం బగుఁ గావున నెల్ల వేళలన్ । వలయు సితోర్ధ్వపుండ్ర మటు ♦ వంటిమనుష్యులు గానిపించినన్ । దొలఁగెద రబ్జబాంధవత ♦ నూజునిభృత్యులు భీతచిత్తులై ॥ మ॥ హరిదాసుండు ముకుందదాసుఁడు నయో ♦ ధ్యానాథదాసుండు శ్రీ । ధరదాసుండు మురారిదాసుఁడును సీ ♦ తారామదాసుండు శ్రీ । వరదాసుండును జక్రిదాసుఁడును శ్రీ ♦ వైకుంఠదాసుండు వి । ట్ఠరదాసుం డని శిష్యవర్యునకు వే ♦ డ్కం బేరు పెట్టం దగునన్॥ మ॥ హరి నారాయణ కృష్ణ కేశవ పుప ♦ ర్వాధీశవైకుంఠమం । దిర సంకర్షణపద్మనాభ సనకా ♦ దిస్తుత్యగోవిందచక్రి రమానాథ ముకుందవామనహృషీ ♦ కేశాదినామాదిమై । పరఁగంగా వలె దాసనామ మని సం ♦ భావింతు రార్యోత్తముల్ ॥ క॥ హరిదాసు లెల్ల జీవులు । హరి సర్వేశ్వరుఁడు గాన ♦ హరిదాసునిఁగా । పరుని వచించుట యోగ్యమి । తరనామముచేతఁ బిల్వఁ ♦ దగ దెన్నటికిన్॥ తే.గీ॥ తనకు నైసర్గికము హరి ♦ దాస్యమగుటఁ । దద్భటుం డని నామంబు ♦ దాల్ప వలెను । గాని మఱియొండు నామంబు ♦ పూనఁ దగునె । పూనిన నసత్యదోషంబు ♦ పొంద కున్నె॥ క॥ హరిదాస్యచిహ్న ములు గల । హరిదాసాహ్వయులఁ జూచి ♦ యమకింకరు లా । నరణిఁ గన భీతు లగుదురు । హరి తనదాసులను విడువఁ ♦ డని తెలియుటచేన్॥ క॥ గుండెలు తీసిన పని సు । మ్మండజవాహన భటాహ్వ ♦ యము గల్గునరున్ । దండధరకింకరులు గొని । దండించెద రనుట బ్రహ్మ ♦ తరమె యెనకఁగాన్॥ తే.గీ॥ వైష్ణవులు తక్కఁ దక్కిన ♦ వారిపుణ్య । పాపవిభజన మొనరింపఁ ♦ బద్ధుఁ డెండు । దండి కధికార మిచ్చె నా ♦ దండి హనకు । లేని పెద్దతనం బేల ♦ పూనఁ దలఁచు॥ క॥ ప్రణవనమఃపదనారా । యణశబ్దచతుర్థి లేక ♦ మైన మనువు కా । రణ మగుముక్తికి విను మ ।

ర్వాణచక్రాదికముఁ జూడ ♦ వల దను వైనన్ ॥క॥ ఈమనువునకుఁ దుల
యగు మ । హామను వెయ్యదియు జగము ♦ లందుఁ గలుఁగమిన్ । శ్రీ
మన్నారాయణపద । తామరసభటుండు దీనిఁ ♦ దగదు విడువఁగన్॥ మ॥
సురలం దింద్రుఁడు చుక్కలందు శశి ర ♦ త్నోజాతిఁ బ్రహ్లాదుఁ డాభర
ణవ్రాతములోఁ గిరీటమును స ♦ ర్పశ్రేణిలో శేషుఁడున్। నరులం దుర్వీ
విభుండు మంత్రములలో♦ నారాయణాష్టాక్షరీ । వరమంత్రంబును బెద్ద
యంచును శ్రుతుల్ ♦ వాక్రుచ్చి వర్ణించెడిన్॥ శా॥ స్నాతుండై పరిశుద్ధ
వస్త్రధరుఁడై ♦ సత్పుండ్రమాలాసనా। సీనుండై కృతనిత్యకర్ముఁడయి
సా ♦ విత్రీజపం బైనత । ర్వాతన్ దేశికపంక్తి నెన్నుచు హరిన్♦ వర్ణించి
యష్టాక్షరిన్ । బ్రీతిం బ్రత్యహమున్ జపింప వలె మా ♦ రీచారిదాసుం
డిలన్॥ సీ॥ చక్రచాపగదాసి ♦ జలజాంకములతోడఁ దనరారుసవ్యాప♦
దంబు సాఁచి । దాసపాపౌఘవి♦ధ్వంసక మగుదక్షి, ణాంఘ్రి తలం బిం
చుం ♦ కంత వంచి । మణికంకణోర్మికా ♦ మహితవామేతర, హస్తంబు
జానువు ♦ నందు నిలిపి । యుపధానముగను స ♦ వ్యోజ్జ్వలహస్తంబు,
నహిరాజపర్యంక ♦ మందుఁ జేర్చి॥ తే.గీ॥ శత్రుభయదంబులగు ♦శంఖ♦
చక్రములు త । దన్యపాణులఁ బూని ర ♦ మాంగనావి । భూషణమ్ము
లతోఁ దగు ♦ శేషశయను । ధ్యాన మొనరించుచును సల్పఁ ♦ దగు
జపంబు॥ మ॥ ఇతరాలాపము లన్యకార్యములు న ♦ న్యేచ్ఛల్ విసర్జించి
శ్రీ। పతిపాదాంబుజబద్ధచిత్తుఁడు నతి ♦ ప్రహ్వీభవద్గాత్రుఁ డా । నతశీ
ర్షుండు నిమీలితాక్షుఁ డగుచున్ ♦ నారాయణాష్టాక్షరాం । చితమం
త్రంబు జపించుమానవునకున్ ♦ సిద్ధించు మోక్షోన్నతుల్ ॥ క॥ విను
మష్టవారములకును । ననూనముగ శక్తిఁగొలఁది♦ నష్టాక్షరి తా । నను
దినము జపము సేయం । జనుఁ దక్కువ యైన నఘము ♦ సమకూరుఁ
జుమీ ॥ క॥ ఆచారవంతుఁ డగుచు స । మీచీనగతిం జపింప ♦ మే
లగు రోగ । ప్రాచుర్యమందు విధివిహి । తాచరణము లేని జపమె ♦

యతిశయ మొందున్ ॥తే. గీ॥ భువిని జపసంఖ్య యాచార ♦ ములును
శక్తి। కనుగుణంబుగఁ బూనఁగాఁ ♦ జను సశక్తుఁ। డధికమూనుట శక్తుఁ
డై ♦యల్పతరము। సేయుటయుఁ గూడ దిఁక వేయుఁ ♦ జెప్ప నేల ॥ మ॥
ధరణీ భూమిసుపర్వవర్యునకు సం♦ధ్యావందనంబుల్ బలెన్ । సరసీజా
క్షపదాబ్జదాసతతికిన్ ♦ నారాయణాష్టాక్షరీ। వరమంత్రోరుజపంబు నిత్య
మగుటల్ ♦ వర్జింపఁగాఁ గూడ ద। స్థిరుఁడై మానినవాఁడు పాపి యను
చుం♦ జెప్పెం జుమీ వేదముల్ ॥ క॥ అంగకరన్యాసాదుల। సంగతి మే
లవియు లేక♦జపియింపఁగ నీ। బంగారువలువదాల్పరి।మంగళమంత్రంబు
ముక్తి ♦ మార్గమె చేర్చున్ ॥చ॥ అనలగుణం బెఱుంగక జ ♦ డాత్ముఁడు
ముట్టినఁ గాల్పదే విషం।బని మదిలో నెఱుంగమి భ♦యం బణు వైనను
లేక క్రోలినన్ । జనుఁడు మృతుండు గాఁడె మను ♦ శక్తి తదర్థ మెఱుం
గనట్టిమ । ర్త్యనిజప మేటికిం దొలఁగఁ ♦ దొలదు తద్దురితవ్రజంబు
లన్॥క॥ తొలుతం బదియేనక్షర। ముల మఱి పదియక్షరములఁ ♦ బుట్టిన
మంత్రం । బలరు ద్వయ మన దానిం। జలజాక్షుభటుండు విడువఁ ♦ జన
దవ్వేళన్ ॥క॥ శుచి యయ్యు నశుచి యయ్యును । విచక్షణుఁడు ద్వ
యము సర్వ♦వేళల భక్తిం। బ్రచురముగ జపము సేయుచు।ముచికుందా
ర్చితునిలోక ♦ మునకుం బోవున్ ॥ తే. గీ॥ చరమమంత్రం బనంగ శ్రీ ♦
హరి రథస్థుఁ।డగుధనంజయునకుఁజెప్పి♦నట్టి బ్రహ్మ।విద్యతుద మాశుచాం
తమై ♦ వెలుఁగుప్రపద । నార్థయుతమైన ద్వాత్రింశ ♦ దక్షరంబు ॥ క॥
ప్రతిదిన మీమనువు త్రి రా।వృత మైన జపింప వలయు ♦ విడువఁదగదు
సద్గతి తనకుం గావలె నని । మతిఁ గోరినవిష్ణుదాస ♦ మండల మెపు
డున్ ॥క॥ మంత్రార్థ మెఱుంగనిజప । తంత్రముకన్నను ఫలప్ర♦దంబై
తనరున్। మంత్రార్థజ్ఞనిజప మని । మంత్రాగమములు వచించె♦మానులు
మెచ్చన్ ॥ వ ॥ కావున స్వరూపప్రతిపాదనపరంబును సకలవేదాంతశా
స్త్రరుచిపరిగృహీతంబును నగునారాయణాష్టాక్షరీమంత్రంబున కర్థంబు
తొలుత వివరించి స్వరూపానురూపోపాయ పురుషార్థసంప్రతిపాదనపరం

బైనద్వయమంత్రంబునకును ద్వయార్థవివరణరూపం బైనచరమమం
త్రంబునకునుం గలభావార్థంబులు వివరించెద సావధానచిత్తులై వినుం
డని శిష్యులతో జగద్గురుం డిట్లనియె ॥ తే. గీ॥ వేదముల కాది వేదని♦
వేశనము స్వా।ర శ్రుతిస్మృతివిశ్వవ♦న్న ప్రభవము ।వర్ణితత్ర్యక్షరమువిష్ణు♦
వాచకంబు।నగుచుం దగుం బ్రణవంబు జ♦ప్యములమేటి॥వ॥ ప్రణవపద
చ్ఛేదంబుననగునకారోకారమకారంబులం దకారనారాయణపదంబు లు
కారనమఃపదంబులు మకారనారపదంబు లేకార్థప్రతిపాదకంబు లగుటం
బ్రణవవివరణంబు నమోనారాయణయనుమంత్ర శేషం బయ్యెం దన్నా
రాయణమంత్రంబునంగలయుపాయోపేయ స్వరూపనిరూపణ రూపకం
బైనద్వయమంత్రంబును దద్గతోపాయోపేయ స్వరూపాపేక్షిత ప్రాప
కాంతరపరిత్యాగ సకలపాప నివృత్తికథారూపకం బైనచరమమంత్రం
బును బూర్వోత్తరసాపేక్ష మంత్రత్రయంబును బ్రణవార్థవివరణంబు
చేసె నని మఱియు నిట్లనియె ॥ మ ॥ కరుణన్ సృష్టియొనర్చి ప్రాణు
లను బ్రా♦క్కర్మానుగుణ్యంబుగా । ధరణిం ద్రిప్పి తుదిన్ వారించుచు
జగ♦ద్గర్భుండు తానై తదం । తరమం దంతట నిండియుండుట
జగ♦త్కర్తృత్వ విష్ణుత్వముల్ । వరుసం బూనినవాఁ డకారము
నకున్ ♦ వాచ్యుం డనెన్ వేదముల్ ॥ క ॥ అవధాతు విచ్చునర్థ ।
మ్మవనము వ్యాపకత యగుట ♦ నారెండురమా । ధవుపాలను బరిపూ
ర్ణము । లవుట నతఁ డకార వాచ్యుఁ♦డై తనరారెన్॥ తే.గీ॥ ణత్వ
మగు నయనపదగ ♦ నత్వ మసుర । వైరిపరమును నారపూ ♦ ర్వకము
నైన । నితరపర మైన నత్వంబె ♦యొసఁగు ననుచుఁ । బాణిని వచించె
శబ్దప్ర ♦ బంధమందు॥ క॥ నారాయణుఁ డన విష్ణుఁడు। నారాయణశబ్ద
మన్య ♦ నకుఁ జెల్లదు ల । క్ష్మీరమణుపర మటంచును । బారాయణ
మాచరించెఁ ♦ బాణిని వేడ్కన్॥ మ॥ శ్రుతి నారాయణుఁ డంతరాత్మ
గురుఁడున్ ♦ శుద్ధుండు సర్వేశ్వరుం । డతిశాంతుండు పరాత్పరుండు నిగ
మాం ♦ తారాధ్యుఁడున్ హేయవ । ర్జితుఁ డానందమయుండు కర్త

యును ల ♦ క్ష్మీభర్త సంహర్త సం । స్తుతిపూజార్హుఁడు విశ్వదేహిప
రుఁ డం ♦ చుం జాటి చెప్పం జుమీ॥ మ॥ భవపద్మాసన భానుశక్రము
ఖశ ♦ బ్దశ్రేణికిన్ వాచ్యుఁడై । శివపంకేరుహగర్భముఖ్యవిలస ♦ జ్జీవా
శ్రితుండై శచీ । ధవపద్మాసన శర్వముఖ్యులకు నం ♦ తర్యామియై యుం
డు మా । ధవుఁ డంచున్ వచియించె నారణము బా ♦ ధ్యం బైనశబ్దం
బుతోన్॥ వ॥ నారాయణమహానారాయణోప నిషత్తులయందుఁ జెప్పం
బడిన నారాయణ పరాత్పరత్వంబునకుఁ బ్రతిఘటింప నెవ్వరికిం దరంబు
గాదు అపృథక్సిద్ధసంబంధంబునం జేసి దేహవాచక పదంబులు దేహి
కగుం గావున సకలచిదచిదంతర్యామి యైననారాయణుని యందు సక
లదేవతాప్రతిపాదక వేదవాక్యంబులు శరీర శరీరిన్యాయంబున వ్యవస్థా
నావ్యవస్థానోభయవిధానంబులం బ్రవర్తించుటం జేసి యకారవాచ్యుం
డు శ్రీమన్నారాయణుం డయ్యె నదియునుం గాక సకలవేదాది యైన
ప్రణవంబునకు మూలంబై సకలశబ్దమయం బైనయకారంబు సకలశబ్ద
వాచ్యుం డైనశ్రీమన్నారాయణునిపరంబు గాక యన్యదేవతాపరం
బగు ననుకంటె విరుద్ధంబు గలదే యని మఱియు నిట్లనియె॥ తే.గీ॥
భూతకర్మబుద్ధీంద్రియం ♦ బులును విషయ । ములును జిత్తచతుష్టయ ♦
మును శరీరి । యనెడితత్త్వంబు లెల్లను ♦ గాదివర్గ । వర్ణ వాచ్యం
బులై యుండు ♦ వరుసతోడ॥ తే.గీ॥ కావునను నిత్యముక్తులు ♦ కేవ
లులును । బద్ధు లనెడిచతుర్విధ ♦ ప్రాణులకును । వాచకము పంచవిం
శమౌ ♦ వర్ణ మగుమ । కార మాహ్లు బొందు వన్ ♦ పేరుఁ బూను
క॥ తనయిచ్ఛ వచ్చినట్టుల । వినియోగింపంగఁ దగిన ♦ వియె శేషప
దం । బునకున్ వాచ్యము లంచును । వినఁబడియెను శేషశబ్ద ♦ వివర
ణవేళన్॥ క॥ చేతనజాత మచేతన । జాతంబును శేష మగును ♦ జక్రధరు
నకుం । జేతనజాతికి సకలా । చేతనముల కచ్యుతుండు ♦ శేషియనఁ
దగున్॥ తే.గీ॥ హరికి శేషంబు లీయాత్మ ♦ లనియుఁ దనకు । శేష మను
కొన్నప్రకృతియు ♦ శేషశాయి । శేష మనియు మకారంబు ♦ చెప్పెను

దద। కారము చతుర్థితోఁ గూర్చు ♦ కాలమందు॥ తే,గీ॥ పరమపురుషుని వస్తువు♦ ప్రాణి యనియుఁ।బరమపూరుష గతికుండు ♦ ప్రాణి యనియుఁ। బరమపురుషున కుదయించెఁ ♦ బ్రాణి యనియుఁ। దెలిసి చరియింప నలయును ♦ ధీరుఁ డెపుడు॥ క॥ వినుము చతుర్విధజీవులు । వనమాలికి దాసు లగుట ♦ వారల కెల్లన్ । వనమాలి సామి యగుటయు । కన యంబు స్వభావసిద్ధ ♦ మనియె నిగమముల్॥ తే.గీ॥ అచ్యుతశరీర మీయాత్మ ♦ లగుట నాతఁ।డెట్లు త్రిప్పినఁ జరియింతు♦ రట్లె కాని। తారొకించుకయును జేయ ♦ లే రటంచుఁ । దెలియ వలయు నకర్తృత్వ♦ ధీయుతుండు॥ ఉ॥ ఆతఁడె వహ్ని సూర్యుఁ డతఁ ♦ డాతఁడె వాయువు చంద్రుఁ డాతఁ డీ । చేతనజాతము న్మఱి య ♦ చిత్తును సర్వ మతండు గాన శౌ । రీతర మెగ్గి గా దనుచు ♦ నెంచి శరీరిశరీరభావసం । కేతము గల్గునట్లు శ్రుతి ♦ కీర్తనఁ జేసె నభేదపద్ధతుల్॥ క॥ జీవులకుఁ జక్రికింబలె । సేవకనృపతులకు శేషి ♦ శేషత్వంబుల్ । లే వనుచు నిశ్చయార్థక । మై వెలసెఁ జుమీ యుకార♦ మా ప్రణవములోఁ॥ తే.గీ॥ సకలదేవవిభుండౌట♦శంక రాది।దేవతారాధనమువిష్ణు♦దేవునొందుఁ। గాని యజ్ఞానకృత మాటఁ♦గర్తయైన।శౌరి స్వల్పఫలంబట్టి♦ వారి కొసఁగు॥ తే.గీ॥ఇదిమెఱింగి సుమీ పెద్ద♦లింద్రముఖ్య। ఖచరులనునిత్యనైమిత్తి♦కములఁ దక్కఁ।దక్కినప్పుడు గొలువక ♦ దనుజవైరి। పూజనముచేతఁ గాలంబుఁ♦ బుత్తు రెపుడు॥ క॥ పదములు మూఁడిటి కర్థము । విదితము చేయఁబడె నింక♦వినుఁడు ప్రణవసం। పదయుక్ వాక్యార్థం బని । సద యుం డైడ యతఁడు వలికె ♦ శాస్త్రోక్తముగాన్॥ సీ॥ మును భూర్భువ స్సువ♦యని ఋగ్యజుస్సామ, ములు మూఁడు సారవా♦క్కుల జనించెఁ। గ్రమమున వాని క ♦ కార ముకారమ, కారముల్ పొడమి సం♦గతము లగుచు। నోంకార మగుటఁద ♦ దోంకార మఖిలవే, దార్థసారంబు నా♦ రాయణపర। మపవర్గ కారణం ♦ బఖిలసమారాధ్య, మని సన్నుతించెద♦ రార్యజనులు॥ తే.గీ॥ కమలనేత్రునకును దాస ♦ గణములకును । నిత్యసం

బంధ ముండఁట ♦ నిశ్చయంబు। ప్రణవశబ్దార్థ మిట్టు లే♦ర్పఱచి మీకుఁ।
జెప్పినాఁడను వింటిరే♦ శిష్యులార॥ తే. గీ॥ మనన మొనరించుజీవుండు♦
మంత యగును। మంత యగువానిఁ బ్రోచుట ♦ మంత్ర మయ్యె। దై
వతములందుఁ జక్రివి ♦ ధమున మనువు। లందు నారాయణునిమను ♦ వ
ధికతరము॥ చ॥ ఇదె భుజ మెత్తి సత్యముగ ♦ నేను వచించెద శిష్యు
లార మో। క్షదము భవాబ్ధితారకము♦ స్వర్గఫలప్రద మాగమాంతసం।
విదితము పాతకఘ్నము ప ♦ విత్రము సర్వమనూత్తమంబు నా। రదము
ఖయోగిసేవ్యము ని ♦ రంజన మీమనువర్య మూర్వరన్॥ క॥ ధర్మార్థికి
భర్మార్థికి। శర్మార్థికి ముక్తిఁ గోరు ♦ జనముల కేత। న్నిర్మలమంత్రమె
జప్యము। దుర్మతు లిది యెట్లు తెలియు ♦ దురు భువిలోనన్॥ వ॥ ఇంకఁ
బ్రణవనారాయణశబ్దమధ్యగతం బైననమఃపదంబు సఖండాఖండభేదం
బున ద్వివిధంబై యుండు నం దఖండం బేకపదంబు సఖండంబు నపద
మఃపదవిభక్తం బిట్టి నమశ్శబ్దంబు ప్రణవయుక్తంబై "ఓంనమో" య
నియును నమఃపదాన్వితంబై "నమో నమో" యనియును జతుర్థ్యంత
నారాయణశబ్దయుక్తంబై "నమోనారాయణాయ" యనియును ద్రిప్ర
కారాన్వయంబై వర్తిల్లు నందు సఖండనమశ్శబ్దంబునం గలనకారంబు
నిషేధవాచకంబు మకారంబు జీవవాచకం బింక ఖండరహితనమఃప
దంబు శరణాగతి బోధకం బగుట సఖండనమఃపదంబు ప్రణవయు
క్తంబై జీవునకుం గలశేషత్వంబును నఖండాన్వితసఖండనమఃపదంబు
భగవత్ప్రాప్తికి భగవంతుండె సాధనం బనుప్రపదనోపాయంబును మర
లఁ జతుర్థ్యంత నారాయణశబ్దాన్వయసఖండనమఃపదంబు షడ్గుణైశ్వ
ర్యసంపన్నుండును శ్రీమంతుండును సర్వవ్యాపియు నగునారాయణుని
కైంకర్యం బే నొనర్చెదఁ గాని మదర్థంబు గా దని కైంకర్యగమ్యం
బైనస్వప్రాప్యభగవత్స్వరూపంబునుం దెలిపి స్వాతంత్ర్యంబును నిజరక్ష
ణసామర్థ్యంబును సకలజగద్వశీకరణసంజాత శేషిత్వానురూపసముచి
తవృత్తియును భగవంతునకు నైసర్గికంబులై కలిగి యుండుం గాని జీవు

లయం దించు కంతయుఁ గలుగ వనుట నమశ్శబ్దార్థం బని వెండియు
నిట్లనియె॥ తే. గీ॥ హరికి శేషంబు లీయాత్మ ♦ లగుట నాతఁ। డేమిచేసి
న నట్లాడు ♦ నెట్లు త్రిప్పినట్లు తిరిగెడ నేఁ జేయు ♦ నదియొకించు । కైన
లే దను టాత్మత ♦ త్త్వప్రబోధ॥ క॥ ఒకగతిఁ దగునాత్మను వే । ఱొకగ
గతి వచియించుకంటె ♦ నుండునె పాపం । బకటా విను మాత్మస్తేయికిఁ జే
యఁగ రానికార్య ♦ మెయ్యది జగతిన్॥ ఆ. గీ॥ ఆత్మగాని దేహ ♦ మా
త్మగాఁ దెల్పుట । కర్త గాని తాను ♦ కర్త ననుట । జన్మమరణహేతు ♦
సంసారశాఖికిఁ । బెరలునూటినట్టి ♦ బీజయుగము॥ శా॥ కామక్రోధమ
దాంబుసంకులము జా ♦ గ్రచ్ఛోకమోహోర్మికా । భీమం బీషణమోహ
లోభమకరా ♦ భీలంబు తాపత్రయా । ర్త్యామోఘం బగునాజవంజవ
దురం ♦ తాంభోనిధిం దాఁటఁగా । శ్రీమన్మాధవనావిహీనుఁ డగుచో ♦
జీవాత్మకున్ శక్యమే॥ ఉ॥ కర్తయు భోక్తయుం బ్రభుఁడు ♦ కారణ
కారణ మీశ్వరుండు సం।హర్త జగత్ప్రవర్తకుఁ డ ♦ నంతుఁ డమేయుఁడు
నంతరాత్మ సం । భర్తయు వేత్త వేదన మ ♦ బాధ్యుఁడు వేద్యము సర్వ
మున్ రమా । భర్త యటంచుఁ గాంచు నెడఁ ♦ బంధితుఁ డొందును
మోక్షసంపదల్ ॥ఉ॥ ఇంతకు మించుమార్గము మ ♦ ఱెయ్యది లే దని
తెల్పు వేదవే । దాంతము లెల్లఁ దొల్లి సన ♦ కాదిమునీంద్రులు నంబరీ
షభూ । కాంతకిరీటిధౌమ్యశుక ♦ గర్గపరాశరసూన్వరుంధతీ । కాంతము
ఖ్యోరుభక్తులును ♦ గైకొని పూనుపథం బిదే సుమీ॥ క॥ నారాయణచరణ
ద్వయ । సారసభక్తియుతుఁడు ♦ సంసారాకూ । పారము గోవత్స
పదా । కారమ్ముగ దాఁటి సౌఖ్య ♦ కలితుఁ డగుఁ జుమీ॥ క॥ భరము
తనయందు నిలిపిన । నరులను రక్షింతు ననుచు ♦ నాళీకాక్షుం । డిరు
కాలఁ గట్టుకొనియెను । బిరుదు లయిన దొడ్డగండ ♦ పెండేరమ్ముల్॥
చ॥ హరునకు సేవ్యుఁ డైనచతు ♦ రాననుఁ నేలినవాఁడు పొక్కిటన్। విరి
గలవాఁడు వేల్పులకు ♦ వేల్పగువాఁడు సమస్తవేదముల్ । గఱపిన
వాఁడు భక్తుల క ♦ ఖండశుభం బిడెఁ గూర్తు నంచుఁ బె । న్బిరుదులు

పూనువాఁ డసుర ♦ భేది యటంచు వచింపవే శ్రుతుల్॥ క॥ కరుణారస
భరితాంతః । కరణుండై లక్ష్మితోడఁ♦గలిసి జగములం। బరిపాలించుచు
నుండును । సరసిజనేత్రుం డటంచుఁ♦ జాటె నిగమముల్ ॥క॥ సకలస్థలా
వసరముల। సకలావస్థలను బార్థ♦ సఖుకైంకర్యం। బకుటిలగతిఁ జేయుట
దేహికిఁ గర్తవ్యం బటంచు ♦ నెఱుఁగ వలె జనుల్॥ చ॥ ఇతరుల కెద్ది
యుర్ సలుప ♦ నేను స్వతంత్రుఁడ నౌట యెట్లు మ । ద్గతియె మురారి
కర్ వశము ♦ గాని మదీయవశంబు గాదు నే । నతనికి దేహ మౌట
నిజ ♦ మై కనుపట్టు శరీర మింద్రియ । ప్రతతి మదీయ మె ట్లనుచుఁ♦
బండితుఁ డూహ యొనర్చు నిత్యముర్ ॥క॥ మమ యను రెం డక్షరములు।
యమలోకప్రాప్తికారకు ♦ నగును నరులకుర్ । న మమ యనుమూఁడు
వర్ణము । లమృతాఖ్యం బైనముక్తి ♦ కగును నిజముగాన్॥ తే.గీ॥ విను
మనన్యార్హశేషత్వ ♦ మును దదన్య । భోగ్యతానర్హతయు నన్య ♦ పురు
షశరణ । పద్ధతియు లేమి జీవస్వ♦భావధర్మ । మనుచుఁ దెల్పె నమః
పదం ♦ బర్థశక్తి ॥ వ ॥ నారాయణశబ్ద పదచ్ఛేదంబునం గలనార
పదాయనపదంబులలో నారపదవివరణం బెట్లనిన క్షయార్థకరింధా
తూత్పన్నరశబ్దంబు క్షయిష్ణువాచి యగుట నిషేధార్థబోధక నఞ్ పూ
ర్వకరశబ్దంబు నరశబ్దం బయ్యె నరశబ్దంబుచేత నాశగహిత పదా
ర్థంబు బోధితం బగుం గావున నరసమూహంబు నారం బని యెఱుంగ
వలయు గత్యర్థబోధక మగునిణ్ ధాతూత్పన్న మగునయనశబ్దంబు కర్మ
వ్యుత్పత్తిచేతఁ బ్రాప్యవాచియుఁ గరణవ్యుత్పత్తిచేతఁ బ్రాపకవాచియు
నధికరణవ్యుత్పత్తిచేత నాధారవాచియు నగు నని మఱియు నిట్లనియె॥
సీ॥ జ్ఞానసత్యానంద ♦ సలలితరూప మై, శ్వర్యశక్తిబలాది ♦ షడ్గుణము
లు।సౌశీల్యముఖధర్మ♦సమితియు దివ్యమం, గళవిగ్రహంబు త♦త్కాంతి
సౌకు । మార్యలావణ్యసౌం ♦ దర్యాదులును దివ్య, భూషణాయుధర
మా ♦ భూమినీల । లును నిత్యసూరు లా ♦ లోలచామరరథ, పాదుకా
చ్ఛత్రత ♦ ల్పప్రభృతులు॥ తే.గీ॥ ద్వారపాలురు నుపనిష ♦ త్పంచకం

బు। ముక్తులును బరమాకాశ ♦ మును నిబద్ధ । జీవమూలప్రకృతి విశు ♦ ద్ధావసరము । లెల్ల నారపదార్థంబు ♦ లేకరీతి॥ తే.గీ॥ మహద హంకారభూతత ♦ న్మాత్రభౌతి । కంబులు ప్రవాహరీతి నా ♦ రంబు లయ్యె । వేయు నేల విభూతిద్వ ♦ యీయుతాఖి । లార్థములు నార శబ్దవా ♦ చ్యంబు లగును॥ క॥ నారములకుఁ బ్రాప్యం బౌ । ధారము ప్రాపకము నగుట ♦ దాశౌర్యనకున్ । నారాయణుఁ డనుశబ్దము। వారక సకలాగమముల ♦ వాచ్యం బయ్యెన్॥ తే.గీ॥ జగతి నాధారపద మధి♦ ష్ఠానవాచి । యగుట షష్ఠీబహువ్రీహి ♦ నాశ్రయించి । యర్థ మొన రింప నారాయ ♦ ణాఖ్య యతని।సకలజగదంతరాత్మత్వ♦శక్తిఁ దెలిపె॥ క॥ నారము లన నీరమ్ములు। వారిధిలోఁ బ్రళయవేళ ♦ వటపత్రముపై। శౌరి శయినించుకతమున । నారాయణశబ్ద మతని♦ నామంబయ్యెన్॥మ॥ అకలంకజ్ఞత గల్గు నా కిపు డవి ♦ ద్యావాసనాకర్మబం।ధకముల్ వాపి స్వరూపసంగతభవ ♦ త్పాదాబ్జకైంకర్యముల్ । సకలావస్థల సర్వవేళల సమ ♦ స్తక్షోణులన్ వారిజాం । బక కూర్పం దగు నంచు వేఁడుట సు మీ ♦ మంత్రార్థమై భాసిలుఁ॥ తే. గీ॥ స్వస్వరూపాను దాస్యం బౌ ♦ సంగ వయ్యె। దాని కగుబంధకములు వ ♦ దల్ప వయ్యె। మించుదయ నన్ను♦రక్షించి కాంచవయ్యె।యనుచుహరి వేఁడుకొనుట మం♦త్రార్థసర ణి॥ తే. గీ॥ ప్రణవమున శేషతయు నమః ♦ పదముచేతఁ।బారతంత్ర్యం బు నారాయ ♦ ణోరుపదము । చేతఁగైంకర్యమును ముందు ♦ చెప్పఁబడి యె। మహిని గల విందులకును బ్ర♦ మాణకోటి॥ తే.గీ॥ బాంధవాసక్తి దేహాత్మ ♦ భావమును ని । జస్వతంత్రత యితరశే ♦ షత్వ మాత్మ । ర క్షణమనీష విషయాను ♦ రక్తి యనెడి । ప్రపదనాదుల నీమంత్ర ♦ జప మణంచు॥ తే. గీ॥ జడము దుఃఖమయంబు న♦శ్వరము తనువు। జ్ఞాన రూపుఁడు నిత్యుండు ♦ సౌఖ్యయోగ్యుఁ । డాత్మ యనుచును దెల్పి దే ♦ హాత్మబుద్ధిఁ।బాపును మకార మర్థ మే ♦ ర్పఱచువేళ॥ మ॥ కమలానాథు ని విశ్వసర్గలయదీ ♦ క్షాదీక్షితుఁ హేయసం । గమసంశూన్యసమస్త

మంగళగుణ ♦ గ్రామున్ జగచ్ఛేషిఁ గాఁ । గ మధుధ్వంసి నకార మేర్ప
ఱచి వే ♦ డ్కన్ స్వాత్మకర్తృత్వదు । ర్భ్రమ నారాయణమంత్రజాపకు
లకుం ♦ బ్రాపింప నీ దెన్నఁడున్ ॥ మ॥ హరికిన్ జీవులు శేషభూతులు
సమ ♦ స్తాత్మాళికిన్ శేషి శ్రీ । హరియే కాని యొరుండు కాఁ డని యు
క్తా ♦ ర్థంబు లక్ష్మీపతీ । తర శేషిత్వగతభ్రమాత్మకమతిన్ ♦ దామి
స్రమున్ బాలభా । స్కరుమాడ్కిన్ నిమిషంబులోపలఁ దొలం ♦ గం జే
యు దాసాళికిన్ ॥ క॥ హరి యొకఁడె తనకు రక్షకుఁ । డొరుఁడెవ్వఁడుఁ
గాఁ డటంచు ♦ నొగిఁ దెల్పి ద్విధా । భరితనమఃపద మాత్మకు । హరి
యించుం బ్రబలసాధ ♦ నాంతరబుద్ధిన్ ॥ మ॥ తనకున్ విష్ణుఁడె తల్లి
తండ్రి హితుఁ డా ♦ ధారంబు ప్రాప్యం బటం । చును నారాయణశబ్ద
మాజలరుహా ♦ క్షున్ నిత్యసిద్ధాత్మబం । ధునిఁగాఁ దెల్పి శరీరబాంధవు
లయం ♦ దున్ గల్గుమోహప్రవ । ర్తన మెల్లన్ హరియించు మంత్రమ
హితా ♦ ర్థజ్ఞాని కొక్కుమ్మడిన్ ॥ వ॥ మనుజుండు విధివిహితావిహితవి
షయభోగలాలసుం డైనయెడ భగవద్గుణానుభవజనితప్రీతికారితాశేషా
వస్థోచితాశేష శేషత్వైకరూపనిత్యనిరవద్యనిరతిశయభోగ్యభగవత్కైంక
ర్యప్రార్థనాప్రకాశకసఖండనమఃపదాన్వితనారాయణ పదోపరిస్థితావ్య
క్తచతుర్థి తన్నిరసనంబున సాధుతరంబై యుండు మఱియును వ్యక్తచ
తుర్థ్యనుసంధానంబుఁ జేసినఁ దదుక్తకైంకర్యంబు భగవంతునకే కాని
తనకు లే దను నమఃపదంబుచేత స్వాత్మపరమాత్మోభయాధానకైంక
ర్యంబునందు స్వార్థత్వంబు మరలుటవలనఁ గేవలస్వార్థరూపప్రతీయ
మానాత్యంతస్వరూపవిషయాంతరనివృత్తి కైముతికన్యాయసిద్ధం బగు
టవలన భగవదేకాతిశయాధాయకకైంకర్యేతర భోగరాహిత్యలక్ష
ణానన్యభోగ్యత్వంబు సార్థకంబై తోఁచుటవలనఁ దదితరసుఖలవజని
తపరిణతిరూపవిరసదుఃఖబహుళచంచలహేయవిషయవిముఖుం డగు నని
మఱియు నిట్లనియె॥ తే. గీ॥ ప్రాప్య మగు బ్రహ్మతత్త్వంబు ♦ ప్రాప్తికా
ముఁ డైన జీవుండు ప్రాప్త్యుపా ♦ యప్రపత్తి । ప్రాప్తిఫలహరిలోక ము ♦
పాయవైరి । కర్తృత్వము నర్థపంచకా ♦ ఖ్యతఁ వహించు ॥ తే. గీ॥ అర్థ
పంచకమునకంటె ♦ నన్య మించు । కైన వేదంబులోన లే ♦ దట్టి యర్థ ।
పంచకము విష్ణుతత్త్వప్ర ♦ పంచమును స । మంచితేస్ఫూర్తిఁ దగెఁ దిరు ♦

మంత్రిమందు॥ ఉ॥ శౌరి సమస్తజీవులకు ♦ సామి శరీరియు శేషి జ్ఞేయ
మా। ధారము భర్త రక్షకుఁడు ♦ తండ్రియు భోక్త యటంచు వేడ్క
మూఁ। డాలు తెలుంగులన్ విశద♦మై కనుపట్టెడి బాంధవంబు చెన్నారఁ
గఁ జెప్పె నీమనువు ♦ నంతయు మీకు వచించితిన్ దయన్ ॥ క॥ అని
శిష్యులతోఁ గేశవాతనయుండు వచించె ననుచుఁ ♦ దాపసులం గన్గొని
సూతుం డమృతరసం। బునకుం జెలియైనవాక్య ♦ ములఁ దెల్పెఁ దగన్॥
అంత్యనియమఘటిత సయమకముక్తపదగ్రస్తమత్తేభము ॥ అకలం
కస్తుతసార సారతరమే ♦ ధాధార ధారాధరా। ధికదాతృత్వవిహార
హారహిమరు ♦ గ్దివ్యాగకర్పూరపూ। ర కిటీశేశ్వరతార తారగిరి
హీ ♦ రస్వచ్ఛవిస్తారతా। రకకీర్త్యున్నతివార వారణరిపు ♦
ప్రాంచత్ప్రితా పోదయా ॥ అంత్యనియమఘటితషోడశ విధకందము॥
మారసుకుమార సారా। చారా క్రూరజనదూర ♦ సన్నుతసారా।
చారుపరివార సౌమ్యవి। చారా భూరిగుణపూర ♦ సంభృతచారా ॥
లయగ్రాహి ॥ సోమసుత సోమ నల ♦ కామ సకలామరల ♦ లామతన
యామలసు ♦ కోమలశరీరా। సామజముఖామితని ♦ రామయచమూమ
హిత♦భీమరిపుభూమిపతి♦నామహరధామా। తామసవిలోమగుణ♦కామి
తవిరామవర♦భూమిసురకామకర♦హేమమయధామా। రామపదతామ
రస ♦ గామిఘనధీముదిత ♦ భీమహిమభూమిధర ♦ భౌమసితకీర్తీ ॥
గద్య॥ ఇది శ్రీమదుభయకవిత్వరచనానల్పచాతుర్య కొటికెలపూడివంశ
కమలవనసూర్య హరితసగోత్రధుర్య జ్యోతిషాగమాచార్య
శ్రీ మన్నారాయణ చరణాంబుజ ధ్యానగతస్థైర్య
సకలమత వేదాంతసిద్ధాంతానివార్య
వేంకట కృష్ణమ్మ సోమయాజి కుమారవర్య
కోదండరామార్య కార్యంబైన
ప్రపదనపారిజాతంబను
దివ్యప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీరస్తు.

# ప్రపదనపారిజాతము.

## తృతీయాశ్వాసము.

శ్రీజానకీమనోహర। రాజీవసమానచరణ ♦ రక్తియుతమనో। భోజ
మహారాజశ్రీ । రాజా శ్వేతాచలపతి ♦ రంగారాయా ॥ వ ॥ అవధరిం
పుము సూతుండు శౌనకాదుల కిట్లనియె ॥ క ॥ ఈరీతి నష్టవర్ణో । దార
మనువుభావ మెల్లఁ ♦ దగఁ దెల్పి శుభా । ధారద్వయమంత్రార్థ ।
ప్రారంభముఁ జేసి యిట్టు ♦ లనె గురుఁడు దయన్ ॥సీ॥ పురుషకారిణి
యైన ♦ సిరితోడ నిత్యసంబంధి యౌట హరి శ్రీ ♦ మంతుఁ డయ్యె।
స్వామిత్వసౌశీల్య ♦ వాత్సల్యసులభతా, జ్ఞానపూర్తిప్రాప్తి ♦ శక్తిస
హితుఁ । డగుట నారాయణుం ♦ డయ్యె నాతనిపాద, వనజముల్ చర
ణంబు ♦ లన వెలుంగు। శరణ మనంగ మో ♦ క్షప్రాపణోపాయ,
మయ్యుపాయము తన్ను ♦ నాశ్రయించె॥తే.గీ॥ నిప్ప డను తెల్వి యే
ప్రప ♦ ద్యే యనంగ । శ్రీమతే యన లక్ష్మితోఁ♦జెలఁగిమిథున । రూపక
ప్రాప్యుఁ డునుట ప ♦ రుండు శేషి । సామి నారాయణపదార్థ ♦ సరణి
వినుము॥ ఆ.గీ॥సకలవస్తుదేశ ♦ సమయశుభం బైన । తావకీనసేవఁ ♦
దగ నొసంగు । మనుచుఁ జక్రివేఁడు ♦ కొనుట సుమీ తచ్ఛ । తుర్థిఁ
కర్థ మగుఁ గు ♦ తూహలముగ॥ తే.గీ॥ తాను భోక్తయు భోగ్యంబు♦
తనకుఁ బ్రకృతి। యనునహంకృతి మమకార ♦ మఖిలవాస । నాన్వితం
బులై దొలఁగుచో ♦ నైన తెల్వి।సముచితార్థం బగును నమ ♦ శ్శబ్దము
నకు ॥మ॥ పది యర్థంబులు నాఱు శబ్దములు దీ ♦ వ్యత్ఖండయుగ్మంబు గ।
ల్గి దురంతాఘనివృత్తి మోక్షగతియుఁ ♦ గీల్కొల్పఁగాఁజాలి స । మ్మద
మొప్పం గథవల్లి యెన్నఁ దగు నీ ♦ మంత్రాబ్జరాగంబుసం । పద
శ్వేతాశ్వతభాగమాంతమునఁ జె ♦ ప్పంగాఁబడెన్ సర్వముఁ ॥ మ ॥

శివతాతిత్వము గల్గునీద్వయమను ♦ శ్రేష్ఠంబు వాక్రుచ్చి మా । సర్వేఁ
డెవ్వం డయినన్ దయాసహితు శ్రీ ♦ నారాయణున్ నన్ను గా । వను
మొప్పన్ శరణంబుఁ బొంది నతనిన్ ♦ రక్షింతు నంచుర్ రమా । ధవుఁడ
బ్జాసనుతో వచించె నని పా ♦ ద్మం బందుఁ దెల్పంబడెన్ ॥ మ॥ తొలుతన్
బ్రహ్మకు లక్ష్మి యీమనువు సం ♦ తోషంబుతో నిచ్చెఁ దా । జలజాతా
సనుచే వసిష్ఠుఁ డుపదే ♦ శంబై మునిశ్రేణికిం । దెలిపెం బెద్దయుఁగాల
మేగుట ధరి ♦ త్రిన్ లీన మైనట్టిత । ద్వాలసన్మంత్రము మీకు నేఁ దెలిపి
తిన్ ♦ వేదంబులో నుండుటన్॥ సీ॥ జగదీశులకు నధీ ♦ శ్వరుకాంత
నిత్యాన, పాయినియగు రమా ♦ పద్మగంధి । నాశ్రయించుట స్వాశ్ర♦
యణయోగ్యసకలస, ద్గుణవంతుఁ డగునచ్యు ♦ తునిపదాంబు । జప్ర
పన్నత సుఖ ♦ సాధనంబై నాకు, సంభవించెను రమా ♦ సహితుఁ డ
నఘుఁ । డాత్మేశ్వరుం డైన ♦ హరి కహంమమకార, హీనుండనై
న నే ♦ నిఁక నశేష॥ తే. గీ॥ దాస్య మప్రతిహతము ని ♦ త్య మ్మె
నర్తు । ననెడుప్రార్థన మదిఁ గల్గె ♦ ననెడియెఱుక । సుమ్ము ద్వయమంత్రిము
నకు న ♦ ర్థమ్ము దీనిఁ । దెలిసి వర్తించునాతండు ♦ దేవనిభుఁడు॥ తే. గీ॥
తన్ను నియమించి ప్రపదనా ♦ ధ్వమునఁ ద్రిప్ప । కర్త హరి గాని య
న్యుండు ♦ గాఁడు గానఁ । జక్రిపైఁ గల్గురుచిచేత ♦ సల్పుదాస్య । మతుల
మగునట్లు సేయు ద్వ ♦ యాఖ్యమనువు॥ క॥ తొలుతన్ లక్ష్మికటాక్ష ।
మ్ములకుం బాత్రుఁడయి పిదపఁ ♦ బురుషోత్తమునిం । గొలిచినచో లగ్గగు
నని, తెలుపుచు నుండును జుమీ శ్రు ♦ తిస్మృతు లెల్లన్॥ క॥ హరి ల
క్ష్మిమాట దాఁటఁడు । హరి నెప్పుడు లక్ష్మి విడువ ♦ దది గాన రమా । త
రుణిదయ గల్గుమనుజుఁడు । పరమపురుషువిపులకృపకుఁ ♦ బాత్రుఁ డగుఁ
జుమీ॥ సీ॥ స్వల్పదోషంబులు ♦ స్వజనంబు చేసిన, సహియించి యుంట
వా ♦ త్సల్యగుణము । సకలాత్మలకు స్వద♦ర్శన మొసంగుటకు న, చ్చా
రూపుఁ డగుట సౌ ♦ లభ్యగుణము । తన కొకకార్య మై ♦ నను లేక నరు
లకు, మేల్ సేయుచుంట స్వా ♦ మిత్వగుణము । అల్పాత్ముఁ డగుజీవు ♦

నధికునిఁ గొలిచి, చెలి యంచుఁ గొనుట సౌ ♦ శీల్యగుణము॥ తే.గీ॥సకలవి
షయాపరోక్షత ♦ జ్ఞాన మఘట। నఘటనసమర్థత గనుంగొ♦నంగ శక్తి।
సకలకామాప్తి యగుఁ బూర్తి ♦ సకలశేషి। యగుట ప్రాప్తి గుణాష్ట
కం ♦ బయ్యె నిట్లు॥ క॥ ఈయష్టగుణంబులు నా। రాయణునకును సహ
జములు ♦ ప్రాణులకు రమా। నాయకుఁడు తండ్రి యగుఁ బద్మాయతన
జనని తదన్య ♦ లగుట మృష సుమీ॥ తే. గీ॥ ఆశ్రితజనోపయుక్తం
బు ♦ లగుపదాళు। సద్గుణము లాజనార్దను ♦ సతికి సహజసిద్ధము లటం
చుఁ జెప్పెను ♦ శ్రీపదంబు। పాదుకొని యున్నవ్యుత్పత్తి ♦ భేదములను॥
క॥ సురగరుడోరగమానవ। శరణ్యుఁ డగువిష్ణునందు♦జనుఁడభిరుచిచే।
వరియించినట్టిగీతా। చరమశ్లోకమున కర్థ ♦ సమితి వినఁ దగున్॥ ఉ॥
పాండవకౌరవావళికి ♦ భండన మయ్యెడివేళ సత్కృపా। మండితుఁడుం
జమూయుగళ ♦ మధ్యగతుండు రథస్థుఁ డైనయా। ఖండలసూతిఁ గాం
చి హరి ♦ కర్మము జ్ఞానము భక్తియోగముం। బండితు లెన్నఁగాఁ దెలి
పి♦పల్కెఁ బ్రపత్తిఁ దుదిఁ ముదంబునన్॥ సీ॥ సౌవర్ణకుండలో♦జ్వలర
త్నదీధితుల్, గండభాగంబుల ♦ గంతు లిడఁగ। నాలోలధవళవి ♦ శాల
నేత్రము లని, లాహతపంకేరు ♦ హములఁ గేర। నరుణబింబాంచితా ♦
ధరపల్లవమునందు, దంతకాంతులు సంత ♦ తంబుఁ బర్వఁ। గించిదాన
మ్రవి ♦ క్షిప్తసుభ్రూలతల్, మదనచాపములసం♦పద వహింప॥ తే. గీ॥
మకుటకాంతులు మెఱుపుల ♦ మాడ్కిఁ దనరఁ। బార్థునకు రథమం దుం
డి ♦ బ్రహ్మవిద్య। గఱపుకృష్ణునివవ్వొమొ ♦ గంబుకంటఁ। గట్టినట్లున్న ది
వ్యదేమొ ♦ కాని మాకు॥ ఉ॥ హారకిరీటకుండలము♦ఖాభరణప్రభ దిక్కు
లందుఁ జె। న్నారవిసీలనీరదస ♦ మంచితగాత్రము నేత్రపర్వమై।
మీఱఁగ రత్నకంకణస ♦ మిద్ధకరంబుఁ గదల్చుచుం సునా। సీరకుమా
రుతోఁ బలుకు ♦ శ్రీహరిపాదము లాశ్రయించెదన్॥ మ॥ హరిదంతో
జ్జ్వలదంతితుండనిభదీ ♦ వ్యద్వామహస్తంబుచే। నరుహస్తంబు గ్రహించి
సంయమివరుల్ ♦ నానామరవ్రాతముల్। కురుసైన్యంబు యుధిష్ఠిరధ్వ

జని సం ♦ కోచించుచుం జూడఁగాఁ । బరమార్థంబు వచించుయాఁడ,
పర ♦ బ్రహ్మంబు నే వేఁడెదన్॥ మ ॥ నయన ద్వంద్వము సంచలింపఁ
బొమల్ ♦ న ర్తింపఁ గెంగేలు ని । ర్ణయముం జూప మొగంబునన్
నగవు గ ♦ న్పట్టంగఁ జిత్తంబునన్। దయ రెట్టింపఁగ సవ్యసాచికి సము
ద్యద్వేదవే దాంతని । శ్చయవాక్యంబులు దెల్పునయ్యదుకుల ♦ స్వామి
బ్రశంసించెదన్॥ ఉ॥ వల్లవపం క్తి కెల్ల నప ♦ వర్గ మొసంగినవాఁడ
బ్రాహ్మణీ । పల్లవపాణులం దయకుఁ ♦ బాత్రులఁ జేసినవాఁడు భ క్తి రా
జిల్లుకిరీటికిం జదువుఁ ♦ జెప్పినఁవాఁడు యుధిష్ఠిరుక్ మహీ । వల్లభుఁ జేయ
వాఁ డిపుడె ♦ వచ్చి ననుం గరుణించుఁ గావుతన్॥ క ॥ ఈరీతి భ క్తిప్ర
వశుఁ। డై రామానుజుఁడు సార ♦ సాక్షునకు నమ । స్కారములు సేసి
క్రమ్మఱ। వారలతో నిట్టు లనె న ♦ వారితఫణితిన్॥ ఆ. గీ॥ సర్వధర్మము
లను ♦ సాకల్యముగ మాని । యొక్క నన్నె శరణ ♦ మొంద వయ్య ।
నిన్ను నేను బాప♦నివహంబువలన వి । ము క్తుఁ జేతు శోక ♦ మును విడు
వుము॥ తే. గీ॥ అనుచు శ్రీకృష్ణమూ ర్తి య ♦ ర్జునునితోడ । నానతి
చ్చెను గావున ♦ దీనియందుఁ। గలపదమ్ముల కర్థంబు ♦ తొలుత మీకుఁ
దెలిపెద నటంచు నిట్లని ♦ పలికె గురుఁడు॥ మ॥ నన్నుఁ జెందక్ మదిఁ
గోరి తేని విజయా♦నాచేత నీకింత సే। వును మోక్షోచితసాధనంబు లను
చుక్ ♦ బోధింపఁగాఁ బడ్డత । ద్ఘనయోగత్రితయంబు వాసనలతోఁ ♦
ద్యాగంబు గావించి కీ । డన కీమధ్యమనిష్ఠలో నిలిచి పు ♦ ణ్యాఘుంబులన్
మానుమీ॥ తే.గీ॥ వాసనారుచియుతకర్మ ♦ వర్జనంబు । గలిగినను నిత్య
నై మి త్తి ♦ కములు సాధ । నాశయము ఫలబుద్ధి శూ ♦ న్యముగఁ బ్రత్య
వాయభీతిని దగ నట్ల♦ చేయ వలయు॥ ఆ.గీ॥ అనిన యజ్ఞశర్మ ♦ హరిము
ఖోల్లాసార్థ। మధ్వరములు సేయు ♦ నతనినిష్ఠ । చెడ దటంచుఁ దోఁచుఁ♦
జెప్పవే యని వేఁడ । నతనితోడ నిట్టు ♦ లనియె గురుఁడు॥ ఉ॥ మానిసి
బాతకం బగుట ♦ మధ్యమనిష్ఠకు భంగ మంచుఁ దాఁ। బూనఁగ వచ్చు
నిత్యములు ♦ బుద్ధిసమన్వితుఁ డంతె కాని హిం ♦ సానిబిడంబులై

డము ♦ జన్నము లెట్లొనరింప వచ్చు శ్రీ । జాని జగచ్ఛరీరి గద ♦
తస మెట్లగుఁ దాదృశక్రియన్॥ చ ॥ధుమధుమలాడునే మునుపు ♦
యజనాభిముఖంబు దానినిం। దమరు వికాసిఁ జేసెదరె ♦ తత్తను
తము లైనప్రాణులన్ । సమయఁగఁ జేసి జన్నములు ♦ సల్పఁ బ్రస
త యెట్లు కల్గుఁ గ । య్యమునకుఁ జంకదుద్ధుశర ♦ ణార్థి యునర్ మఱి
కల్గునే॥ చ॥ మనుజుఁ డుపస్థసౌఖ్యము స ♦ మగ్రముగా మదిఁ గోరి
ణులం। దునుమఁగ ముక్తి గల్గునెడ ♦ నోటికి సౌఖ్యముఁ గోరి మేఁ
లన్ । హననము సేయువానికి ము ♦ రారిపురిన్ స్థితి యేల చెప్పఁగాఁ।
నదు వృథాప్రలాపములు ♦ చాలును మానుము హింస యెయ్యెడన్॥
మ॥ అమరావాససుఖంబు గోరుమనుజుల్ ♦ యజ్ఞార్థమై ప్రాణులన్ । సమ
యింపన్ నిరయంబు లేదనుచు శా ♦ స్త్రంబుల్ వచింపంగ మో। కు
ము హింసాక్రియచేతఁ జెప్పఁ దగునే ♦ సన్న్యాసికే కాదు యో । గము
వాంఛించినవాని కైనఁ దగ వీ ♦ కర్మంబు లూహించుచోన్ ॥ క॥ వే
దాంతవిదునకున్ యో । గాదరణము గలుగు తండు ♦ లాదుల మఖ
ము । త్పాదింప వచ్చు నదియును । గాదు సుమీ మనప్రపన్న ♦ గ
ణమున కెందున్॥ మ ॥ హరినిర్హేతుకజాయమానకరుణా ♦ వ్యాపార
జన్యప్రప। త్తి రహింగ కర్మముచేత సాధ్య మగునే ♦ దీనత్వముం గల్గి
ని। ర్భరుఁడై దాస్యముసఖ్యమున్ స్మరణముం♦బాదార్చనం బాది శ్రీ ।
ధరుకైంకర్యము మాని జన్నములచే♦తన్ గుందఁగా వచ్చునే॥ తే. గీ॥
న్యాస మనఁ గామ్యకర్మస♦న్న్యాస మగుటఁ । గామ్యములు చేసి న్యాసి
యే ♦ కరణి నగును । హరిముఖోల్లాసమున కన ♦ నదియె సుమ్ము । సాధ
నాంతరమనఁబడు ♦జగతిలోన॥ క ॥ భగవంతునకున్ సంతస।మగుకార్య
మె సుకృతకర్మ ♦ మట్టిసుకృతముం । దగఁ జేయువాఁడు నిర్భరుఁ।డగునే
రింటికిని భ్రష్టుఁ ♦ డగుఁ గాని భువిన్ ॥ క ॥ తనకు స్వరూపోచిత మా।
జనార్దనునిసేవ దాని ♦ సలుప వలయుఁ గా।క నరుఁడు హింసాకర్మము ।
లొనరించుచుఁ బొద్దుఁ బుచ్చు ♦ టుచితమె చెపుమా॥ సీ ॥ అలుకంగ

రాదె శ్రీ ♦ హరిమందిరంబులు, నలినాక్షుకథలు వి ♦ నంగ రాదె । చ
క్రిపూఁదోఁటకు ♦ జలము తోఁడఁగ రాదె, శౌరినామంబులు ♦ నదువ
రాదె। తుడువంగ రాదె మ ♦ ధుధ్వంసివాకిలి, ధ్యానింప రాదె శ్రీ ♦
ధవుని మూర్తి। సమకూర్ప రాదె యీ ♦ శ్వరునకు శాకముల్, తే రాదె
తులసి దై ♦ త్యారికొఱకుఁ॥ తే.గీ॥ గంసవైరికిఁ బూదండఁ ♦ గట్ట రాదె।
వెన్నునిఁ బ్రదక్షిణములు గా ♦ వింప రాదె। కర్మయోగియుఁ జేయని ♦
ధర్మరహిత। కర్మములు సల్ప నేల శ్రీ ♦ కాంతభటుఁడు॥ క॥ శ్రీలలను
దాస్యమున కే। కాలము చాలదు మతెట్లు ♦ కావించును గా। మ్యాశ్రి
హరికిఁ గైంకర్యముఁ। బోలె ముదము సలుప లేవు ♦ భువి జన్మంబుల్॥
ఉ॥ వెన్నుని సర్వశబ్దములు ♦ వేడ్క వచించె నటంచు జ్ఞానసం। పన్నత
భక్తియుం గలిగి ♦ ప్రాణులఁ జంపక తండులాదులన్। జన్నము లాచరిం
చుచు మ ♦ నంబునఁ గర్తృత మాని మానవుల్। చెన్నగఁ గర్మయో
గులయి ♦ చెందెద రచ్యుతుఁ బెక్కునాళ్ళకున్॥ వ॥ ఇది ప్రథమపాద
వాక్యార్థంబు ద్వితీయపాదవాక్యార్థంబు వినుం డని యిట్లనియె॥ సీ॥
రూఢి స్వరూపవి ♦ రుద్ధముల్ దుష్కరం, బులు విలంబము లంచు ♦ మూఁ
డు సాధ। నమ్ముల రుచివాస ♦ నాయుతమ్ముగ మాని, మత్పరప్రాప్తికి ♦
మామకోజ్జ్వలానుగ్రహమె ముఖ్య ♦ మైనసాధన మంచు, సామర్థ్యఘ
నదయా ♦ శక్తియుతుఁడ। నాశ్రితాశ్రయణోచి ♦ తాష్టగుణాఢ్యుండ।
నైనట్టినాదుపా ♦ దాంబుజముల॥ తే.గీ॥ ఫల్గునా నీవు విశ్వాస ♦ భాసమా
న। హృదయపంకరుహుండవై ♦ ముదముతోడ। శరణ మొందు మ
టంచును ♦ జలజనేత్రుఁ। డనుటసుమ్ము ద్వితీయపా ♦ దార్థ మయ్యె॥ చ॥ శ్రిత
జనరక్షణక్షమవి ♦ శేషగుణాఢ్యుఁడ నైననేను నిర్। గృతశరణున్ వి
మూఢుని ని ♦ కృష్టు నశక్తుని సర్వపాతక। ప్రతతులచే నదల్చెదను ♦
బాండుకుమార స్వరూపయోగ్యమై। హిత మగుసాధనంబు లభి ♦ యిం
చెను శోకము మానుమీ యనెన్॥ సీ॥ బడి నవిద్యాకర్మ ♦ వాసనా
రుచిశరీ, రములు సంసారచ ♦ క్ర మనఁబడును। గలిగె దానికి నహం ♦

కారంబు మమకార,మును వానిఁ గూడి క ♦ ర్తనని మనుజుఁ|డాచరించిన
కర్మ♦మాగామిసంచిత, ప్రారబ్ధ మనఁ ద్రిప్ర ♦ కార మయ్యె|నందులోఁ
బ్రారబ్ధ ♦ మభ్యుపగత మన, భ్యుపగత మన ఖండ ♦ యుగ్మ మయ్యె॥
తే. గీ॥ వరుస నాగామి బుద్ధిపూ♦ర్వక మబుద్ధి| పూర్వకం బన ద్వివిధ
మై♦పొలిచె నం ద|బుద్ధిపూర్వకములు నన♦భ్యుపగతములు|సంచితములు
నశించును ♦ శరణ మొంద॥ తే.గీ॥ అనుభవంబున నశియించు ♦ నభ్యు
పగత | మది శరీరంబుతోడిది ♦ యండ్రు బుధులు | బుద్ధిపూర్వకృతా
గామి ♦ పుత్త్రపశుధ | నక్షయంబులఁ గావించి ♦ నాశ మొందు॥ తే.గీ॥
బుద్ధిపూర్వక మనఁ దన ♦ బుద్ధి కెఱుక | మైనప్రామాదికాఘం బ ♦
టండ్రు బుధులు | కోరి కావించునే నన్నుఁ ♦ గూర్చి శరణ | మొందిన
జనుం డఘము మిన్న ♦ క్రిందఁబడిన॥ తే.గీ॥ అమితకళ్యాణగుణపూర్ణ♦
నగుణుఁ డనుట | యన్యథాజ్ఞాన మగును బ్ర ♦ హ్మము లీశు | లనుట
విపరీతబోధ ము ♦ రారి జీవుఁ|డనుట యజ్ఞత యిది యవి ♦ ద్యావి
ధంబు॥ క॥ భువి సుకృతము దురిత మనన్ | ద్వివిధం బగు కర్మసమితి♦
విను జ్ఞానాజ్ఞా | నవి శేషములఁ జతుర్విధ| మవుట దెలుపఁబడును శాస్త్ర♦
మం దుచితగతిన్ ॥ తే.గీ॥ కడఁగి యజ్ఞానవాసనా ♦ కర్మవాస | నాప్ర
కృతివాసన లనంగఁ ♦ ద్రిప్రకార | మైనవాసన పొడము న ♦ భ్యాస
మునను | దాని సంస్కార మందు రు ♦ దాత్తమతులు॥ క ॥ తనకుం
గర్తవ్యము లగు | పనులపయిం బొడమునట్టి ♦ ప్రబలత రేచ్ఛన్ | విను
ము రుచి యందు రారుచి | యనేకవిధముల వెలుంగు ♦ నాశయమం
దున్॥ క॥ తనువుల్ సూక్ష్మస్థూలము | లన రెండు తెఱంగు లయ్యె ♦
నందుం దిర్య | ఙ్మనుజామరతరుభేదము | లను స్థూలము నాల్గువిధము♦
లం దనరారున్॥ ఉ॥ పండితుఁ డైనమానవుఁ డు ♦ పాయవశంబున
నైన శార్ఙ్గికో | దండుప్రపత్తిచే నయినఁ ♦ దద్విరజానదినీరమందు
స్నా | తుండయి వాసనాదికము ♦ తోడను వేఱయి విష్ణులోకమం |
దుండును నిత్య మాతనిస ♦ మున్నతిఁ జెప్పఁ దరంబె యేరికిన్॥ తే.గీ॥

తాను శరణాగతుం డైన♦తఱికిఁ గలుగు । సుకృతదుష్కృతకర్మరా♦
సులకు సంచి । తాహ్వాయము గల్గె నాగామి ♦ యనఁ దదుత్త । రం
బొనర్చినద్వివిధక ♦ ర్మములు సుమ్ము॥ తే.గీ॥ అనుభవార్థంబు సంచిత♦
మున విభక్త । మైనకర్మంబు ప్రారబ్ధ ♦ మయ్యె నం ద । నభ్యుపగతము
దేహాంత ♦ రానుభావ్య । మభ్యుపగతంబు ప్రకృతభో ♦ గాస్పదంబు॥
తే.గీ॥ క్షితి ననభ్యుపగతము సం ♦ చిత మబుద్ధి । పూర్వకాగామి
నిర్భరుఁ ♦ బొంద వెపుడు । యోగికిని సంచితమె నాశ ♦ మొందుఁ
గాని । చెడదు ప్రారబ్ధ మాగామిఁ ♦ బొడము ఫలము॥ తే.గీ॥ శేషి హరి
యని తెలియక ♦ చేయఁ బూను । టాత్మ గానట్టియొడలు జీ ♦ వాత్మ
యనుట । తనది గానట్టిదేహంబు ♦ తనది యనుట । కర్తృత యహం
కృతియు మమ ♦ కార మయ్యె॥ సీ॥ చిదచిదీశాంచద్వి ♦ శేషపరో
క్షజ, న్యశ్రద్ధ యగును శా ♦ స్త్రార్థబుద్ధి । కర్తృత్వరహితుఁడై ♦ కావిఁ
చుయజ్ఞదా, నాదులు కర్మయో ♦ గాఖ్యఁ బరఁగు । జితచిత్తుఁడై
శుద్ధ జీవు భావించుట, బుద్ధియోగం బనఁ ♦ బొలుపుమిగులుఁ । బ్రత్య
క్షదర్శనో ♦ పమకృతాత్మేశ్వర, ధ్యానంబు భక్తియో ♦ గాహ్వాయంబు।
తే.గీ॥ అలయమాదులై విషయంబు ♦ తొలఁట సాత్త్వి । కం బయినచిత్త
వృత్తిని ♦ గంసవైరి । దివ్యమంగళతను వందుఁ దెలిసి ♦ కూర్చు
ప్రౌఢిమయె యోగ మని చెప్పఁ ♦ బడు ధరిత్రి॥ మ॥ చిరసాధ్యంబు
లుపాయభూతములు దు ♦ ర్జ్ఞేయంబులున్ విఘ్నబం । ధురముల్
పౌరుషమూలలబ్ధఫలముల్ ♦ దుఃఖాధికంబుల్ పర । స్పరసాపేక్షము
లున్ విలంబబహుసో ♦ పానాన్వితంబుల్ సుదు । ష్కరముల్ యోగ
ము లంచు మానఁగ వలెన్ ♦ సన్న్యాసవంతుం డిలన్॥ మ॥ నిరపాయం
బు విలంబవర్జితము మా ♦ నిస్తుత్యసర్వాంగమున్ । హరివాల్లభ్యసము
ద్భవంబు నిజరూ ♦ పార్హంబు శాస్త్రోక్తముం । బరమస్థానఫలప్రదంబు
సులభ ♦ ప్రాయంబు సంసారసా । గరముల్ దాఁట సధూమనౌక యగు
చుం ♦ గన్పట్టు న్యాసం బిలన్॥ తే.గీ॥ నిమిషమునఁ జేయుపాపంబు

కమలగర్భ । కల్పశతము భోగించినఁ ♦ గాని చెడ ద । నాదికాలకృతా
మి తాం ♦ హస్స మాజ । మొక్కపరి చక్రిఁ దలఁచిన ♦ నుక్కు
చక్కు॥ తే.గీ॥ దురితంబును సుకృతంబును । బరమపదముఁ జేరఁ దుల్య♦
బంధకములు బం । గరుసంకిలి యగు సుకృతము । దురిత మినుపసంకి
లనుచుఁ ♦ దోఁచె న్మదికిఁ॥ క॥ హరి సకలభూతహృదయాం । తరముల
వసియించి సూత్ర ♦ ధారునిరీతిఁ । నరులఁ దనమాయచే ను । ర్వరఁ
ద్రిప్పుట సకల మతని ♦ వశమై యుండుఁ॥ క॥ హరికిఁ బ్రియ మైనక
ర్మంబె♦ యగును బుణ్య। మతని కప్రియ మగుకర్మ ♦ మయ్యెఁ బాప।
మట్టిపాపంబు నవవిధం ♦ బనుచు ధర్మ । శాస్త్రమునఁ దెల్పఁబడియె
ల ♦ క్షణయుతముగ॥ మ॥ పరమవ్యోమముఁ జేరువానియఘముల్ ♦
ప్రత్యర్థులం బొందు ని। ర్భరపుణ్యంబులు వానిమిత్రతతికిన్ ♦ బ్రాపించు
నట్లాటచే। హరిభక్తుం గనునప్పుడుఁ వినునెడన్ ♦ హాస్యంబు క్రోధం
బు ధి । క్కరణం బెప్పుడుఁ జేయఁ గూడదు నమ ♦ స్కారంబు సల్ప
న్వలెన్॥ సీ॥ మామకసర్వక ♦ ర్మమ్ములు నీయధీ, నము లౌటఁ గర్మ
యో ♦ గమును బుద్ధి । యోగంబు మఱి భక్తి ♦ యోగంబు సేయం
గ, మాఁనంగ నాకు సా ♦ మర్థ్య మేది । లేదు విశ్వాసంబు ♦ లే దార్తి
యును బుణ్య, వితతు లేవిధమున ♦ విడుతు నెట్లు । నేను బ్రపన్నుండ♦
నై నెగడెద నాకు, గతి లే దటంచు శో♦ కంబుఁ బడకు॥ తే.గీ॥ ఫల్గు
నా నన్నుఁ దలఁచినఁ ♦ బాప మున్నె । నీకు మోక్షంబు లభియింప♦
నేనుబూఁట । యనుచుఁ గరుణాపయోనిధి ♦ యైన చక్రి। పలికె నని
మాశుచాఖ్యశ♦బ్దంబు దెలిపె॥వ॥ ఇదిచరమమంత్రార్థంబు॥ తే.గీ॥మూఁడు
మంత్రంబులునువాని♦ముఖ్యభావ।ములునుసంక్షేపముగమీకు♦దెలిపితిని
సు । ధార్ఘురీమాధురీధురం ♦ ధరవచఃప్ర। పంచ మంచితవృత్తి రా♦ణిం
చిమించు॥ మ॥ ఇదిభక్తిన్ జదివించినన్ వినిన వ్రా ♦ యించినన్ వ్రా
సినన్। సదయుండై పెరవారికిం దెలిపినన్ ♦ సర్వామరస్తుత్యసం । పదలం
బెం పగువాసుదేవునిపురిన్ ♦ మర్త్యుండు నిత్యంబు స । మ్మద మొప్పార

వసించు నైజసుఖసా ♦ మర్థ్యాతిరేకంబుతోన్॥ క॥ విన రయ్య జనార్దను పూ। జన మొనరించెడిక్రమంబు ♦ సకలము మీకున్। వినిపింతు నిదిమె భవబం। ధనవిమోచకము మర్త్య ♦ తతికి నిజముగాన్॥ మ॥ దినకృద్బింబము పావకార్చులు మణుల్ ♦ తేజస్స్వరూపంబు ల।య్యును దేజోగుణకంబులైనగతి నం♦హోమర్దనుండున్ గుణం।బును రూపంబును జ్ఞానమై తగఁ బరా ♦ మూర్తాపరామూర్తసం। జ్ఞను భూతిద్వయపూర్ణుఁడై వెలుపలన్ ♦ సాంద్రప్రభన్ భాసిలున్॥ శా॥ జ్ఞానానందగుణస్వరూపములతో ♦ సర్వాత్మకంబైనల। క్ష్మీనాథాకృతి చూచికొల్వఁ బటుయో♦గిశ్రేణికిన్ సాధ్యమై। కాన న్వచ్ఛుఁ దదన్యమర్త్యులకశ ♦ క్యం బౌట యోగీతరుల్। దానిం బూని భజించుయత్నము మదిం ♦ దాల్పంగ రాదెన్నఁడున్॥ తే. గీ॥ జ్ఞానగుణసంయుతుండు వి ♦ జ్ఞానరూపుఁ।డైనమాధవునకు మూర్త ♦ మగుశరీర। యుగము గల దందులో విశ్వ ♦ మొకటి దివ్య। మంగళాకార మొకటి య ♦ నంగఁ దగును॥ క॥ ఆవిశ్వరూపమందున।జీవాఖ్యశరీర మన న ♦ చిద్దేహ మనన్। దేవునకు రెండు దేహము। లీవిధమునఁ గలవు పూజ ♦ కివి దగవు సుమీ॥ క॥ తనకున్ బంధకమును జడ। మును ద్రిగుణాత్మకము శేష ♦ మును హేయమునై। కనుపట్టు ప్రకృతి గొలువన్। జనునే యెటువంటిమూఢ ♦ జనునకునైనన్॥ తే. గీ॥ చక్రధరుపరతంత్రులు ♦ సకలజీవు। లగుటఁ గేవలనిత్యము ♦ క్తాత్ములను భ। జింపఁగూడదు వారలు♦సేయుకార్య। మించు కంతైనఁదనకులే♦దిది నిజంబు॥ మ॥ మనుజుండజ్ఞతచేత విష్ణుభటునా♦త్మస్వామియంచున్భజిం। చినచోఁదద్భజనంబుగైకొనకల ♦ క్ష్మీనాయకద్రవ్య మా।చును భాసిల్లెడి పూజనాదికము లి♦చ్చో నన్నుఁజెందింతు వే।యనిక్రోధంబున శిక్ష సేయఁగమనం♦బం దూహఁగావించెడిన్॥ క॥ కేవలులనిత్యముక్తుల। దేవతలం గొలువ రామిఁ ♦ దెలిపినచో దుః। ఖావళుల తోడఁ గుందెడి। జీవులఁ బూజింపఁ దగమి ♦ చెప్ప వలయునే॥ క॥ హేయమగుప్రకృతి కెపుడు వి। ధేయుండై తిరుగుచున్న ♦ దేహిని గొలుపం।

గా యోగ్య మెట్టు లగును వృ।థాయాసము మొదల నరక ♦ మగు నప్పి
దపన్॥ మ॥ ధనహీనుం డగుమానవుండు ద్రవిణా ♦ ర్థం బెన్నఁ డైనం
దరి। ద్రుని సేవించునె పద్మగంధి తగఁ బు ♦ త్త్రుం గోరి భామన్ వరిం।
చునె తాపత్త్రయ దుఃఖదావదహన ♦ స్ఫూర్తుల్ దొలంగింపు మం। చును
గామాదినిపీడితుం డగుమను ♦ ష్యున్ వేఁడఁగాఁ గూడునే॥ మ॥ ధవ
ళాంభోరుహలోచనుండు సకలాం ♦ తర్యామియై యుండుఁ గా। క విధా
త్రాదుల నిత్యకర్మములఁ ద ♦ క్కం గొల్వ రా దంచు వే। దవిధుల్
సెప్పును దీని కేమి విబుధాం ♦ తర్యామి యైయున్నమా। ధవు నైనన్
భజియింప మర్త్యునకు స్వా ♦ ర్థప్రాప్తి లే దింతయున్॥ తే. గీ॥ ప్రకృతి
హేయంబు తద్గత ♦ ప్రాణిహేయ। మగుటఁ దద్దేహి యని చక్రి ♦ సర్వ
నంబు। సలుపునెడఁ బ్రాకృతాత్మపూ ♦ జనము దాని। తోడ
సమకూఁకుటను నది ♦ గూడ దెపుడు॥ శా॥ ఆరూఢుం డగుయోగి
వల్లభుఁడు స ♦ ర్వాంతస్థితుండైనదై। త్యారిం బ్రాణులయందుఁ
బ్రాకృతపదా ♦ ర్థానీకమందున్ నమ। స్కారారాధన పూజనాదికము
వే ♦ డ్కం జేయఁగా వచ్చు దు। ర్వారం బాతనిచర్య విష్ణుఁ డెదుట
న్ ♦ వర్తించెడిన్ వానికిన్॥ తే. గీ॥ విష్ణునకు దివ్యమంగళ ♦ విగ్రహాఖ్య।
మూర్తరూపంబు గల దని ♦ మున్ను చెప్పి। నాఁడ నది పంచవిధమై జ ♦
నమ్ము లెన్నఁ।దనరుఁ దద్భేదములు చెప్పె ♦ దను వినుండు॥ క॥ పరమున్
వ్యూహము విభవాం। తరాత్మ లర్చయు ననంగ ♦ దైత్యారి కసం। ఖ్య
రుచిరదేహము లొప్పును। బరికించి వచింప వశమె ♦ ఫణిపతి కైనన్॥
మ॥ అవి పంచోపనిషన్మయంబు లఖిలా ♦ త్మానందవర్ధిష్ణువుల్। రవికో
టిప్రతిమాన తేజములు స ♦ ర్వస్తుత్యసౌందర్యముల్। జవసత్త్వాన్విత
ముల్ పురాతననిజే ♦ చ్ఛాసిద్ధముల్ చక్రిపం। చవిధోదంచితదివ్యవిగ్ర
హము లెం ♦ చంగొల్వఁగాఁ దుల్యముల్॥ ఉ॥ కొన్ని సువర్ణ వర్ణములు ♦
కొన్ని మయూరశిఖాభిరామముల్। కొన్ని సుధాంశుదీధితులు ♦ కొన్ని
వినీల పయోధరాకృతుల్। కొన్ని సితాసితాభములు ♦ కొన్ని సరోరు

హారాగశోణముల్ । వెన్నునిమేను లెన్నఁబడి ♦ వేలవిధంబుల కెక్కునా తగున్॥ సీ॥ దంష్ట్రాకరాళవ ♦ క్త్రసహస్రములు కొన్ని, కమనీయముఖ మండ ♦ లములు కొన్ని।హవ్యభుగ్విభీష ♦ ణాక్షిపంక్తులు, కొన్ని క మలసంకాశనే ♦ త్రములు కొన్ని । భయదనిఘూర్ణితశుం ♦ భద్ఘ్రాణము లు కొన్ని, సుమధురాలాపవం ♦ తములు కొన్ని।ప్రళయవేళానట ♦ ద్భర్గాకృతులు కొన్ని, సుమశరాసనసుంద ♦ రములు కొన్ని॥ తే. గీ॥ బహుళపదఘట్టనంబులు ♦ బాహుకోటి । సంభృతాయుధదుర్నిరీ ♦ క్ష ములు కొన్ని । పల్లవోపమపదయుగా ♦ భయకరద్వ । యములు కొన్ని మురారిదే ♦ హములలోన॥ మ॥ నరబృందారక తిర్యగాకృతులు నా ♦ నాప్రాణియూపద్వయ । స్ఫురితంబుల్ బహుళాంగకంబు లమలం ♦ బుల్ సూక్ష్మముల్ దీర్ఘముల్ । పరుషంబుల్ బహుశాంతముల్ ప్రబలముల్ ♦ భక్తౌఘసేవ్యంబులై । హరికిం బంచవిధాంగముల్ గలవు శ ♦ క్యం బౌనె వర్ణింపఁగన్॥ వ॥ అందుఁ బరరూపం బెట్టి దనిన॥ మ॥ హరినీలాభము చంద్రమండలనిభా ♦ స్యం బిందిరాయుక్తబం । ధురవక్షుంబు సరోజలోచ నము సం ♦ స్తుత్యాయుధోపేత మా । భరణోద్యన్మణి థాగధగ్యము చతు ♦ ర్బాహార్గళాన్వితమై । పరరూపం బలరారుచుండును గృపా ♦ పాథోధికిన్ శౌరికిన్॥క॥ ఆరూపము భజియింతురు । సారెకు నిత్యులున ముక్త ♦ జనములు మఱియె । వ్వారును భజింపఁ జాలరు । శౌరి కదియె సు మ్మనాది ♦ శారీర మగుఁ॥ క॥ విరజానది కవ్వలఁ దగు । పరమస్థా నంబునందుఁ ♦ బరరూపముతో । హరి దనరుఁ వ్యూహము లా। వరణఁ బులలోపలను ని ♦ వాసముసేయున్ ॥తే.గీ॥ పరమపదమందు నిందిరా వరునిదివ్య । మంగళాంగసహస్రముల్ ♦ మఱి వెలుంగు । వ్యూహకో టులు తాదృశ ♦ దేహయుతము । లవి భజింతురు సనకాదు ♦ లఁచట జనులు॥ సీ॥ బ్రహ్మాండబాహ్యావ ♦ రణలోకములఁ గేశ, వప్రముఖ వ్యూహ ♦ వర్గ మలరు । వరుస సంకర్షణ♦వాసుదేవులును బ్రద్యుమ్నా నిరుద్ధుల ♦ త్యున్నతాబ్జ । గర్భాండవివరలో ♦ కముల నుందురు పద

నోనికిఁ దక్క ♦ నన్యులకు వారి। చరణముల్ పూజింప ♦ శక్యంబు
గా దవ, తారముల్ విభవాఖ్యఁ♦దనరుచుండు॥ తే. గీ॥ వేదములకును
సురలకు ♦ విప్రులకును। జగములకు గొప్పబాధలు ♦ సంభవించు। నపు
డు భక్తజనానుగ్రహ ♦ హార్థ మవని। వెన్నుఁడు ధరించురూపంబు ♦ విభవ
మయ్యె॥ క॥ విను ముఖ్యంబు లముఖ్యము। లన ద్వివిధము లగుచుఁ
జక్రి ♦ యవతారంబుల్।దనరారు నందు ముఖ్యము। లనయము ద్వివిధం
బులంశ♦మావేశ మగుఁ॥ తే. గీ॥ అల్పకాలంబు పద్మనా♦భాంశ మా
త్ర। యందు నిలిచినఁ దాత్కాలి ♦ కావతార। మగును జిరకాలము
వసింప ♦ నదియె సుమ్ము। ధీరమతు లందు రంశావ♦తార మనుచు॥ క॥
వినుమీ రెండు నముఖ్యము।లనంగఁ బడు నింక ముఖ్య ♦ మన రాఘ
వవా। మనఘులిబుద్ధనృపంచా। ననకిటిఝషనందనంద ♦ నముఖ మగుఁ
జుమీ॥ తే. గీ॥ ఉపనిషత్పంచకముపురు ♦ షోత్తమాన్వి। తమ్ము నంగీ
కృతమనుష్య ♦ దైవతిర్య। గంగతత్తత్సజాతీధ ♦ ర్మాన్వితంబు। ముఖ్యవి
భవం బనంగ సం♦పూజ్య మయ్యె॥ తే. గీ॥ జనులకు స్వజాతివగుటచేఁ♦
జను నృసింహ। కృష్ణరామవ్రతము లన్య♦మెద్ది వలదు। హరి నిజాంశం
బు దేహియం ♦ దావహింప। నది యముఖ్యంబు పూజక ♦ నర్హ మగు
ను॥ మ॥ పరమున్ వ్యూహము వైభవంబు ననఁగా ♦ భాసిల్లుచున్నట్టి
శ్రీ। ధరురూపంబులలో నుపాసకునిచి ♦ త్తం బెందు వర్తించు నా। కర
ణిన్ వాని మనోజ్ఞమధ్యమున వే ♦ డ్కన్ శౌరి గైకొన్నసుం। దరది
వ్యాంగమె సుమ్ము చెన్నలరు నం ♦ తర్యామినామంబులోన్॥ మ॥ అవ
తారంబులు గల్గునప్పటిమను ♦ ష్యానీకముం దక్క మా। నవులం దన్యు
ల కెట్లు సంభవ మగున్ ♦ దత్పూజనం బింక యో। గివరుల్ దక్కఁ ద
దన్య లేకరణి ల♦క్ష్మీనాయకుం జిత్తప। ద్మవిశిష్టున్ భజియింతు రిన్నియు
నేసా ♦ ధ్యంబుల్ ప్రపన్నాళికిన్॥వ॥ పరామూర్త్యాపరామూర్త్యసంజ్ఞితం
బైనభగవంతునిజ్ఞానస్వరూపంబును బరవ్యూహవిభవాంతర్యామిలక్షణ
లక్షితమూర్తిచతుష్టయంబును బూజించుట సకలజనసులభంబుగా దని

యును విశ్వరూపంబ సేవ్యం బనియును దెలిపితి నింక నర్చావతారప్రి
కారం బెఱింగించెద వినుం డని యిట్లనియె ॥ సీ॥ పరమేష్ఠిముఖమ
హా ♦ పనిషన్మయాంగంబు, పాంచరాత్రాగమో ♦ దంచితంబు । పరవి
భవాదిదీ ♦ వ్యచ్ఛక్తిసహితంబు, భక్తవాంఛితరూప ♦ బంధురంబు ।
సకలమూఢామూఢ ♦ జనసేవనార్హంబు, క్షుద్రమాంసమయదృ♦గ్గోచ
రంబు । కరుణాదిశేషసం♦ఘటితస్వరూపంబు, నఖిలప్రపన్నులో ♦ కార్చి
తంబు॥ తే. గీ॥ సకలకళ్యాణగుణపూర్తి ♦ సంయుతంబు । భవ్యమును దే
శకాలస్వ ♦ భావవిప్ర । కర్షవర్జిత మగుచు జ ♦ గంబులందు । శ్రీరమా
నాథు నర్చావ ♦ తార మొప్పు॥ క॥ చరము నచరం బనంగను । బర్ఠ
మేశ్వరునర్చ రెండు ♦ పద్ధతు లయ్యెన్ । జరములు పెక్కువిధంబు ల ।
చరము లగుఁ జతుర్విధములు ♦ జగతీస్థలిలోన్॥ సీ॥ హరి తనంతటఁ దా
నె♦ యర్చాకృతి వహించి, యలరారు నది స్వయం♦వ్యక్త మయ్యె। బ్రి
హ్మేంద్రముఖులు సం ♦ ప్రార్థింపఁబూజార్థ, మైన రూపంబు దై ♦ వార్చ
యయ్యె । సనకనారదముఖ్య ♦ సంయముల్ వేఁడినఁ, జనుదెంచు బేరంబు♦
సైద్ధ మయ్యె । మానవుల్ ప్రార్థింప ♦ మహి కేగుదెంచిన, హరివిగ్ర
హము పౌరు ♦ షార్చ యయ్యె ॥ తే.గీ ॥ నీచతుర్విధములఁ నెద్ది ♦ చూచి
నను స । మానములె కాని భేదమిం ♦ తైన లేదు । తాఁ బ్రతిష్ఠించిన
ట్టిమా ♦ ధవుని మూర్తి । పంచవిధమూర్తములలోనఁ♦ బ్రబలతరము
మ॥ పరమున్ వ్యూహము వైభవంబు మొదలై ♦ భాసిల్లుచున్నట్టిశ్రీ
హరిమూర్త్యాకృతు లెల్ల నన్నిఁటను దు ♦ ల్యస్ఫూర్తి భాసిల్లుఁగా । క ర
హిం బ్రాణుల కర్చతోడ సమముల్ ♦గా వెవ్వియయ్యర్చయం।దరయం
దాను బ్రతిష్ఠ సేయునది స ♦ ర్వాధిక్యమై భాసిలున్॥ చ॥ పరమపదస్థ
మూర్తియె కృ ♦ పామతితోడ ధరిత్రి నర్చయై । పరఁగుచునుండె భేద
గతి♦భావన సేయుట దోష మంచుఁ జె। చ్చెరఁ గపిలుండు తల్లికి వ ♦
చించెను దీని నెఱుంగువారు శ్రీ । ధరునిచతుర్విధార్చలకుఁ ♦ దౌల్య
ముఁ జెప్పక భేద మంచు రే॥.క॥ అర్చాకృతి లేకుండిన । నర్చింపఁగఁ దర

మె విష్ణు ♦ నఖిలజనులకుం। జర్చింపుఁడు సౌలభ్యం। బర్చాకృతిఁ బూని కాదె ♦ హరి గైకొనియెన్॥ఉ॥ ధర్మము గోరి గొల్చినను♦ధర్మము మోక్ష మొసంగు వేడుకన్। భర్మము గోరి గొల్చినను ♦ భర్మము మోక్ష మొసంగుఁ గామముల్।కూర్మిని గోరి కొల్చినను ♦ కూర్చును గామము మోక్ష మెద్దియే। నర్థిలిఁ గోరకుండిన జ ♦ నావళి కర్చు యొసంగు మోక్షమున్॥ తే. గీ॥ హాస్యమున కైన దంభార్థ ♦ మైన మత్స। రంబుచే నైన నొరుని ని ♦ ర్బంధపటిమ। చేత నైన ముకుందుఁ బూ ♦ జించువాని। కవును మోక్షంబు నాల్గవ♦ భవమునందు॥ తే. గీ॥ పరధనముఁ గోరి యైనను ♦ బరునివనితఁ। గోరి యైన నొరుం జంపఁ ♦ గోరి యైనఁ। గాంచనాంబరుపూజఁ గా ♦ వించువాని। కవును మోక్షంబు మూఁడవ ♦ భవమునందు॥ తే. గీ॥ ధర్మములు గోరికొని యైన ♦ ధనము గోరి। యైన సముచితభోగార్థ ♦ మైనఁ గార్య। సిద్ధికొఱ కైన విష్ణుఁ బూ ♦ జించువాని। కవును మోక్షంబు రెండవ ♦ భవము నందు॥తే. గీ॥ ఇంచుకయు నెద్ది గోరక ♦ యించువిల్తు। తండ్రిపూజ స్వరూపోచి ♦ తం బటంచుఁ।దెలిసి నిర్భరుఁడై సేయు♦ధీరమతికి। నవును దజ్జన్మమందె మో ♦ క్షాతిశయము॥ సీ॥ బహుజన్మకృతతపో ♦ వ్రత యజ్ఞదానతీ, ర్థనిషేవణాదిస ♦ త్కర్మములను। క్షీణపాతకుఁ డైన ♦ ప్రాణికి హరిభక్తి, సంభవించును నట్టి ♦ సమయమందుఁ। దమకంటె నధికుఁడై తగు నని మత్సర, మున వేల్పులును గ్రూర ♦ బుద్ధి దైత్య। తతియును హింసింపఁ ♦ దలఁచి శాత్రవులును, విషయభోగమ్ములు ♦ వీని కకట॥తే.గీ॥ దూర మయ్యె నటంచు మి ♦ త్రులును దమ్ముఁ।బాసి చను నంచుఁ బుత్రులు ♦ భార్య తండ్రి। తల్లి సహజులు నెల్ల బాం ♦ ధవులు విఘ్న।కోటి యొనరింతు రెంతయుఁ ♦ గుటిలు లగుచు॥ క॥ శర ణాగతజనరక్షా। పరుఁ డగునారాయణుండు ♦ పాలించుట భా।స్కరుఁ డుదయించినఁ దమముల్। విరియుకరణి నతనిసకల ♦ విఘ్నము లణఁగున్॥తే.గీ॥ శ్రవణకీర్తనవందన ♦ స్మరణదాస్య। సఖ్యపాదాబ్జసేవనా♦

ర్చనము లాత్మ । భరసమర్పణ మనునవ ♦ భక్తు లొప్ప । శౌరిఁ గొల్చి
ననరుఁగు మో ♦ క్షమున కరుగు ॥క॥ మోక్షం బనంగ సరసీ । జాక్షు
ని నవభక్తులొ ప్ప ♦ ననవరతంబున్ । వీక్షించుట యని బుధులు వి।వక్షు
యొనర్చెదరు పొగడ ♦ వశమే వానిన్ ॥క॥ చాలదె జనునకుఁ గాంచన।
ఛేలునినవభక్తు లుంట ♦ చింతింప మ ఱిం । కేలా పరమవ్యోమం। శా
లోకమునందు నింక ♦ నధికము గలదే॥ ఉ॥తాను సమర్థుఁ డైనతఁడె ♦
దానవవైరికి దివ్యభూషణో । ద్యానతటాకగోపురసు ♦ ధాలయమండపస
త్కృతివ్రజా। నూనగజాశ్వగోవృషమ♦నుష్యవితానమహాగ్రహారముల్।
పూని యొసంగి తచ్చరణ ♦ ముల్ తగఁ బూజ యొనర్పఁగా వలెన్ ॥సీ॥
తనశక్తికొలఁది వి ♦ త్తము గూర్చి స్వానుగు, ణ్యంబుగా శిలచేత♦నైన
నిష్ట।కలచే నయిన లోహ ♦ ముల నైన దారుత్వ,గాదుల నయిన దే♦
వాలయంబు।తగఁ గట్టి స్వాభిమ ♦ తం బైనహరిసుంద, రాంగంబు పాం
చరా ♦ త్రాగమోక్త। పద్ధతి నందులో ♦ పలఁ బ్రతిష్ఠించి ని, త్యోత్స
వంబులును బ ♦ క్షోత్సవములు ॥తే. గీ॥ మాసవర్షోత్సవాదులు ♦ మహి
తభక్తి । సలుపుచును దత్పదాంబుజా♦ర్చనమె తనకు। నిత్యకృత్యంబుగాఁ
గొని ♦ నెగడువాని। కహహ మోక్షంబు సిద్ధప ♦ దార్థ మగును ॥తే.గీ॥
ఎవ్వనికి మోక్ష మీఁజూచు ♦ నీశుఁ డతని । కిట్టి కార్యంబు సమకూరు♦
నట్టు చేయు।నే నరుని సంసృతిని ద్రిప్పఁ ♦ బూను వాని। కేల యిటు
వంటి పని ఘటి ♦ యింపఁ దలఁచు ॥ చ ॥ హరి కొకవస్తు విచ్చిన మ♦
హాత్ముఁడె ముక్తికిఁ బోవు నంచు బం । ధురగతి శాస్త్రముల్ దెలుపఁ♦
దోయజనాభునకున్ మణివ్రజా । భరణమహాగ్రహారముఖ♦భవ్యపదా
ర్థము లిచ్చువానికిన్ । బరమపదంబు కైముతిక ♦ పద్ధతి సిద్ధము గాదె
యిద్ధరన్॥ శా॥నీలాంభోధరదివ్యవిగ్రహునకున్♦నిత్యంబు మత్త్వద్వాపేం।
ద్రాళీభవ్యతరాగ్రహారమణిహా ♦ రాంచత్కిరీటాదికం।బేలా భక్తివిహీ
నుఁడైన మనుజుం♦డిచ్చున్ ముదం బొప్పఁ దా।నేలాకాలముఁ బుచ్చుఁ
దత్పదయుగం ♦ బీక్షించిపూజించుచున్॥మ॥అతికష్టార్జిత మైనకాంచనము

దై • త్యారాతి కర్పించి సం । తతముం దచ్చరణాబ్జనిర్గతమరం • దస్ఫార
ధారాసమం । చితమాధుర్యరసంబు గ్రోలుచును ల • క్ష్మీనాథ నీవే సు
మీ । గతి యంచున్ నుతియించువాని కపవ • ర్గప్రాప్తి గాకుండునే॥ సీ॥
హరినామసంకీర్త • నాఖ్యకంఠముతోడఁ, దద్దాస్యనామహ • స్తముల
తోడఁ । దత్కథాకర్ణనా • తతకర్ణములతోడఁ, జరణసేవనశుభా • స్యంబు
తోడ। సఖ్యాభిధానభా • స్వన్నేత్రములతోడ, వందనాహ్వాయహార • వల్లి
తోడఁ । బరమేశ్వరధ్యాన • గురుకుచమ్ములతోడఁ, దత్పదార్చనఫాల •
తలముతోడ॥ తే. గీ॥ భరసమర్పణమనుకచ • భరముతోడఁ । బరఁగు
హరిభక్తిదూతిక • చరమజన్మరాత్రులఁబ్రపన్నులను విట • వ్రాతము
లకు । ముక్తిభామను సమకూర్చి • మోద మొసఁగు॥ తే. గీ॥ భక్తిగల్గిన
చోటనే • ముక్తిగల్గు । భక్తి లేనట్టివానికి • ముక్తి లేదు।భక్తి కన్యం
బొకటి లేదు • ముక్తియందుఁ । గాన భక్తికిసమము మో • క్షంబుగాదు॥
ఉ॥ తామరసాప్తదీధితులు • తప్తసువర్ణమయంబు లంచితా । యామ
విశాలకర్ణములు • దంచితగోళము లైనపద్మజాం। డామితకోటు లేలుకమ •
లాక్షుఁడుకొంచెపువిత్తమైన మున్ । బ్రేమ నొసంగు మానవునిఁ • బెద్ద
యటంచు గణించునెప్పుడున్॥ తే. గీ॥ ధనము లేనట్టిభక్తుండు • దళ మొ
సంగ।నిమ్ము విమలోదక మొసంగ • నిమ్ము దానఁ।దృప్తుఁ డగుఁగాని విత్తం
బు • తెమ్మటంచుఁ । బీడఁ బెట్టుట కాశౌరి • బీద కాఁడు॥ చ॥ జలము
లు లేవె విష్ణుని కొ • సంగ జలమ్ము లభింప కుండినన్ । దళములు లే
వె భక్తివలె • దానము విష్ణుని కింపుసేయదు । జ్వాలతరవిత్తముల్ గ
లుగు • వాఁ డిడుకాంచనరత్నభూషణ । మ్ములును దరిద్రుఁ డిచ్చుదళ • ముల్
సరిగాఁ గొను భక్తుఁ డైనచోన్॥ తే. గీ॥ భక్తివిరహితుఁ డొసఁగిన •
భక్ష్యకోటి। తృణముగాఁ దలపోయును • దేవవిభుఁడు । భక్తుఁ డొసఁగినతృ
ణ మైన • భక్ష్యకోటి। కంటె నెక్కుడుగాఁ జూచుఁ • గంసవైరి॥ సీ॥ బృం
దావనములోన • విప్రాంగన లొసంగు, చలిదికూటికిఁ గాదె • సంతసిల్లెఁ।
గడిమితోడఁ గుచేలుఁ • డిడినట్టియడుకుల, ముష్టిఁ గైకొని కాదె •

మోదమందె। దండకాటవిలోనఁ ♦ దాపసుల్ సమకూర్చు, ఫలమూల
ములఁ గాదె ♦ యెలమిఁ బొందె। భక్తితో శబరి యే ♦ ర్పఱచునుచ్ఛిష్ట
ఫ, లమ్ములం గాదె యా ♦ హ్లాద మొందెఁ॥ తే. గీ॥ గుంతి పెట్టినపుల
గంబు ♦ గొప్ప యేమి। వెల యగునె మోక్షలక్ష్మికి ♦ విదురువిందు। వన
జలోచనునకు బీద ♦ తనము లేదు। తెమ్మనఁడు సొమ్ము భక్తుల ♦ సొమ్ము
వాఁడు॥ సీ॥ లయఁ దప్పి నడిచి మ్రో ♦ లఁ బడు తస్కరుఁ జూచి, మ్రొ
క్కినాఁ డితఁ డంచు ♦ మోక్షమొసఁగెఁ। గుడిచుట్టు గ్రద్దకై ♦ నడచు
శ్వానము గాంచి, వలగొనె నని ముక్తి ♦ ఫల మొసంగెఁ। దనసుతుఁ
బ్రేమఁ బి ♦ ల్చిన నజామిళుఁడు తన్, దలఁచె నంచును నిజ ♦ ధామ మొ
సఁగెఁ। గల్లు ద్రావి నటించు ♦ భిల్లుండు తనయుత్స, వముఁ జేసె నని
యప ♦ వర్గ మొసఁగెఁ॥ తే. గీ॥ దముల మొనరించి చూర్ణహ ♦ స్తంబు
వాఁడయు। విప్రుఁ గని కోవెలకు గార ♦ వెట్టె ననుచుఁ। బరమపద మిచ్చె
విష్ణుని ♦ కరుణ దెలుపఁ। దరమె పన్నగపతి కైన ♦ గురుని కైన॥ క॥ ఏ
రీతి నైన విడువక। వారిజలోచనునిఁ గొల్చు ♦ వారి కగును గా। కూరక
తిని కూర్చుండిన। వారల కెట్లగును మోక్ష ♦ వైభవము భువిన్॥ క॥
తాంబూల మన్నమును గుసు। మంబులు భక్ష్యములు గంధ ♦ మాల్య
ఫలాదుల్। జాంబూనదాంబరునకు ము। దంబున నిడ వచ్చు వారలఁ ♦
దాఁ గొన వచ్చున్॥ తే. గీ॥ వీని కన్యంబు లగునట్టి ♦ వానిలోన। బు
ద్ధిపూర్వకముగ నైన ♦ బుద్ధిపూర్వ। కముగ నైనఁ దృణం బైనఁ ♦ గంస
వైరి। ధనము గైకొన్న నరకంబు ♦ తప్ప దెపుడు॥ క॥ హరికి మొదల
భోగ్యములై। మరలన్ భోగ్యములు కాని ♦ మాల్యాదులు తా। నురు
వుగఁ గొన మే లగుఁ దది। తరములు గైకొన్న నిరయ ♦ ధామము
చేరున్॥ తే. గీ॥ తా నొసంగిన దైనను ♦ దనశరీర। బాంధవు లొసం
గునది యైనఁ ♦ బరు లొసంగు। నట్టి దైనను హరిధనం ♦ బాససేయుఁ
వానికి నిరయదేశ మా ♦ వాసమగును॥ మ॥ తనకుం జందనపుష్పభోజ్యము
లమీఁ ♦ దన్ వాంఛ వర్తించుచో। వనజాతాక్షున కాదియం దొసఁగి త ♦

ద్వస్తువ్రిజం బెల్లఁ దాఁ। గొని భోగింపఁగ వచ్చు నట్టిమనుజున్ ♦ గోవిం
దుఁ డాత్మీయులో । కనితాం తోజ్జ్వలసౌధమండలగతుం ♦ గావించుఁ
దథ్యంబుగన్॥ తే॥ గీ॥ అతిథి కిచ్చినఁ దనకు లే ♦ దనఁగ వచ్చు । నట్లు
కాదు ముకుందున ♦ కర్పణంబు । సలుపునన్నాదులు. ప్రసాద ♦ సంజ్ఞ
నొంది । నైహికాముష్మికసుఖంబు ♦ లాచరించు॥ చ॥ అతిథికిఁ బెట్టుకం
టెను హరి ♦ తాశనలోపల వేల్చుకంటె నాశ్రితుల కొసంగుకంటెఁ బి
తృ ♦ సేవకుఁ గూర్చుటకంటె నర్థికి । బ్రతిదిన మిచ్చుకంటెను బ్ర ♦
పల్ ఘటియించుటకంటె భక్తి నచ్యుతునకు నర్పితం బయిన ♦ సొమ్ము స
హస్రగుణమ్ములం దగున్॥ ఉ॥ పాఱునిఁ జంపుకంటె గురు ♦ భామినిఁ
బట్టుటకంటె వేదముల్ । దూఱుటకంటెఁ గాంచనము ♦ దొంగిలు
కంటెను మద్యపానమున్ । గోరుటకంటె బౌద్ధులను ♦ గూడి చరిం
చుటకంటె దైత్యసం । హారకువిత్త మొక్క తృణ ♦ మైన హరించుట పా
తకం బగున్॥ మ॥ స్థిర నెవ్వారికి హింసఁ జేసినను బా ♦ తిత్యంబు సు
మ్మందులోఁ । బరమేశార్చనముఖ్యకార్యముల లో ♦ పం బైనచోఁ దప్ప
శ్రీ । హరికైంకర్య మొనర్చుభృత్యతతి కా ♦ యాసంబు గావించి
నన్ । దురితం బుత్కట మా నటంచు శ్రుతులం ♦ దుం గానఁగా
నయ్యెడిన్॥ మ॥ అరవిందాక్షుని మూర్తిఁ జూచియును సా ♦ ష్టాం
గంబు వర్జించుదు । ర్నరునిం బట్టి పరేతరాట్పటుభట ♦ వ్రాతం
బు నిర్ఘాతని । ష్ఠురకాలాయసదండపాతహతశీ ♦ ర్షుం జేసి దుర్దాం
తవై । తరణీతప్తజలోజ్జ్వల జ్జ్వలనజా ♦ తంబందు వైచున్ వడిన్॥ మ॥
ధరణీదేవులు రాజులర్యులును శూ ♦ ద్రశ్రేణి గోపాదిసం । కరులున్
భామలు యక్షకిన్నరదివౌ ♦ కస్సిద్ధసాధ్యాదు లం । దఱు జాత్యర్హము
వర్ణయోగ్యముగ శ్రీ ♦ దాశార్హునిన్ భక్తిబం । ధురులై పూజ
యొనర్ప వచ్చు ననుచున్ ♦ బోధించు శాస్త్రావళుల్॥ మ॥ జలజాతాక్షు
ముఖేందుబింబవిగళ ♦ త్సౌందర్యవారామృతో । జ్జ్వలవారాశిని నేత్ర
గోళముల ను ♦ త్సాహంబుతోఁ గ్రోలుచుం । జలదచ్ఛచ్ఛవిచామరా

న్వితకరా ♦ బ్జం బొప్ప సద్భక్తిసం । కలితుండై హరిఁ గొల్చు మర్త్య
నకు మో ♦ క్షశ్రీ లభించుం జుమీ॥ మ॥ అతివేగం బతిమంద మత్య
ధిరవం ♦ బత్యల్పనాదంబు సం । గతవర్ణం బగునట్లు పల్కక స్వర ♦
గ్రామంబు వర్ణంబు లం । చితవృత్తిన్ దగ మంత్రముల్ పలుకుచున్ ♦
జిత్తంబు కామాదివ । ర్జితమై యొప్పఁగ భక్తితోడ హరిఁ బూ ♦ జింప
న్వలెన్ మానవుల్॥ చ॥ అవనితలంబు పంక మగు ♦ నట్లుజలంబులు
నింప రాదు పా । త్రవితతి సంక్రమించి నిన ♦ దం బగున ట్లొనరింపఁ
గూడ ద। న్యవచనముల్ వచింపఁ దగ ♦ దన్యమనీషయుఁ బూన రాదు
మా । నవుఁడు మురారిపాదనలి ♦ నంబులు పూజ యొనర్చునత్తఱిన్॥
మ॥ మొదలన్ స్నాన మొనర్చి శుభ్రవసనం ♦ బుల్ గట్టి పాత్రంబుచే।
నుదకంబుల్ గొని దీపగంధఫలమూ ♦ లోత్కృష్టతాంబూలపు । ష్పద
ళాంగాదులు గూర్చి పట్టుకొని దీ ♦ వ్యద్భక్తితో మానవుల్ । మదదం
భాదులు లేక పూజ యొనరిం ♦ పంగాఁ దగున్ మాధవున్॥ ఉ ॥ దుర్జ
యకామలోభముఖ ♦ దుష్టవిరోధుల గెల్చి సత్యశౌ । చార్జవశాంతి
దాంతిసము ♦ దంచితుఁడై యితరప్రసంగసం । వర్జితుఁడై మురాంత
కని ♦ వాసముపాలికిఁ బోయి భక్తితో । నర్జునసారథిం గొలుచు ♦
టర్హము మర్త్యున కెన్నిభంగులన్॥ తే. గీ॥ హరిని బూజింప సకలప ♦
దార్థములును । సంభవింపనివేళను ♦ జలముచేతనైనఁ బూజింప వలెఁ
గాని ♦ మానరాదు । మానిన లభించుఁ బాపంబు ♦ మానవులకు॥
తే.గీ॥ తనకు దొరకినవస్తువుల్ ♦ తగ నొసంగి । లేనివస్తువు లన్నియు ♦
మానసమునఁ। బూర్తి గావించి విష్ణునిఁ ♦ బూజసేయ । వలయు నద్దాన
హరి సంత ♦ సిలు నిజంబు॥ ఉ॥ యౌవనవంతుఁడైన మను ♦ జాధిపు
చెంగట భృత్యునట్ల రో । పావిలమానసోగ్రభుజ ♦ గాంతికమందగదుం
డుఁబోలెఁ గ్రో । ధావృతమైనదంతికడ ♦ యంతవలెన్ మనుజుండు
ద్రిమ్మరం। గా వలె భక్తియున్ భయముఁ ♦ గల్గి ముకుందునిమందిరంబు
నన్॥ తే.గీ॥ స్తనముఁ గుడుచుకుమారునిఁ ♦ దల్లిరీతిఁ । బ్రాణనాథుని

సత్పతి ♦ వ్రతవిధమున । రక్తియును భక్తియును గల్గి ♦ రామచంద్రు। నర్చన మొనర్ప వలయు మో ♦ క్షార్థిజనుఁడు॥ క॥ సకలఫలదంబు లగు నై । దికకర్మములందు విష్ణు ♦ దేవార్చాపూ। జకుఁ దుల్యమైనకర్మం। బొకటియుఁ గనఁబడదు శాస్త్ర ♦ మూహించుతఱిన్॥ మ॥ సకలజనాం తరంగముల ♦ సంతతమున్ వసియించియున్ మద । ర్చకసులభార్థ మర్చనయి ♦ సర్వజగంబుల నిండి యున్నమా । మకఘనమూర్తులం దొకటి ♦ మర్త్యుఁడు గొల్చిన సంతసింతు నం । చకుటిలుఁడై వచించె ను ము ♦ రారి యుధిష్ఠిరుతో నెఱుంగవే॥ క॥ యావజ్జీవంబును రా । జీవాక్షునిపూజనంబు ♦ సేయునరునిపా । పావళు లెల్లఁ దొలంగును । శ్రీవైకుంఠంబు చాలఁ ♦ జేరువగుఁ జుమీ॥ తే.గీ॥ ఏనరుఁడు నిత్యమును రమా ♦ జానిపూజ । సలుపు చుండును వానికి♦ జన్మములును।దపము లును దానములును వే ♦ దములు కృచ్ఛ్ర । ములును సంతతసంసిద్ధ ♦ ములు గణింప॥ ఉ॥ కానఁగ రాదు రోగము వి ♦ ఖండితు లయ్యెద రెల్లచోరులున్ । మానవనాథు లెల్ల నయ ♦ మార్గము తప్పరు పావ ముల్ చెడున్ । వానలుఁ బంటలున్ గలుగు ♦ వారిజనాభునిపూజ శాస్త్రమా । ర్గానుగుణంబుగా సలుపు ♦ నట్టిజనంబులు గల్గుభూము లన్॥ సీ॥ కమనీయనాసికా ♦ కర్ణకంఠకపోల, హస్తలోచనవద ♦ నాం ఘ్రివత్స । జానుజంఘోదరం ♦ బైనట్టికమలాక్షు, రమణీయదివ్యవి ♦ గ్రహము మంచి । కాంచనంబున ♦ నైనఁ ♦ గలధౌతమున నైనఁ, దుద దారువుననైన ♦ ముదము తోడఁ। గావించి శాస్త్రోక్త ♦ గతి నొక్కచో నిల్పి, ప్రత్యహంబును వాని ♦ పాదయుగము॥ తే.గీ ॥ దలఁచుచును బూజసేయుచు ♦ దండములు ఘ।టించుచును సన్నుతులనొన ♦ రించు చును ద । దేకపరతంత్రుఁడై భక్తి ♦ యెసఁగువాని । కచ్యుతునిలో కము స్వకీయ ♦ మైవెలుంగు॥ చ॥ వలదు యమంబు తన్నియమ♦ వర్గ ము ప్రాణమనోనిరోధముల్ । వలదు దృఢాసనంబులు ప్ర ♦ వర్తిత ఘోరతరవ్రతంబులున్ । వలదు మదీయవిగ్రహము ♦ వారక పూజ

యొనర్చునీకు ము। క్తిలలనఁ గూర్తు నంచు మును ♦ దెల్పెను మాధవుఁ
డంబరీషుతోన్॥ క॥ యోగాభ్యాసమునందు వి । రాగము గలవాఁడు
ముక్తి ♦ రమణీమణితో । భోగించుట కర్చాపూ । జాగతి దప్పంగ
నొండు ♦ సాధన మేదీ॥ సీ॥ జ్ఞానరూపముకంటె ♦ సౌలభ్యగమ్యమై,
పరరూప మొప్పఁ ద ♦ త్పరముకంటె । వ్యూహంబు సులభంబు ♦
వ్యూహంబుకంటెను, విభవంబు మేలు త ♦ ద్విభవమునకు । నధిక
మంతర్యామి ♦ యంతకంటెను స్వయం, వ్యక్తార్చ మేల్ స్వయం ♦
వ్యక్తమునకు । దైవార్చ సుకరంబు ♦ దైవార్చకంటెను, సైద్ధంబు లగ్గు
త ♦ త్సైద్ధమునకుఁ ॥ తే.గీ॥ పౌరుషార్చయె వరము త ♦ త్పౌరుషార్చ
లందుఁ దాను బ్రతిష్ఠించి ♦ నట్టివిష్ణు । విగ్రహము తోడ నెవ్వియు ♦
వెలకు రావ । టంచు శాస్త్రము లైకకం ♦ ఠ్యమునఁబలికె॥ శా॥ సాల
గ్రామమునందు నిత్యముగఁ దా ♦ సాన్నిధ్యముఁ జేసి ల । క్ష్మీలోలుండు
వసించి యుండుటను ద ♦ త్సేవార్చనధ్యానదా । స్యాలాప స్తుతివందనశ్రవణ
స ♦ ఖ్యాదుల్ జనుఁ మోక్షభా । మాలోలాచ్ఛకటాక్షపాత్రు నొనరిం ♦
పఁ బూని యుండున్ జుమీ ॥శా॥ సాలగ్రామమునందుఁ జక్రధరపూ ♦
జల్ చేయుమర్త్యాళి కిం । కేలా యజ్ఞము దానముఁ దపము ల ♦ క్ష్మీ
శుండు తద్దాస్యసం । శీలుం జేర్చు స్వకీయపట్టనగతా ♦ క్షీణధ్వజాగ్రస్ఫుర ।
ద్వ్యాలోలాంబరజాతవాతయుతభా ♦ స్వద్రత్నసౌధంబులన్ ॥ శా ॥
తమ్మున్ గొల్చినవారిపాపములు వి ♦ ధ్వంసంబు గావించుచున్ । నెమ్మిం
జూచినవారిబంధనములన్ ♦ నిత్యంబు భేదించుచున్ । సొమ్ముల్ గోరిన
ధర్మ మానపడినన్ ♦ భోగంబు యోగంబు మో । క్షమ్ముల్ గోరిన
గూర్చుచుం దనరు భా ♦ స్వద్గండకీరత్నముల్ ॥ తే.గీ॥ గండకీరత్నములను
లో ♦ కంబు లెల్ల । నుండు విప్రున కవి దాన ♦ మొసఁగువాఁడు । సకల
విశ్వంబు దానం బొ ♦ సంగుఫలముఁ । బొందు ననుచును శాస్త్రంబు ♦
పూని చెప్పె ॥ మ॥ ముద మొప్పన్ హరిమూర్తి యేగృహములం ♦ బూ
జాదులంబొందుఁ ద । త్సదనంబే కురుభూమి కాశి గయ కే ♦ దారంబు

సింహాద్రియున్। బదరీకాననముం బ్రయాగమును శ్రీ♦భద్రాద్రియున్ గం
డకీ। హరిదమున్ హస్తినగంబు పుష్కరిణి శ్రీ ♦ రంగంబు సు మ్మె
న్నఁగన్ ॥క॥ సాలగ్రామశిలాధరహి। తాలయ మపవిత్ర మగుట♦నచ
టికిఁ బితృదే। వాళులు చేరరు విను బే।తాళము లుండెడి శ్మశాన♦ధర
ణియది సుమీ॥చ॥కరమున ముట్టినన్ వినినఁ♦గన్నులఁ జూచినఁగాఁగి
లించినన్। స్మరణ మొనర్చినన్ వినుతి ♦ సల్పిన వందన మాచరించి
నన్। విరులను బూజఁ జేసినను ♦ వేడుక వేఁడిన మర్త్యకోటికిన్।హరి
పురి గండకీమణి ద♦యన్ సమకూర్చు నుతింప శక్యమే ॥క॥ పితృదేవా
తిథిపూజలు। వ్రతములు దానములు యాగ ♦ వైభవములు సం। చిత
సాలగ్రామాంతిక। కృతము లగుచు శతగుణములఁ ♦ గీర్తింపఁబడున్॥
క॥ కావున నర్చాకృతి యగు। శ్రీవనితానాథు చెంత ♦ శ్రీమూర్తులు
పె। క్కేవిధమున నైన నిడం। గా వలయుఁ బ్రతిష్ఠ సేయు ♦ ఘనుఁడు
ముదమునన్॥ క ॥ రాజీవాక్షు యథావిధిఁ। బూజింపక మోహము
నను ♦ భుజియించు నరుం। డోజ నిరయంబు లెల్లను। భోజన మొన
రించి పిదపఁ ♦ బోత్రి యగుఁ జుమీ॥ క॥ అనివేదితాన్నభోజన। ము ని
వేదితవర్జనంబు ♦ భువిఁ గూడదు వి। ష్ణునిసుప్రసాదభోజన।మున నుపవా
సఫల మొందుఁ ♦ బుంస్త్రీతతులున్॥ చ॥ హరికి నివేదితం బగువ ♦ రా
న్నము భక్షణ మాచరించినన్। నరునకు సంభవించును ది ♦ నంబును
దీర్ఘము లాదుపుణ్యమున్। ధరణితలంబు సర్వమును ♦ దాన మొసంగుఫ
లంబు దక్షిణా।భరితసమస్తయజ్ఞములు ♦ పాయక చేసినవానిసద్గతుల్॥
చ॥ శతధృతిశర్వశక్రముఖ ♦ సర్వసుపర్వులు దైత్యజిన్నివే। దితవిమ
లాన్న మాసపడి ♦ ధీరత నిల్తురు దేవతార్చనా।రతునిగృహాంగణంబున
ని ♦ రంతర మట్టిమహాప్రసాద ము। న్నతగతితో భుజించెడిజ ♦ నమ్ముల
కున్ హరిలోక మబ్బిమే॥ చ॥ ప్రతికబళంబు మాధవునిఁ♦బల్కి భుజించు
టకంటె భూసుర। పంక్తికి మున్ను పెట్టి పిద ♦ పన్ భుజియించుటకంటె
నిత్యస। త్క్రతువుల నేనిటిన్ సలిపి ♦ తత్పరమందు భుజించుకంటె న।

చ్యుతునిప్రసాదముం దినుట ♦ యోగ్యతరంబు మనుష్యకోటికిన్॥ మ॥
అరవిందాక్షునివేదితాన్నమున దే ♦ వారాధనంబున్ ధరా। మరసంపూ
జనముల్ పితృక్రియలు హో ♦ మంబుల్ దగం జేయుచోఁ। బరిశుద్ధిన్
దనరారుఁ గాని మలిన♦ ప్రాయాప్రసాదంబు లే। వరుసం బెట్టుట కూడ
దట్టిజనులన్ ♦ వంచించు దైవం బిలన్ ॥ చ ॥ ముకహారబింబవర్జితను ♦
మున్నతగేహము రుద్రభూమి నా। వఱలును దక్కధారహిత ♦ వాక్కు
లు ఘూకరుతోపమానముల్ । ఖరరిపుదాస్యశూన్య లగు ♦ కర్మ్మర
తుల్ నడపీనుఁగుల్ ధరన్ । హరి కనివేదితం బయిన ♦ యన్నము దా
విష మాఁ దలంపఁగన్॥ తే.గీ॥ రామపదభక్తి లేనట్టి♦బ్రాహ్మణాది।జనులకు
నివేదితాన్న మొ ♦ సంగఁ గూడ। దజ్ఞుఁడై యిచ్చినను బ్రసా ♦ దాన్న
భోక్త। పాతకం బెల్ల దాతను ♦ బట్టుకొనును ॥ తే.గీ॥ సాత్త్వికాహార
ములచేత ♦ సత్త్వవృద్ధి। రాజసాహారముల రజః ♦ ప్రబలతయును। దా
మసాహారములచేఁ ద ♦ మోమహత్త్వ। మగుట ననివేదితము తినఁ ♦
దగదు జనుఁడు ॥క॥ హరిభక్తి లేనిమనుజుఁడు। హరినైవేద్యంబు దినుట♦
యట్టిజడునకున్ । హరిభక్తుఁడొసంగుటయును । దురితాస్పద మనుచుఁ
జెప్పు ♦ దురు శాస్త్రజ్ఞుల్॥ క॥ భగవత్ప్రసాదనిందకుఁ।డగుదుర్జనునోటఁ
గీట ♦ కాదులు పడు భ । క్తిగరిష్ఠుఁ డగుచు దానిన్। మగుడ భుజించు
టయె మాను ♦ మందై యొప్పున్ ॥ క ॥ హరిపాదాంబుజతీర్థము । శిర
మున ధరియించువాఁడు ♦ శివునకు సరియై । సురమునిగణములు పొగ
డఁగ।బరమపదంబునకు నేగుఁ ♦ బరమేశుదయన్ ॥ తే.గీ॥ సకలతీర్థోదక
ముల నా ♦ శంబు గాని। ఘోరతాపత్రయాగ్ని చ♦ల్లాఱుఁ దత్క్ష।ణంబె
శ్రీహరిపాదతీ ♦ ర్థంబు మౌళి। భాగమునఁ జల్లుకొన్నట్టి ♦ భక్తతతికి॥
ఉ ॥ ఏమిట గంగ కింత మహ ♦ నీయత గల్గెను శంకరుండు తా। నేమి
టి మౌళిపై నిడి మ ♦ హేశుఁ డనం దనరారెఁ దస్కరుం। డేమిటఁ
గ్రోలి మోక్షమున ♦ కేగి సుఖస్థితి నుండె నట్టిశ్రీ। రామపదాబ్జతీర్థ
ములు ♦ ద్రావిన నేగతి నిల్చుఁ బాపముల్ ॥ తే.గీ॥ ప్రాంతపాదోదకము

కంటెఁ ♦ బావనంబు। క్రొత్తపాదోదకం బంట ♦ రిత్త గాదు।చోరుఁ డజ్ఞ
తనిది గాని ♦ శౌరిఁ జెందె । గంగలో మీాల కపవర్గ♦గమన మేది॥సీ॥
భవభయామోఘాస్త్ర ♦ పటలంబుల కభేద్య, భవ్యకంకటము శ్రీ♦పా
దజలము । అజ్ఞానసంఘగా ♦ ఢాంధకారములకు, భానుబింబంబు శ్రీ♦
పాదజలము । కలుషసంఘాతమే ♦ ఘవ్రాతములకుఁ బ్రభంజనద్రఢిమ
శ్రీ♦పాదజలము । దంభలోభక్రోధ ♦ దండశూకాళికిఁ, బక్షిరాణ్ముఖము
శ్రీ♦పాదజలము॥ తే.గీ॥ సంచితాగామికర్మభా ♦ స్వద్గజేంద్ర । పంక్తికి మృ
గేంద్రరవము శ్రీ ♦ పాదజలము । తలఁచినను మాళిఁ బూనినఁ♦ ద్రావి
నను స్ప్ర। శించినను ముక్తుల నొనర్చుఁ♦బంచజనుల॥మ॥ హరిపాదాం
బుమహత్త్వ మెన్నఁగ నుప ♦ ర్వాచార్యుఁడున్ శేషుఁడున్ । సరసీజా
సనుఁ డైనఁ జాల రిఁక నా ♦ శక్యంబె వర్ణింపఁ ద।ద్వరతీర్థంబులు గ్రో
లుపట్టిజనుఁ డి ♦ ద్ధాత్రీస్థలిన్ మాతృబం । ధురవక్షోరుహకుంభసంభృ
తలస ♦ ద్దుగ్ధంబులన్ ద్రావునే ॥క॥ శ్రుతులు పురాణంబులు సం । హిత
లున్ స్మృతులును వచించె ♦ శ్రీశాంఘ్రిజలం । బతిపావనంబు గంగా।
దితీర్థములకంటె నంచు ♦ దీనిఁ దెలియుఁడీ॥క॥ హరిమూర్తికడకుఁ జని త।
చ్చరణజలము గొనుట యోగ్య♦ సరణి యగున్ దు। ర్భరితుఁడగు వేళఁ
డనమం । దిరమునకున్ హితులచేతఁ ♦ దెప్పింపఁ దగున్॥ శా॥ గోకర్ణా
కృతిగాఁగఁ బాణితలమున్ ♦ గుంచించి దేవార్చకుల్ । వీఁకం దెచ్చిన
తీర్థరాజమును స ♦ ద్విద్యాప్రదం బంచు ను । త్సేకం బొప్ప నుతించు
చుం బృథివిపై ♦ శీర్ణంబు గాకుండ ల । క్ష్మీకాంతాస్యముఁ జూచుచున్
జనుఁడు భ ♦ క్తిన్ దానిఁ గ్రోలం దగున్॥ తే.గీ॥ చందనంబును దీర్థప్ర♦
సాదములును । గుసుమములు తులసియు శర♦గోపమును ము। కుందుద
య యని నమ్రుఁడై ♦ కొనఁగవలయు। విష్ణుపూజన మొనరించు ♦ విబు
ధవరుఁడు ॥సీ॥ వర్ణాశ్రమాచార ♦ వర్తనంబులను జ్యో, తిష్టోమచయ
నవి ♦ శిష్టయజ్ఞ।కర్మంబులను రత్న ♦ కాంచనతిలభూమి, కన్యకాహ
యదంతి ♦ ధాన్యముఖ్య । దానంబులను దీర్థ ♦ తపముల నారామ, కూప

తటాకని ♦ క్షేపణముల । సత్త్రప్రపాదిక ♦ సంధానములఁ బిత్రు దేవతా
చార్యభూ ♦ దేవగోస ॥ తే. గీ ॥ పర్వలను దీర్ఘయాత్రల ♦ బ్రహ్మచర్య।
ముల జపంబుల నుపవాస ♦ ములను బద్మ । నాభునకుఁ జేయు నారాధ♦
నమ్ము లంగ । పూజ యగుఁ గాని యన్యుల ♦ పూజ గాదు॥ తే.గీ॥ సోప
కరణోపరమికని ♦ రుపకరణము । లనెడిసత్కర్మములు మాధ ♦ వార్చ
నములె । యగుట తథ్యమె కాని మా ♦ ధ్యమికనిష్ఠ । తప్పి శరణార్థి
పూజింపఁ ♦ దగదు హరిని॥ఆ.గీ॥ విష్ణుభక్తి లేక ♦ వేదశాస్త్రంబులు। చదు
వుకొన్నవిప్ర ♦ జనునికంటె । శౌరిభక్తి గల్గు ♦ చండాలుఁ డైనఁ బవి
త్రుఁ డనుచు నెల్ల ♦ విబుధు లంద్రు॥ తే.గీ॥సుకృతముల ముక్తి గల్గుట♦
శ్రుతి వచించు । దానిభావంబు యోగప ♦ దంబు చెప్పు।టని ప్రప
న్నుఁడు దెలిసి పు ♦ ణ్యాఘవర్జి। తాధ్వమున సంచరించు ట ♦ ర్థంబు
సుమ్ము॥క॥వనజాక్షుమందిరం బను। దినము దుడిచి నీరుచల్లి ♦ దీపితమగున।
ట్లొనరించువానిపుణ్యం। బనంత మాబ్రహ్మకైన ♦ నలవియె తెలుపన్॥
క॥ దీపప్రదానపుణ్యము । రూపింపఁదరంబు గాదు ♦ రూఢి మెఱసి యు।
ద్దీపితుఁ డగుమాంధాతృమ। హీపతికథవలన దీని ♦ నెఱుఁగంగఁ దగున్॥
వ॥ అనిన విని యాదవుండు తత్కథాప్రకారం బెఱింగింపు మనిన జగ
ద్గురుం డిట్లనియె ॥ సీ॥ తనగురుం డగువసి ♦ ష్ఠునిఁ గాంచి మాంధాత,
యేను బూర్వంబునం ♦ దేమి నోచు।కతన నీమైశ్వర్య ♦ మతులతేజము
నిట్టి, వనితయు దొరకె నె ♦ వ్వరము మేము। తెలుపు మంచును వేఁడఁ♦
దెలిసి యాతఁడు నీవు, తొంటిజన్మమున శూ ♦ ద్రుఁడవు ఘోర। పాప
ముల్ చేసిన ♦ బాంధవుల్ వెలిఁ బెట్టి, రపుడు భార్యయు నీవు ♦ నచటు
వాసి॥ తే.గీ॥ యొకపురంబున హరిగేహ ♦ మున్ననచటి।కరిగి సమ్మార్జనా
భ్యుక్ష ♦ ణాదికములు । సేయుచును దుది ముట్ట వ ♦ సించి నందు । వ
లన మీ కయ్యె నిట్టిమై ♦ శ్వర్యగరిమ॥ తే.గీ॥ విష్ణుకడ నున్న దీపంబు ♦
వెలుఁగ కున్నఁ । బయ్యెద చెఱంగు చింపి యా ♦ పడఁతి వర్తి। నైవ
భోజనతైలంబు ♦ నీవు పోసి । తందుచే నిట్టి తేజంబు ♦ లయ్యె మీకు॥

శా॥ మీ౯రచ్చో వసియించుకాలమున సా♦మింజూడఁగాఁ గోరి సా।వీర స్మారమణుండు తత్సుతులు శీ♦విం జేరఁగా వారిఁ గ।న్నారం జూచినమీ మనంబులు సమ♦గ్రైశ్వర్యముల్ గోరుటం। బారం బింతయు లేని సంపదలు సం♦ప్రాప్తించె మీకిత్తఱిఁ॥ తే.గీ॥ కమలనాభునిభజియిం చు♦కాలమందుఁ। గోర్కి పుట్టుట మీకిట్టి♦ గొప్పవిభవ। మయ్యెఁ గోరనిచో మోక్ష♦మపుడె కల్గు। ననుచుఁ దెల్పె నటంచు రా♦మాను జుండు॥ వ॥ మఱియు నిట్లనియె॥ సీ॥ కర్పూరమిశ్రస♦ద్గంధబంధుర హారి, చందనంబున విరా♦జత్సరోజ। చంపకమల్లికా♦చామంతికాదిపు, ష్పములను దులసీద♦ళముల భవ్య। వస్త్రభూషణధూప♦వైభవమ్ముల దీపి, కానీకముల మధు♦రాన్నపాన। నైవేద్యములఁ బతా♦కావళీ మండప, ప్రాకారగోపుర♦వాౖతములను॥ తే. గీ॥ నిఖిలధనములఁ దాం బూల♦నృత్తగీత। తూర్యవాద్యాదులను షణ్ము♦దుగ్ధఫలర। సాభిషే చనములఁ బయో♦జాక్షుఁగొల్చు। జనుల దౌవిణంబు సుమ్ము మో♦ క్షమ్ము నమ్ము॥ చ॥ హరికి నఖండదీపము స♦మర్పణ మేర్పడఁ జేయు పుణ్యులున్। హరిగృహమందు గంధసహి♦తాంబువు లింపుగఁ జల్లు మానవుల్। హరికిఁ బ్రదక్షిణంబు సము♦దంచితభక్తి నొనర్చుధార్మి కుల్। హరిపురసీమకుం బిత్రుగ♦ణావళితోఁ జని యుందు రచ్చటన్॥ ఉ॥ ఆర్తుల నెల్లఁ బాపు దురి♦తాళులఁ ద్రుంచు సమస్తపుణ్యసం। పూర్తి యొనర్చుఁ జక్రిధరు♦భూరికృపామహిమంబుఁ జేర్చు న। ద్వార్తిమధూ కతైలతిల♦తైలసగుగ్గులుగోఘృతోజ్జ్వల। కార్తికమాసవిష్ణుగృహ♦ కల్పితదీప మటండ్రు పండితుల్॥ తే. గీ॥ హరిగృహంబున సుధఁ గొల్పు♦ నతఁడు క్రొత్త। పనులు చిత్తరువులు సేయు♦జనుఁడు జీర్ణ। గృహము ని ల్పినమనుజుండు ♦ శ్రీనివాసు। వేశ్మమున నుండు నిజపితృ♦ వితతితోడ॥ తే. గీ॥ హరికి సాష్టాంగ మొనరించు,♦నపుడువాని। పాతకంబులు భూమిపైఁ♦బడును మరల। జనునితో నవి లేవఁగాఁ♦జాల వనుచు। నారదుఁడు సంయములకుఁ జె♦న్నారఁ జెప్పె॥ తే॥ గీ॥ హరికి వందన

మొనరించు ♦ నతఁడు మోక్ష । దశ వహించు దశాశ్వమే ♦ ధము లొన
ర్చు । నతఁడు మరల జనించు న ♦ ట్లగుట వీని । తారతమ్యంబు మదిలో
నఁ ♦ దెలుపరయ్య॥ క॥ వనజాక్షునకున్ వందన । మొనరించినవాని
కేను ♦ నొనరించెద వం । దన మని జముండు ముద్గల । మునివర్యునితోడఁ
బల్కె ♦ మును సద్భక్తిన్॥ క॥ సాయంప్రాతఃకాలము । లాయతనసమేత
ముగ ము ♦ రారికి మనుజుల్ । సేయుప్రదక్షిణములు య । జ్ఞాయుతశతఫ
లకరంబు ♦ లండ్రు మహాత్ముల్॥ క॥ బలిదానోత్సవవేళల । జలజాక్షుప్ర
దక్షిణంబు ♦ సలుపుజనులకున్ । గలుగుం బ్రతిపదమున ను । జ్జ్వలహయమే
ధఫల మనుచు ♦ శాస్త్రము చెప్పెన్॥ క॥ హరిమందిరంబు చుట్టును । దిరు
గుటచే భూమిచుట్టుఁ ♦ దిరుగుఫలము దా । నరుల కగు నంచుఁ బలికెను ।
నరసింహపురాణ మబ్జ ♦ నాభుఁ దెలుపుచున్॥ తే. గీ॥ అర్థవాదంబు లే
కుండ ♦ ననఘు లార । దేవుని మొగంబుఁ జూచుచుఁ ♦ దెలుపువాఁడ । హ
రికి సద్భక్తి మున్మ్రొక్కు ♦ దిరుగు నతఁడు । మఱి జనింపఁడు సుందు భూ ♦
మండలమున॥ వ॥ ఆసనంబును నావాహనంబును బాద్యంబును నర్ఘ్యం
బును నాచమనంబును బాదుకాసమర్పణంబును దంతధావనంబును దై
లవిలేపనంబును సముద్వర్తనంబును గంధామలకప్రదానంబును దో
యాభిషేచనంబును మూర్ధిధావనంబును దడియొత్తుటయు వస్త్రయు
గ్మంబును యజ్ఞోపవీతంబును గంధవిలేపనంబును భూషణంబును బు
ష్పంబును నంజనంబును దర్పణదర్శనంబును ధూపంబును దీపంబును
బుష్పదామంబును నైవేద్యంబును దాంబూలంబును మంత్రపుష్పంబును
దర్పణంబును స్తుతియును ధ్వజంబును జామరంబును ఛత్త్రంబును వా
హనంబును ననుద్వాత్రింశదుపచారంబులనైనను షోడశోపచారంబుల
నైనను బంచోపచారంబులనైనను నిగమనపడి భట్టరుపదులయం
దొక్కవిధంబున గృహార్చారాధనంబు గావింప వలయు నని తత్ప్రకా
రంబు లుపదేశించి మఱియు నిట్లనియె॥ క॥ త్రైవర్ణికులకుఁ దక్క
ను । జేవర్ణమువారలును స్వ ♦ గృహమున హరిపూ । జావిధులు చేయఁ

గూడదు। దేవళీ మందతికిఁ గొలువఁ ♦ దేరునై యుండున్॥ క॥ తా నె
వ్వఁడైన నెవ్వతె। యైనన్ గ్రామార్చ యగుమురారి నశుచి తాఁ।
గాని సమయమున సామ। గ్ర్యానుగుణంబుగను జేయ ♦ నగు నర్చన
ముల్॥ శా॥ ప్రాతఃకాలమునందు శౌచము ముఖ ♦ ప్రక్షాళనం బైనత।
ర్వాతన్ స్నానముఁ జేసి శుభ్రతరవ ♦ స్త్రంబుల్ తగం గట్టి కం। జా
తాక్షావళు లూర్ధ్వపుండ్రములు ని ♦ చ్చం దిద్ది నిత్యక్రియా।జాతంబుల్
గడతేర్చి భక్తియుతుఁడై ♦ శౌరిన్ మదిం బూనుచున్॥ మ॥ ఫలముల్
పువ్వులు మాలముల్ చెఱకులుం ♦ బానీయతాంబూలముల్।జలముల్
దక్షిణ దీపికార్ద్ర రసముల్ ♦ సాంబ్రాణి కర్పూరముం।దులసీపత్త్రములున్
సుగంధములు న ♦ న్యూనంబుగాఁగొంచు శ్రీ। జలజాతాక్షునిపూజకుం
జన వలెన్ ♦ సంతోషసంయుక్తుఁడై॥ తే. గీ॥ ఎంత శృంగారముగ భ
క్తుఁ ♦ డేగుదెంచు।నంత సంతోష మొందు నై ♦ త్యాంతకుండు।గాన
మనుజుండు తనయింటఁ ♦ గలిగినేని।భూషణాదులు ధరియించి ♦ పోవ
మేలు॥క॥ జనుఁ డీపదార్థములలోఁ। దనకు లభించినవి గొంచు ♦ దనుజా
రిగృహం। బున కేగి గోపురాంతిక। మునఁ గరపాదంబు నీర ♦ మునఁ
గడుగఁ దగున్॥ క॥ శుద్ధాచమనముఁ జేసి స। మిద్ధగతిన్ లోని కరిగి ♦
శ్రీశుపదములన్। బద్ధహృదయాబ్జుఁడై యని।రుద్ధునిఁ గని వందనము
న ♦ రుఁడు సేయఁ దగున్॥ క॥ పక్షీంద్రున కామీఁదఁ బ్రదక్షిణముల్
వందనంబు ♦ తగఁ జేసి నరుం।డక్షయ మగుసద్భక్తిని।వీక్షించి సమర్చ
నములు ♦ వే చేయఁ దగున్॥ క॥ శుద్ధ మగుహరిగృహమ్మున। కిద్ధగతిఁ
బ్రదక్షిణంబు ♦ లెన్నేనియుఁ దా।స్పద్ధతిఁ గలజంతువులకు। విద్ధత గాకుం
డ సూక్త ♦ విధిఁ జేయ వలెన్॥ క॥ పరివారదేవతామం।దిరముల కవ్వే
ళఁ జుట్టు ♦ దిరుగుచు లక్ష్మీ।వరకృప మాకొసఁగుం డని।పరిచర్య లొన
ర్ప వలయు♦భక్తియుతుండై॥ క॥ ముందుగఁ బ్రదక్షిణం బీ।చందంబునఁ
జేసి భక్తి ♦సహితుండై యిం। పొందఁగ దక్షిణసరణిన్। మందరధరు
మందిరంబు ♦ మఱి చొర వలయున్॥ క॥ పక్షీంద్రవాహు నెదుటన్।దక్షి

ణముగ నిలిచి తా ను ♦ దక్షుఖుఁడై సం। రక్షింపు మనుచు వందన। మక్షీణప్రౌఢిఁజేయ ♦ నగుఁ దొలుదొల్తన్॥ క॥ ఈరీతిన్ వేడ్క నమ। స్కారం బొనరించి భక్తి ♦ సహితుండై శ్రీ। నారాయణు వినుతించి యు। దారగతిన్ మనమునందు ♦ ధ్యానించి తగన్॥ క॥ ఆచమనము సం కల్పం। బాచరితము సైనపిదప ♦ హరిగేహము సం। కోచింపక తుడువ వలెన్। నీచత యది యనెడువాఁడు ♦ నింద్యుఁడు సుమ్మీ॥ క॥ ద్వయ మంత్రము పఠియించుచు। రయమున గంధోదకములు ♦ రాజీవాక్షా।ల యమందుఁ జల్లి యలుకవలయు న చ్చో నపుడు పరిమ♦ళద్రవ్యములన్॥ క॥ ఓర్చి కరయుగము మును దాఁ। గూర్చు జలమ్ములను గడిగి ♦ కొని మోదముతో।నర్చకముఖమున మాధవు। నర్చింపఁగ వలయుఁ దొ లుత ♦ నర్ఘ్య మొసఁగుచున్॥ క॥ ఆద్యంతవిరహితున కన। వద్యావయ వునకు దేవ ♦ వల్లభనుతసం।పద్యుతునకు శ్రీపతికిం। బాద్య మొసఁగ వ లయుఁ బిదప ♦ భక్తి దలిర్పన్॥ క॥ ఆచరితాజాండునకు న। మీచీనగు ణాన్వితున క ♦ మేయునకున స।ధ్రీచీనరూపవంతున। కాచమనంబొసఁగ వలయు ♦ నతులితభక్తిన్॥ క॥ నందకధరునకుఁ గరధృత। మందరశైలు నకు దేవ ♦ మార్తాండునకున్। గుందసమచ్ఛవి గలశ్రీ। చందన మర్పింప వలయు ♦ సమధికభక్తిన్॥ క॥ అసమశరవిసరసుసదృశ। లసదాకారునకు గోప♦లలనాజనదృ।క్ప్రసవార్చనారతునకుం।గుసుమం బర్పింప వలయుఁ♦ గోవిదుఁడు తగన్॥ క॥ గోపవధూకుచకుంభ। ప్రాపితకర్పూరగంధ ♦ బం ధురహారిణీ।లోపమవిగ్రహునకుఁ దగ। దీపము లర్పింప వలెను ♦ ధీయు తుఁ డగుచున్॥ క॥ పుష్పశరజనకు నాగమ। నిష్పాదితసుగుణనివహు♦ నిర్జితదనుజున్। నిష్పతుఁ పాతు విష్ణుని।బుష్పంబులఁ దులసిచేతఁ ♦ బూజిం పఁ దగున్॥ క॥ గంధయుతమ్ములు తేజో। బంధురములు మృదువు లైన♦ బహుళసుమములన్। సింధురరక్షకుని దయా। సింధుని సద్భక్తిఁ బూజ♦ సేయవలెఁ జుమీ॥ క॥ ఇరువదినాల్గును వేయును। మఱి నూటెనిమిదియు నామ ♦ మంత్రంబులు శ్రీ। ధరునకుఁ గలవు చతుర్థీ। భరితములు నమో

పదాంత ♦ భవ్యము లగుచున్॥ శా॥ నామంబుల్ సమవృత్తిఁ బల్కుచు
జగ ♦ న్నాథాస్యబింబంబుపైఁ। బ్రేమం జూపులు నిల్పి హారసుర దో ♦ ర్ధ్రి
హీరశస్ఫురవా। గ్భామాసోమసమచ్ఛవిం దనరుదీ ♦ వ్యచ్చామరం బూ
ని శ్రీ।రామస్వామికిఁ బూజ చేయవలె జా ♦ గ్రద్వృత్తితో భక్తితోన్॥
క॥ తనయింట నైన దేవళ। మున నైనన్ విష్ణుదేవుఁ ♦ బూజించుతఱిన్।
జనుఁడు నిలిచి యుండ న్వలెఁ।జన దొగిఁ గూర్చుండుటయును ♦ శయనించు
టయున్॥ క॥ కోమలతులసీకుసుమ। స్తోమముచేఁ జేయుపూజ ♦ తుది
దాఁకను శ్రీ। తామరసాక్షునిముందరఁ। జామర మర్పించుచుండఁ ♦
జను భక్తిమెయిన్॥ క॥ చాపోదితదివ్యశర। వ్యాపారత్రుటితలవణ ♦
వారాశిమహో। టోపునకు రావణారికి। ధూపము లర్పింప వలె బు ♦
ధుఁడు మోదమునన్॥ క॥ విద్యాస్వరూపునకు నన। వద్యునకుఁ బరా
త్పరునకు ♦ వైకుంఠునకున్। సద్యస్సంభవములనై। వేద్యం బొనరింప
వలయు ♦ విబుధుం డెలమిన్॥ క॥ సారసభవశర్వసునా। సీరముఖామ
రకిరీట ♦ సీమామణిరు। జ్ఞీరాజితపదయుగునకు। నీరాజన మొసఁగ
వలయు ♦ నిండు మనముతోన్॥ క॥అంబుదనీలశరీరున। కంబుజమిత్రా
భునకు ని ♦ శాటహరునకున్। జాంబూనదాంబరునకున్। దాంబూల
మొసంగ వలె ము ♦ దం బలరారన్॥ క॥ రాక్షససేనామర్దన। దక్షు
నకున్ శంఖచక్ర ♦ ధరునకు లోకా।ధ్యక్షునకు స్వశక్త్యనుగుణ। దక్షి
ణ మనుజుం డొసంగఁ ♦ దగు వేడ్కతోన్॥ మ॥ సకలాఘౌఘహరంబు
కృచ్ఛ్రనిభమున్ ♦ జాంద్రాయణప్రాయ మ। ర్చకదత్తంబు సమస్తరోగ
హరమున్ ♦ సంసారసంతాపభం। జకమున్ వేదనుతంబు పావనము
మో ♦ క్షప్రాపకం బంచు న। మ్మికతో శ్రీహరిపాదతీర్థము బుధుల్ ♦
మెచ్చం గొనంగా వలెన్॥ క॥ కాంచనమయచేలునకుఁ బ్ర। పంచగు
రున కొసఁగునట్టి ♦ పంచామృతముల్। పంచజనుఁ డధికభక్తిని। మంచి
తుఁడై క్రోల వలెను ♦ హస్తముతోడన్॥ క॥ శర్కరము మణిగణ
యుత। భర్మాభరణాధికప్ర ♦ భాయుత మనుష్యుం।గూర్మిన్ శ్రీనారా

యణు । నిర్మాల్యము దాల్పవలె న ♦ నిందితభక్తిన్॥ క ॥ రక్షితగజేం
ద్రునకు నతి । దక్షునకున్ శౌరి కర్పి ♦ తం బగుతులసీ । వృక్షదళము
వేడుకతో ।భక్షింపఁగ వలయు విష్ణు♦భవనములోనన్॥ క॥ అసదృశకరు
ణాసహితుం । డసమానాధికుఁడు దేవ ♦ తారాధ్యుఁడు పా । ర్థసఖుఁ
డగునారాయణు । ప్రసాదము గొనంగ వలయు ♦ భక్తిసహితుఁడై
ఉ॥ దండితకంసదైత్యునకు ♦ దైవవరేణ్యునకున్ మణిప్రభా । మండిత
కుండలద్వయస ♦ మన్వితకర్ణునకున్ మహేశ్వరా । ఖండలముఖ్యదే
వనుత ♦ కర్మనకున్ దురితాంధకారమా । ర్తాండునకున్ ముకుందునకు
దండముఁ బెట్ట వలె న్మదంబునన్॥ క॥ కరము లురమ్మును భుజములు
చరణములు లలాటమును వె ♦ సన్ ధర దగులన్ । నరుఁడు హరి
సాష్టాంగం । బురుతరసద్భక్తిఁ జేయు ♦ టుచిత మగుఁ జుమీ॥ క
పూజావసానమున నం । భోజాక్షున కెదుట నిలిచి ♦ ముకుళితహస్తుఁ
డై జనుఁడు వేఁడవలె న । వ్యాజం బగుభక్తి నొసఁగు ♦ మని యీరా
తిన్॥ శా॥ ఏలోకంబున నెట్టిజన్మమున నే ♦ నేరీతితో నున్న నె। వ్వే
న్నామది బాలభాస్కరవిభా ♦ విర్భావదీవ్యత్ప్రయో। జాళీకోమలకాం
కాంతభవదీ ♦ యాంఘ్రిద్వయీభక్తి యు । త్తాలంబై తగు నట్లు
చేయుము ముకుం ♦ దా దేవచూడామణీ॥ ఉ॥ జారిణి యైనభామినికి
జారునిపై బలె లోభికిన్ విన । ష్టోరుధనంబునందుబలె ♦ నోదనుజ
తక చక్రమార్గణాం । భోరుహమీనచాపదర ♦ ముఖ్యసురేఖలత్
వెలుంగునీ । చారుతరాంఘ్రి నామనము ♦ సంతతముం దగులంగ
జేయవే॥ మ॥ ధనమున్ ధర్మము భోగకోటియును మ ♦ తర్కార్తాను
ణ్యంబుగా । నొనరింపం గలవాఁడ వౌట నివి ని ♦ న్నొక్కింతయు
వేఁడ మో । క్షనివాసస్థలి యైనతావకపదా ♦ బ్జద్వంద్వసద్భక్తి న
కనయంబుం గలిగించి ప్రోవు మని కృ ♦ ష్ణా నిన్నుఁ బ్రార్థించెదన్॥ క
ఇతరుల వేఁడ నెప్పుడు మ ♦ ఱెద్దియుఁ దెమ్మని నిన్నుఁ గోర నా । క
లితమోక్షనామకమ ♦ హార్భకగర్భభరాలసాలసాం । చితభవదీయ

దసర ♦ సీరుహాభక్తివధూమణిన్ గృపా । మతి దయసేయవే యనుచు ♦ మాటికి మాటికి నీకు మ్రొక్కెదన్॥ మ ॥ నిను వీక్షింపఁగఁ బూజసే యఁగను మ♦న్నింపంగ వర్ణించి వం।దనముల్ సేయఁగ ముఖ్యహేతు వగుచున్ ♦ వర్తించుచున్నట్టి త్వ। ద్వనజాతప్రతిమానపాదయుగసే ♦ వారూపసద్భక్తి నా । మనమం దెప్పుడుఁ బాయకుండ వరముం ♦ బ్రార్థించెదన్ మాధవా॥ మ॥ సకలస్థావరజంగమాత్మకజగ ♦ త్సర్గావనాంతంబులు । త్సుకతం జేయుమురారి భక్తికిని వ ♦ శ్యం డంచు వేదాంతముల్ । ప్రకటస్ఫూర్తిని జాటి చెప్పుట భవ ♦ త్పాదాబ్జసద్భక్తి మా । మకచిత్తంబున నిల్పు మంచును నినుం ♦ బ్రార్థించెదన్ శ్రీధరా॥ చ॥ కలుషసమేతుఁడన్ జడుఁడఁ ♦ గామయుతుండ శఠుండ మూర్ఖుఁడన్ । దెలియవు నాకు ధర్మములు ♦ దీనుఁడ నీభటుఁడన్ భవత్కృపా। విలసన మొందు దక్క మఱి ♦ వేఱె భవాబ్ధిఁ దరింప సాధన । మ్ములు నెఱుఁగం గృపామతిని ♦ బ్రోవు జనార్దన దైత్యమర్దనా॥ సీ॥ అజ్ఞానతిమిరగృ ♦ హద్దేహవర్తికిఁ, బ్రబలదీపంబు నీ ♦ పాదభక్తి । మోక్షనామకసౌధ ♦ మునకెక్క నరులకు, భవ్యనిశ్రేణి నీ ♦ పాదభక్తి । భవభయాంభోనిధిఁ ♦ బడ్డమానవులకుఁ, బరమనౌక యగు నీ ♦ పాదభక్తి । తాపత్రయోజ్వలా ♦ తపతప్తజనులకుఁ, బథిగతద్రుమము నీ ♦ పాదభక్తి॥ తే.గీ॥ పాతకవ్రాతవృష్టిసం ♦ పాతభీత । పంచజనులకు గొడుగు నీ ♦ పాదభక్తి । గాన నిను వేఁడుకొంటిని ♦ గరుణతోడ । దాని నా కిచ్చి రక్షింపఁ ♦ దగు ముకుంద॥ క॥ ఈరీతిమాటిమాటికి । నారాయణమూర్తిఁ గాంచి ♦ నరుఁడు తదీయో । దారతరభక్తిసంపదఁ । గోరవలయు నొందు కోర్కె ♦ గూడదు సుమ్మీ॥ క ॥ గోపాలుపూజవేళను । దీపం బాఱినను మరల ♦ ద్విగుణితసుస్నే । హోపేతముగను దీపము । కాపట్యము లేక పెట్టఁ ♦ గావలయుఁ జుమీ॥ ఉ ॥ ఆతరువాతఁ జక్రధరు ♦ సంగనపాలికిఁ బోయి మ్రొక్కి సం । ప్రీతిని గొంతసే పచటఁ ♦ బెద్దలఁ గూడి వసించిలేచి కం। జాతదళాక్షు నింటికి వె ♦ సన్ వలగొంచుఁ బ్రసాదముఖ్యముల్ । చేతు

లతోడఁ బట్టుకొని ♦ చేర వలెన్ నిజగేహసీమకున్॥ తే. గీ॥ వినుము
నూ అపరాధముల్ ♦ విష్ణుపూజ । సేయుతఱిఁ గల్గు వానిని ♦ జేర
నీక । భక్తిఁబూజింప వలె నని ♦ పద్మగర్భుఁ । డానతిచ్చెను నారద ♦
మౌనితోడ॥ తే.గీ॥ భక్తిసంయుక్తుఁ డగువాఁడు ♦ పద్మనాభు । నర్చ
నము సేయుచో నిమ్మ♦హాపరాధ। శతము గల్గిన నవి యెల్ల♦సత్కృతమ్ము
లంచుఁ దలపోసి వాని ర ♦ క్షించు నతఁడు ॥క॥ అపరాధక్షమ సేయు
నుఁ । విపులగుణావళు లొసంగి ♦ వెలయును భగవ। త్కృప గలిగించును
హరిభ । క్తిపటిష్ఠత తరము గాదు ♦ కీర్తించుటకున్॥ చ॥ వలదు విధా
నముల్ కుసుమ ♦ వర్గ మనర్ఘశమంత్రతంత్రముల్ । తులసియు దీపికావ
ళులు ♦ ధూపము సంస్తుతి యంగరాగమున్ । జలము ఫలంబు మూల
ములు ♦ సర్వము నేటికి విష్ణుపూజకున్ । విలసితభక్తి యొక్కటియె ♦
వేయు విధంబుల వన్నెఁ గూర్చెడిన్॥ తే. గీ॥ భక్తివిరహిత మగుపూ
జ ♦ పత్త్రికికిని । జేటటంచును బెద్దలు ♦ చెప్ప విందు। భక్తి గలవాని
కేటికిఁ♦బత్త్రి రహహ । వెన్నుఁ డెప్పుడు నతనికన్ ♦ సన్నఁదిరుగు॥
తే. గీ॥ బలికి ద్వారికుం డయ్యె ♦ ఫల్గునునకు । నశ్వచోదకుఁడ
య్యెధ ♦ ర్మాత్మజునకు । మంత్రి యయ్యును గాదె శ్రీ ♦ మాధవుండు।
భక్తవత్సలబిరుద మే♦ర్పడ వహించె॥ తే.గీ॥విప్రనారాయణునకును♦వెల
వెలందికకట కుంటెనకాఁ డయ్యె♦నంతకంటెఁ।గాని పని యేమిగలదు
లో ♦ కంబునందు। రంగనికటాక్ష మెన్నఁ ద♦రంబె చెప్పుము॥ వ ॥ ఇది
యాగప్రకారం బేతత్తాపపుండ్రనామమంత్రయాగంబులు గలిగించు
కొనువాఁడు కరణత్రయప్రపన్నుండై వైష్ణవసంఘంబులోఁ బరిగణి
తుం డగు నని రామానుజుండు శిష్యులకుం జెప్పిన ప్రకారంబు సూ
తుండు శౌనకాదులకుం దెలిపి వెండియు ॥ అంత్యానియమఘటితముక్త
పదగ్రస్తోత్పలమాల ॥ దుర్జనభీమ భీమనిభ ♦ దోర్బలవైరివిరామ రా
మహా । దోర్జితభక్తనిర్జితస ♦ ముజ్జ్వలమారుతిసోమ సోమసం। తర్జకనిత్య
సిద్ధసుకృ ♦ తప్రజపూరితధామ ధామవీ । ర్యార్జితహేమ హేమకు

భృ♦ దంచితధైర్యధరప్రభూత్తమా॥అత్యంతనియమఘటితషోడశవిధకంసము॥ లీలావిశాల పండిత । పాలా బాలహారిలోల ♦ పాపవిఫాలా । లాలితకపోల భాసుర। ఫాలా శీలగుణమూల ♦ భవ్యనృపాలా॥ లయగ్రాహి॥ నీలగళఫాలభవ ♦ కీలిఘృణినూలిధృధ ♦ కాలరుచిజాలయుత ♦ హాలహాలకీలా । భీలకరవాలఘన ♦ శూలచయఖేలదిషు ♦ పాళిహతిచాలితక ♦ రాళివిమతేలా। పాలబలపాలయుత ♦ శైలజతమాలవట ♦ తాలసురసాలముఖ ♦ సాలచయమూలో।న్మూలననిరాళతుర ♦ గాలఘువిశాలతర ♦ లోలపటువాలమగు ♦ దాళి నృపహేళీ॥

గద్య॥ఇది శ్రీమదుభయకవిత్వ రచనానల్ప చాతుర్య కొటికలపూడివంశ కమలవనసూర్య హరితసగోత్రధుర్య జ్యోతిషాగమాచార్య శ్రీమన్నారాయణ చరణాంబుజధ్యానగతస్థైర్య సకలమత వేదాంతసిద్ధాంతానివార్య వేంకటకృష్ణమ్మ సోమయాజి కుమారవర్య కోదండ రామయార్య కార్యంబైన ప్రపదనపారిజాతం బనుదివ్యప్రబంధంబునందు

తృతీయాశ్వాసము.

శ్రీరఘుమార్పణమస్తు.



శ్రీరస్తు

# ప్రపదనపారిజాతము.

## చతుర్థాశ్వాసము.

శ్రీ జలజముఖీపాదాం । భోజతులాకోటినినద ♦ ముఖరితసదన ।
భ్రాజ మహారాజశ్రీ । రాజా శ్వేతాచలపతి ♦ రంగారాయా॥ వ॥ అవధరిం
పుము సూతుండు శౌనకాదులం గనుంగొని యిట్లనియె నట్లు రామా
నుజాచార్యుండు శిష్యులం జూచి మఱియును ॥ తే. గీ॥ పంచసంస్కా
రములును గ ♦ ల్గించుకొన్న । మీఁదఁ బాపం బొనర్పక ♦ మెలఁగువాఁ
డు । చిదచిదీశ్వరతత్త్వవి ♦ శేషములును । దెలియ వలయు గురుస్వామి ♦
వలన నపుడు॥ క॥ తత్త్వత్రయంబు దెలిసిన । సాత్త్వికునకుఁ గాని ము
క్తి ♦ సమకూడమిఁ ద । త్తత్త్వముల మూఁటి మీ కతు । లత్వరతోఁ
జెప్పెదను జె ♦ లంగుచు వినుఁడీ॥ తే. గీ॥ తన్నెఱిఁగి తనకుఁ గలబా ♦
ధక మెఱింగి । తన్నివృత్తి యొనర్చునా ♦ తని నెఱింగి । తత్పదప్రాప్తి సే
యుసా ♦ ధన మెఱింగి । తత్ఫలము దెలియ వలె మే ♦ ధావి పిదప॥ వ॥
కావునఁ దొలుత జీవప్రకారం బెఱింగించెద వినుం డని యిట్లనియె॥
క॥ మేనులవలె దేవమను । ష్యానోకహభేద మింము ♦ కైనం గలుగమిఁ ।
జ్ఞానాదిధర్మతౌల్యము । చే నేకత్వంబు గలదు ♦ జీవుల కెల్లన్॥ క॥ ఆపా
దమస్తకంబును । వ్యాపించుటఁ జేసి యతఁడు ♦ వ్యాపి యనంగా । నోపు న
ధికాల్పతర దే । హోపేతుం డయ్యు సామ్య ♦ మొంది సముఁడగున్॥ క॥
జననజరామరణాదులు । తనువునకుం గాని లేవ ♦ తనికిఁ బ్రకృతిక । న్న
ను వేఱై తద్గుణములఁ । గొనమి నతఁడు నిర్గుణాఖ్య ♦ కుం బాత్రుఁ డగున్॥
క॥ జ్ఞానగుణసమన్వితవి । జ్ఞానమయాణుస్వరూప ♦ సహితుఁ డతఁడు
స్వా । ధీనశరీరేంద్రియవిభుఁ । డై నెగడు నతండు ♦ శుద్ధుఁ ♦ డమలినుఁడు

సుమీ॥ క॥ కరవాలంబులచేత । న్నఱుకఁబడఁడు జలముచేత ♦ నశియిం
పఁడు బం।ధురవహ్ని నైనఁ గాలఁడు । పురాణపురుషుండు వాఁడు ♦ పూ
ర్ణుఁ డొడలిలోఁ॥క॥తనువునకుం బ్రాణేంద్రియ।మనమ్ములకు భిన్నుఁ డ
గుచు ♦ మఱియు మకారా । ఖ్యను బొంది హరికి శేషం। బనఁ బ్ర
కృతికి శేషి యనంగ ♦ నాత్ముఁ డగుఁ జుమీ॥ తే. గీ॥ కర్తఫలభోక్త సం
కల్ప ♦ కర్త పంచ।వింశకుండు నహంకార ♦ వేద్యుఁ డఖిల। బోధసహి
తుండు నిగమాంత ♦ బోధ్యుఁ డుపచ। యోపచయశూన్యుఁడై జీవుఁ ♦
డొప్పు జగతి॥ ఉ॥ కాఁడు సుపర్వుఁడున్ నరుఁ డ ♦ గంబు మృగంబును
బక్షి కీటమున్ । గాఁడు నపుంసకుండు ధరఁ♦గంజదళాయతనేత్ర మర్త్యుఁ
డున్ । గాఁడు శరీరమున్ మనము ♦ కర్మము నింద్రియకోటి బుద్ధియున్।
గాఁడు హృదంతరాళమునఁ ♦ గన్పడు వీనికి భిన్నుఁడై తగన్॥ మ॥
అమలుం డాద్యుఁడు దుఃఖశూన్యుఁడు పరుం♦డానందవంతుండు జ్ఞా।నమ
యుం డచ్యుతుఁ డంతవర్జితుఁడు స♦న్మాన్యుండు ధన్యుండు శ్రీ। రమణా
త్యంతహితుండు తన్మయుఁడు త ♦ త్ప్రాప్యుండు తద్దాసుఁడై।యమరుం
జేతనుఁడాతనిం బొగడ శ♦క్యం బౌనె యెవ్వారికిన్॥ తే. గీ॥ అన్నివే
ళల సమముగా ♦ నలరువాఁడు।మోక్షఖని నైనవాఁడు ప ♦ ద్మాక్షున
కును।దాసుఁ డగువాఁడు ప్రాకృత ♦ ధర్మ మొకటి। నైన లేనట్టివాఁడు
మ ♦ హాత్ముఁ డాత్మ॥క॥ జ్ఞానానందమయం బణు। వైనది రూపంబు
ధర్మ ♦ మగుఁ దజ్జీవ। జ్ఞానము సర్వవ్యాపక। మై నెగడు నటంచుఁ
దెల్పు ♦ నాగమవితతుల్ ॥తే.గీ॥ మొగులు గప్పిన వెన్నెల ♦ మగుడు
నట్లు। ప్రకృతి గప్పుటచే వాని ♦ ప్రబలబోధ । కొంచెపడి యది
తానను ♦ కొనుచు భ్రాంతి। చేతఁ జేడ్పడుచుండును ♦ జీవుఁ డకట।
చ॥ అనలముచేతఁ దప్తమగు ♦ నట్టిఘటంబునఁ గల్గునీళ్ళకుఁ ।
ఘనతరబుద్బుదాదికము ♦ గల్గుగతిం బ్రకృతిస్థితాత్మకుఁ । జననము వార్ధ
కంబు మృతి ♦ సౌఖ్యము దుఃఖము ముక్తి బంధమున్ । మనుజసుపర్వ
భావ మవ ♦ మానము మానము గల్గు మాటికిఁ॥ శా॥ జ్ఞానానంద

సమన్వితుం డగుచు భా ♦ స్వద్బింబమట్లొప్పు వి। జ్ఞానాకారున కాత్మ
కీప్రకృతితో ♦ సాంగత్యమున్ గల్గుటన్ । దీనత్వం బుదయించి కుంభ
విలస ♦ ద్దీపంబుచందంబునన్ । హీనుండున్ జడుఁడున్ మృతుం డగుచి
యున్ ♦ హేయుండు నయ్యెం జుమీ ॥ మ ॥ అవివేకాన్వితు లైనమ
ర్త్యులు విశు ♦ ద్ధాచార్యశక్తిన్ వివే । కవిశిష్టాత్మకు లైనరీతి జడమై♦
కన్పట్టు దేహంబు న । కువితానంబు మనంబు చిత్తమును వి ♦ జ్ఞానా
శ్రయప్రాణిచేత వడిన్ జ్ఞానసమన్వితాకృతిఁదగున్ ♦ దత్తత్త్వ మూహిం
చినన్ ॥ తే.గీ॥ ధరఁ జతుష్కోణతయు నుష్ణ ♦ తయు నయఃకృ । శాను
లకుఁ బోలె దేహికి ♦ మేనునకుఁ బరస్పరోపాధులను స్వధ ♦ ర్మములు
వ్యత్య । యంబు లౌటను బొడమె దే ♦ హాత్మబుద్ధి ॥ సీ ॥ తాను విజ్ఞా
నమ ♦ హానందమయుఁ డయ్యు, నకట జీవుఁడు నిజా ♦ నాదికర్మ । వాస
నారూపమై ♦ వఱలునవిద్యచే, సంకుచితాత్మవి ♦ జ్ఞానుఁ డగుచు । స్వస్వ
రూపంబు ప ♦ రస్వరూపంబును, దెలియఁ జాలక దుఃఖ ♦ జలధి
మునిఁగి । కర్మానుగుణ్యంబు ♦ గా హరిసంకల్ప, కల్పితప్రాకృతాం ♦ గంబు
చేత ॥ తే.గీ॥ బద్ధుఁ డగుచును భ్రాంతిచే ♦ బంధనప్ర । ధానదేహం బె
తానుగాఁ ♦ దలఁచి యింద్రి । యప్రజాధీనబుద్ధి య ♦ నర్హవిషయ ।
దత్తసౌఖ్యంబు నగుచు మ ♦ ర్దశలఁ బొందె ॥ తే.గీ॥ త్రాఁచు గఱచిన
తఱి నింబ ♦ దళము మధుర । మైనగతి హేయతరవిష ♦ యముల
జనుఁడు । తనకు భోగ్యంబు లనుచును ♦ దలఁచి వాని । కొఱకుఁ
గర్మంబు లొనరించి ♦ కుడుచు ఫలము ॥క॥ ఫలముకొఱకుఁ గర్మం
బులు । సలుపుచు ఫలభుక్తి సేయు ♦ జనులకుఁ గర్మం । బులు తత్తద్వా
సనలును । కొలఁది మిగులు నంతకంత ♦ కుం బ్రబలములై ॥ వ ॥ అది
యెట్లనిన ॥ తే. గీ॥ రాసభమనుష్యముఖ్యజ ♦ రాయుజముల । సర్పవి
హగాదిసకలాండ♦జములఁ దరుల । తాదికోద్భిజ్జములను యూ ♦ కాది
ఘర్మ । జలజములఁ బుట్టుఁ గర్మవ ♦ శమునఁ బ్రాణి॥క॥ ఒకమనుజజన్మ
మునఁద । క్క కడనుజన్మముల సుకృత ♦ కలుషమ్ములఁ బొం । దక సుఖ

దుఃఖఫలంబులఁ । నకటా జీవుండు గుడుచు ♦ నజ్ఞతచేతన్ ॥ తే.గీ॥ విను
మవస్థాత్రయములోన ♦ విషయభోగ । మైన లేదు సుషుప్తియం ♦
దట్టివేళ । దక్కఁ దక్కిన రెండవ ♦ స్థలను దేహి । కర్మఫలములఁ గుడు
చుచుఁ ♦ గడుఁ గృశించు॥ వ ॥ మఱియునుం బూర్వజన్మకర్మఫలభోగావ
సానంబున నవశుండై స్వర్గనిరయంబులు వెలువడి క్రమంబున లింగశరీ
రంబుతో నిస్సంబోధుండై భూలోకంబున కరుదెంచి దైవవశంబున
భక్షణపదార్థంబులతోడఁ బురుషగర్భంబునం జొచ్చి సర్వాంగవ్యాప్తం
బైనతదీయశుక్లంబుతోడం గూడి నిజలింగశరీరగతాపంచీకృత భూతం
బులు పంచీకరణాభిముఖంబు లౌనంతకు మాసత్రయంబుకొలంది నచ్చో
నధివసించి యనంతరం బార్తవప్రవర్తి తమద్గంధబంధురశోణితవ్యాప్తం
బైనవధూగర్భకుహరంబున రతిసమయమంబున శుక్లంబుతోడఁ బురు
షమేహనదండనిర్గతుండై యోనిద్వారంబునం బ్రవేశించి తద్రక్తసం
యోగరూపనిమిత్తకారణ సంపత్తి కలుగుటవలన షణ్మాసపర్యంతంబు
నిజలింగదేహంబు క్రమంబుగాఁ గలిలపిండాంకురాస్థి చర్మకేశరూపపరిణ
తంబగునంతకు జడప్రాయుండై సప్తమమాసప్రారంభంబువఱకు నుసిద్ధశరీ
రుండై సుషుప్తజనుం డుత్థితుండగుమాడ్కిఁ బరిపూర్ణజ్ఞానంబు సంభ
వించిన నతిహేయజరాయుపూతిగంధమిళితమాతృ మలమూత్రదుర్వా
సనలకు రోయుచు జననీదుర్వారజాఠరవైశ్వానరోష్ణిమమునకు వెఱచు
చు విఱిచి కట్టఁబడినవానివిధంబునఁ గాలుం గేలు మొగంబుం గదల్పం
జాలక యంధకారధురంధరం బగుట నెద్దియు వినిం జాలక వచియింప
శక్తుండు గాక మాతృభుక్తకట్వామ్లలవణోష్ణాదిపదార్థంబులవలనఁ గుసు
మకోమలం బైనతనలేఁతమేను తపింప నులుకుచుఁ బూర్వజన్మ శతజ్ఞాన
సంపన్నుం డగుట జననాంతరంబున మరల నిట్టిదుఃఖంబు రాకుండ భగ
వత్ప్రాపదనం బొనరించెద నని యాసచేత నిమిషంబు యుగంబుచందం
బున నంమఁ గాలక్షేపంబు సేయుచు నల్పవివరస్థితుం డగుట నూపిరులు దిరు
గక యేకాకి యగుట నెద్దియుందోఁపక యల్పం బైనయోనివివరంబువలన

నెట్లు వెలువడుదు నెన్నఁడు వెలువడుదు నెవ్వఁడు దిక్కగు నేమి సేయుదు నీఘోరనరకంబు నిస్తరింప నెద్ది యుపాయం బని చింతించుచు జన్మార్థంబు దైవప్రార్థనంబు సేయుచుండ నంత నవమాసంబులు నిండిన దైవ ప్రేరితంబై గర్భ గతార్భ కశరీరసంకోచక కార్యస్ఫురద్ప్రాహిణానిలం బుద్భవంబై రజకుండార్ద్ర వస్త్రంబునులుపుచందంబున సర్వావయవంబులం బిసికి సంకోచం బొనరించుతఱిఁ బ్రాజాపత్యాహ్వాయ ప్రసూతిమారుతం బుత్పన్నంబై యధోముఖంబుగాఁ బొరలించి జరాయుసమేతంబుగాఁ దన్ను దుర్గంధపూరితాల్పతరమాతృయోని ద్వారంబు వెంబడి శతఘ్నికాంతగర్గతాయసగోళంబులను దదంతర్గతకృతకానలజ్వాలలు వెడలించుచందంబున బిగ్గన బహిర్గతుం గావింప నవ్వేళ వికలితశరీరుండును విశీర్ణావయవుండును వినష్టేంద్రియుండును విధ్వస్తజ్ఞానుండును నై మరణసమయంబునంబోలె మూర్ఛ మునిఁగి సకలజన హేయజరాయురక్తజలంబులలోఁ గూడి నిజజననికి మరణావస్థాఁదృశాయాసంబు చేయుచుం బ్రాణి యుత్పన్నుండై బాహ్యానిలకుఠారధారావిదళితనిజజ్ఞానుం డగుట జడప్రాయుండై మొఱవెట్టు నని గర్భనరక ప్రకారంబుఁ జెప్పి మఱియు నిట్లనియె ॥ సీ ॥ జనియించు బిదపఁ ద ♦ చ్చాండాల మెల్లను, గడఁగి పొత్తికలలో ♦ నిడినపిదప మలమూత్రములలోన ♦ మగ్గుచు నాఁకలి, నొప్పి దప్పియుఁ గల్గి చెప్ప లేక । యవశుఁడై యేడ్చుచు ♦ నంగంబు నల్లులు, చీమలు నీఁగలు దోమ లెపుడుఁ।గఱచుచో వారింపఁ♦గా లేక కనియును,వినియును దె యక ♦ వేఁడి నీళ్ళ॥ తే. గీ॥ మంచఁ బోసినచో భీతిఁ ♦ గుందుచును గ రుద్ధరుజలను బల్మాఱు ♦ బద్ధుఁ డగుచు । హేయతర మైన స్తన్యంబు నింపుతోడఁ।గొనుచు నతిశైశవమునందుఁ ♦ గుందుఁ బ్రాణి॥ శా॥ వాఘ్రాధీశునిఁ గాంచులేడిగతిఁబా ♦ పాత్మున్ గురున్ జూచుచో।శిక్షా బెచ్చుటకైనఁ బొఱుచును ని ♦ స్సీమంబులై నట్టిజి। హ్వాఘ్రాణేంద్రిం భోగ్యముల్ గనినఁ దె♦ మ్మంచున్ గృహంబందు ని। వ్యాఘ్రాసంబు

నేర్పుచుం జనుఁడు దా ♦ వర్తించు బాల్యంబునన్॥ శా॥ ఏదీ సౌఖ్యము
బాల్యమందున ధరి ♦ త్రీశాత్మజుం డైన మ। ర్యాదావర్జితకార్యకోటులు
జడుం ♦ డై చేయుచుఁ మాత్రపి । త్రాదిత్యుద్రకశాభిఘాతములచే ♦ నా
యాసముం బొందుచున్ । దాదుల్ బుగ్గలు గిల్లి కూ డిడిన సం ♦ తా
పించుచున్ నిల్వఁగన్॥ ఉ॥ ఆఁకలిబాధ వోవుటకు ♦ నన్నము మన్మథ
బాధఁ దీర్పఁ గాం।తాకటుగంధగాత్రమును ♦ దప్పి దొలంపఁగ శీతవారి
రో । గాకులవృత్తిఁ బాపుటకు ♦ నౌషధముంబలెఁ గానిపించెడిం । గాక
సుఖప్రదంబు లనఁ ♦ గాఁ దరమే కర మెట్టివానికిన్॥ తే. గీ॥ సకలస
ద్గుణముల పోక ♦ జాడ్యగర్వ। మదములను బిల్చుకూఁక కా♦మ ప్రభావ।
చంద్రబింబంబునకు రాక♦సద్గుణముల । కనయమును గట్టికాఁక జ♦వ్వన
మురాక॥సీ॥హాలారసంబు నిం ♦ డారఁ ద్రావినవాని, మాడ్కి నూరక మ
దో♦న్మత్తుఁ డగును । నంధకారము గప్పు ♦ నట్టిరాతిరిఁ బోలె, గర్వంబు
చేఁ గన్ను ♦ గాన కుండు। బ్రహ్మరాక్షసి తన్నుఁ ♦ బట్టికొన్నట్టిచం,ద
మునఁ బెద్దలఁ గాంచి♦ తప్పఁ బలుకు।నల్లమందు భుజించు♦నరునట్ల
యువవధూ, రక్తచిత్తుండై ప ♦ రాకుఁ బూను॥ తే. గీ॥ హు ష్మనును
జొమ్ముఁ జూచు భు♦జమ్ము బిగ్గ। నులుచు వెకవెక నవ్వు భా ♦ మలను
వేడ్కఁ।బలుకరించును దాఁటును ♦ బాడు నాడు।జవ్వనము గప్పుతఱి నె
ట్టి♦సజ్జనుండు॥ చ॥ ధనములు లేక భోగసము ♦ దాయము గల్గదు తద్ధ
నంబు పా।ర్జన మొనరింపఁ జాలమి ని♦ రంతరమున్ బహుభోగకాంక్షచే।
మనము చలించుచుండుటను♦మర్త్యుఁడు యౌవనవేళ సంతతం।బును బ
హుదుఃఖవారినిధి ♦ మున్గి చరించు సుఖంబు గాంచునే॥ఉ॥ తల్లినిగొట్టు
నన్నలను♦దమ్ములఁ దప్పవచించుఁదండ్రిపైఁ। ద్రుళ్ళిపడున్ సహోదరి స♦
దోష వటంచు వచించు భార్యపై।నుల్లముఁ బెట్టుఁ గ్రొంజదువు♦లొల్లఁ
డు పుష్పధనుశ్ఛ్వతోజ్జ్వల।ద్భల్లపరంపరాభిహత ♦భావసమేతుఁడు జవ్వ
నంబునన్॥ మ॥ పరభామారతి కష్టసాధ్య మనుచున్♦బై తామహాం బై
నయు।ర్వర సర్వంబును విక్రయించి వెలయాం♦డ్రం జేర్చి తద్యోని

మం। టిరనిష్యందిమహోగ్రరోగములచే ♦ దేహంబు దుఃఖవ్రజా।కరమై యుండ దరిద్రుఁడై వదరు సౌ ♦ ఖ్యం బేది ప్రాయంబునన్॥ తే. గీ॥ ఇట్లు దుష్కర్మములఁ గాల ♦ మెల్లఁ బుచ్చు।నవసరంబున మల్లికా ♦ హారహీర। చారుచామరనిభ కేశ ♦ సహితమైన।వార్ధకము వచ్చు యౌవన ♦ స్వర్గి యగుచు॥ ఉ॥ మింటికిఁ గాలు చాఁచుచును ♦ మిత్తికి ముద్దు లొసంగుచున్ రుజల్। బంటుతనంబుతోఁ గొలువ♦భామిను లెల్ల హసింపఁ గంపము।గంటకముల్ వళుల్ సకల ♦ గాత్రములన్ గనుపట్ట వెల్లనై।కంటి విలోమముల్ గదల♦గాసిలు వృద్ధుఁడు దుఃఖియే కదా॥ తే. గీ॥ పండ్లు డుల్లుటచే ముఖ ♦ పాటవంబు। దప్ప లోపలిమంద స్మి ♦ తంబు వెడలి। తనువునిండను జెదరుచం ♦ దమున వెల్ల। వెంట్రుకలతోడఁ గనుపట్టు ♦ వృద్ధుఁ డకట॥ తే.గీ॥ పుడమిఁ జలి లేని తటి నైన ♦ నొడలు వణఁకు। దినుబడులు చూడ నపు డైనఁ ♦ దేప గాఱు। సుఖము గలయప్పుడును గంటఁ♦జూపు నీరు। వృద్ధునకు విద్యపై నెట్లు♦శ్రీద్ధ గలుగు॥ తరల॥నిమర పట్టదు తిండి తగ్గును♦నిల్వఁ జాలఁడు దంతముల్। కుమరు దప్పను జెవుదు గ్రిమ్మును♦గుర్డి వచ్చును బొక్కుచున్। వదరుచుండును నింటిలోపలి♦వారు దిట్టిన దుఃఖియై। హృదయమందఁ దపించువృద్ధున♦కేది రా సుఖ మయ్యయో॥భుజంగప్రయాతము॥శరీరఁబునన్ సర్వ ♦ సంధుల్ విడన్ దు।ష్కరం బైనదుఃఖఁబు♦సంప్రాప్త మయ్యన్। హరింజిత్తప ద్మంబు♦నం దించు కైనన్। స్మరింపండు వృద్ధుండు♦మర్యాద యేదీ॥ఉత్సాహవృత్తము॥ నరము లెల్ల బయలు దేఱ♦నవ్వఁ బుచ్చు మోమునన్। బరులు కరముఁ బట్టి రేనిఁ♦బైకిఁ బోవ లేక యె। వ్వారయినఁ గనుపింపఁ దొంటి♦వర్తనంబుఁ జెప్పి దు। స్తరపుటార్తిఁ గుందువృద్ధు♦జన్మ మెంత వ్యర్థమో॥ వ ॥ ఇట్టిబాల్యకౌమారయౌవనవార్ధకదశలయందొక్కసమయంబున మృత్యుదేవతా గూఢకృతాణనిపాతం బగునప్పుడు వాతార్శో మేహభగందరా శ్మరీగ్రహణీ కుష్ఠపాండుక్షయ ప్రముఖామయంబుల వాతపైత్య శ్లేష్మో ద్రేకరూపం బైనసన్నిపాతంబుచే జనుం

డు గృహీతుండై మలమూత్రంబులచేత నంబరంబులం దడుపుచు వ
దనంబు దిరుగ దేహంబు కంపింప నాలుక తొట్రుపడ నయనంబులు
వైరూప్యంబు వహింప మనంబు వికలత్వంబుఁ జెంద నరంబులు తెగి పడ
నెముకలయందు సంధులు విడుచుండ జర్జరితగాత్రుండును స్వేదపరిపూ
ర్ణుండును నై పొక్కుచుం బెదరిపడుచుఁ బలవరించుచు నేడ్చుచుఁ దన్నుఁ
గూర్చి దుఃఖించు బంధుజనుల రోదనంబుల కులుకుచు దారపుత్త్రాదులం
దలఁచి చింతించుచుఁ మూర్ఛిల్లుచుం దెప్పిఱుచుఁ గంఠంబు శోషింప
శ్లేషంబు గ్రమ్మ శరీరంబు శుష్కింప వదనంబు వాడ నూర్పులు నిగుడ
నస్వాధీనాంగుండై యున్నసమయంబున నుద్దండగదా దండమండితా
ఖండభుజాదండంబులతో దండధరకింకరులు పఱతెంచి తత్సదృశకర్మ
కార్యాతివాహక దేహంబు గనఁ బఱచి యందుఁ బ్రవేశింపు మని
భీషణభాషణంబుల బెదరింప దైవమాయా సామర్థ్యంబునం జేసి
వ్యానానిలా నీతపంచ ప్రాణమనోబుద్ధి దశేంద్రియరూపం బైనలింగ
దేహంబుతో నుత్క్రాంతుండై పూర్వదేహంబు విడిచి తద్దేహంబునం
బ్రవేశించు నిది మరణావస్థా ప్రకారం బింక నిరయ దుఃఖంబులు
వినుం డని యిట్లనియె ॥ సీ ॥ క్రకచరౌరవమహా ♦ రౌరవాగ్ని స్తంభ,
పూయకుంభీపాక ♦ ములను ఘోర । వైతరణ్యసిపత్త్ర ♦ వనఘనతము
రికావ, టాదినారకకోటు ♦ లందుఁ బ్రళయ । సమయఫాలాక్షదృ♦
క్సదృశకరాళకీ, లాజాలముల శృంఖ ♦ లములతోఁడ । బడవైచి యమ
భటుల్ ♦ పట్టిసప్రాసగ,దాముసలముల ని♦ర్దయత మోదఁ॥ తే.గీ॥ గాక
గృధ్రశివావృక ♦ కంకసర్ప। భషకవృశ్చిక ముఖజంతు ♦ పటలి గఱచి।
కండలు పెగల్ప నమితదుః ♦ ఖములఁ జెందు।ప్రాణి కేదయ్యసౌఖ్యంబు♦
యమపురమున ॥ తే. గీ బహుజనో చ్ఛిష్టభూషణాం ♦ బరగృహాదిక
ములు ముదుసలి వెలయాండ్రు ♦ గలిగి శత్రు । భటుల కులుకుచు స్వప
తన ♦ భయము విడువ । నట్టిప్రాణికి సుఖ మెట్టు ♦ లమరపురిని॥ తరల॥
ఘనులఁ గాంచి మనంబులోపలఁ ♦ గ్రాఁగుచున్ దనపుణ్యముల్ । దినది

నంబు వశింపదానికు ♦ దీర్ఘదుఃఖముఁ బొందుచున్ ।జనుఁడు స్వర్గభవనం
బులోపల ♦ సంచరించుతఱింగృతాం । తునిభటుల్ సిగఁ బట్టి భూమి
కిఁ ♦ ద్రోచివైచెద రయ్యయో ॥ ఉ॥ స్వర్గమునుండి భూమికి ర♦వం బొన
రించుచుఁ జేరుప్రాణులన్ ।మార్గములోపలన్ దనుజ ♦ మండలి చేతులఁ
బట్టిపావకా । నర్గళకీలలంబచన ♦ మప్పుడ చేసి భుజించు చుందు రీ।
దుర్గతి చాలదే నరక ♦ దుఃఖము లింతకు భీతి సేయునే॥ ఉ॥ దుమ్ములు
మూత్రముల్ మలము ♦తొమ్మిదిచిల్లులపచ్చిశోలు ర। క్తమ్ము నరమ్ములున్
గఫము ♦ కండలు వాతము లాడి గుల్మిపై । త్యమ్మును గూడి కాదె
తను ♦ వయ్యెను దీనికి నెక్కుడైన హే।యమ్ము ధరిత్రిలోఁ గలదె ♦
యక్కట దీనికి వన్నె లేటికిన్ ॥ ఉ ॥ ఎప్పుడు చచ్చునో తెలియ ♦ దెట్టి
శరీరికిఁ జావు జన్మముల్ । దప్పదు జవ్వనంబును ధ ♦ నంబును నిత్యము
గాదు బంధుల్ । జెప్పఁగ నేల భోగములు ♦ జీవులకున్ విషయుక్తభ
క్త్యముల్ । గొప్పతనంబు సంసృతిని ♦ గుందుమనుష్యుల కెట్లు గల్గెడిన్ ॥
ఉ॥ కుక్కలు నిల్వవే పురిని ♦ గొక్కులు ధాన్యము సంగ్రహింపవే।
కొక్కెర మత్స్యకోటులను♦గూర్పదె ఘూకము రాజ్య మేలదే। కుక్కుట
పంక్తియుద్ధమున ♦ కున్ బిఱుదీయునె నల్లి మంచముల్ ।ద్రొక్కదె పీనిఁ
జూచియు న ♦ రుండు హరిన్ విడనాడ వచ్చునే ॥ తే.గీ॥ కంతమందుఁ
గృతాంతుండు♦కాల మనెడి । యురి దగిల్చి బిగించుచు ♦ నున్నవాఁడు।
దీనిఁ దెలియక మనుజుఁ డిం♦ద్రియసుఖములఁ । బాయక భుజించు భువిఁ
బశు ♦ ప్రాయుఁ డగుచు ॥ తే. గీ ॥ ప్రాకృతప్రళయమ్ములఁ ♦ బ్రకృతిగర్భ।
మందు నైమిత్తికప్రళ♦యముల విధిక । మండలువునందు దుఃఖని ♦
ర్మగ్నుఁ డగుచుఁ । బ్రాణి వసియించుఁదగ జడ♦ప్రాయముగను॥ మ॥ఇది
యేఁగూర్చు ధనంబు మజ్జనకుచే ♦ నేఁబడ్డ భర్మాదికం । బిది పైతామ
హసంచితం బిది తగ♦న్నేఁ క్షించియే కర్చఁ జే । సెద బేహారముఁ జేసి
పెంతు ననుచున్ ♦ జింతించుచో మర్త్యును । న్మదవృత్తిన్ గొనిపోవు
మృత్యువు మృగిన్ ♦ శార్దూలమట్లయ్యెడన్॥ చ॥ గడగడలాడుచున్

వణఁకుఁ ♦ గాయము మేన జనించుఁ జెమ్మటల్ । తడఁబడు నెమ్మనంబు గుఱి ♦ దప్పను గుత్తుక దీనుఁడై యొరుల్ । గడువడి వేఁడఁగాఁ జనుట ♦ కం టెను గానల కేగి పర్ణముల్ । గుడువఁగ రాదె యట్లయినఁ ♦ గొంచెపువాఁ డనునింద గాంచునే॥ తే. గీ॥ సన్నిపాతించువేళ యా ♦ చన మొనర్చు । సమయమున నొక్కగతి గుణ ♦ సమితి పోడము । నిట్టియాచకుఁబొమ్మని ♦ తిట్టుమదవి । ఘూర్ణితేక్షణుఁడై ధని ♦ కుండు భువిని॥ తే. గీ॥ భగవద నుభవజనితదీ ♦ వ్యత్సుఖముల । మానుకొని హేయవిషయని ♦ రగ్నుఁ డైన । వాఁడు చందనకాష్ఠముల్ ♦ వహ్నిఁ గాల్చి । బొగ్గు లమ్మెడిని ర్భాగ్యుఁ ♦ బోలి యుండు॥ చ॥ కరణకళేబరంబు లిడి ♦ కర్తము జ్ఞానము వేదవాక్యులం । గఱపి ధృతావతారుఁడయి ♦ కష్టము లెల్లఁ దొలంచు చున్నత । న్నరసి భజింపనట్టికుజ ♦ నాళికి హేయతరోరు యోనిపై । మెఱసెడుభోగ్యబుద్ధిఁ బొడ ♦ మించినచక్రి వలంతియే కదా॥ తే. గీ॥ ధర ణి నాధ్యాత్మికము లాధి ♦ దైవికమ్ము । లాధిభౌతికములును నా ♦ నల రుచున్న । ఘోరతాపత్రయార్తులఁ ♦ గుందుచుండు । నరుఁడు పరమపద మ్మునఁ ♦ కరుగుదాఁక ॥ క॥ ప్రకృతినిగృహీతుఁడగునరు । నకు విష్ణుఁడు తక్క రక్ష ♦ ణమునకు నన్యుం । డొకఁడును మఱి లేఁడుమునిను । తకమలలోచనునిఁ దెలియఁ ♦ దగును ముముక్షుల్॥ సీ॥ నారాయణుఁడు జగ ♦ న్నాథుండు బ్రహ్మత, త్త్వంబును గర్త యు ♦ త్తమపురుషుఁడు । ధ్యాతయు ధ్యానం బు ♦ జ్యోతిస్స్వరూపుండు, బాహ్యాంతరస్థుండు ♦ బ్రహ్మరుద్ర । నాయకుఁ డనుచు నా ♦ నానిగమాంతంబు, దెలిపెను మొదట న ♦ ద్దేవుఁ డొకఁ డె । గాని లేఁడు విరించి ♦ గరళకంఠుఁడు లేఁడు, లేదు రోదసియును ♦ లేవు భములు॥ తే.గీ॥ లేవు నీరము లగ్నియు ♦ లేదు చంద్రుఁ । డర్కుఁ డును లేఁడు సర్వంబు ♦ నతనివలన । నుద్భవం బయ్యెఁ బాలించు ♦ చుం డు వీని । నని మహోపనిషద్వాక్య ♦ మలరుచుండు ॥ తే.గీ ॥ విశ్వము సృజింపఁ దలఁచుచో ♦ విష్ణుఫాల । మందు జనియించె ఘర్మాంబు ♦ బిందుయుగళ । మందులో నొకదానఁ బ ♦ ద్మాసనుండు । పుట్టె వేఱొ

క్కటశివుండు ♦ పొడమె సుమ్మి॥ మ॥ మును నారాయణుచేత శంక
రుఁడు నం ♦ భోజాసనుం డింద్రుఁడున్ । వనజాతాప్తుఁడు సర్వదేవతలు
స ♦ ర్వజ్ఞానముల్ లోకవ। ర్తనముల్ పుట్టెను నందె డిందు నతఁడం♦త
ర్యామియై సర్వచే। తనులం ద్రిప్పు నటంచుఁ బల్కెఁదగ వే ♦ దంబుల్
నిజం బొప్పఁగన్॥ సీ॥ రజలఁ గొట్టుటచేత ♦ రుద్రుఁ డయ్యె మహత్త్వ,
దీప్తుఁ డౌటను మహా ♦ దేవుఁ డయ్యె । నీశనం బొనరించి ♦ యీశానుఁ
డయ్యె బృ, హద్వస్తువౌట బ్ర ♦ హ్మ యతఁడయ్యె । నతఁ డింద్రుఁ
డయ్యె మ ♦ హైశ్వర్యయుతుఁ డౌట, నిట్టులె శబ్దంబు ♦ లెల్ల విష్ణు।
పరము లటంచు సౌ ♦ పర్ణోపనిషదవా, క్యం బొప్పు వామన ♦ సద్గ్రంథ
యుగము॥ తే-గీ॥ పద్మభవచతురాస్యాది ♦ పదములును గ । పాలిభ
స్మాంగరాగాది ♦ పదములు విధి । శర్వులవి గాని తక్కిన ♦ శంకరాజ।
శివముఖపదంబు లెల్ల శ్రీ ♦ ధవుని వనియె॥ తే.గీ॥ వేదవినుతగుణా
ఢ్యుండు ♦ వేదమయుఁడు । వేదవేద్యుండు వేదని ♦ వేశనంబు । వేదముల
కన్నిటికిఁ గర్త ♦ విష్ణుఁ డనుచు । వేదములు పల్కెను నిరప ♦ వాదము
గను॥ క॥ వేదములుం దపములుచయ । నాదిమఖంబులును నిశ్చ♦య
జ్ఞానము ల । క్ష్మీదయితుపర మ టంచును । వాదం బొనరించి గెలిచె♦
వాల్మీకి తగన్॥ చ॥ వినుము సమస్తమానవులు ♦ వేల్పులఁ గొల్తురు
వేల్పు లెల్ల శ । క్రుని భజియింతు రింద్రుఁడును ♦ రుద్రుని గొల్చును
రుద్రుఁ డంబుజా । సను భజియించుఁబద్మజుఁడు ♦ శౌరిని గొల్చు నతం
డు కర్తయై । తనరుటఁ జేసి యీశ్వరుఁడు ♦ దైవము బ్రహ్మ మనంగ
భాసిలున్॥ ఉ॥ ధ్యానములుం దపంబుల వ్ర ♦ తంబులఁ బూజల నెల్ల
వేళలన్ । జ్ఞానమయుం బురాతనుని ♦ సర్వమయున్ సకలేశు విష్ణు నీ।
శానవిరించిశక్రముఖ ♦ సర్వసుపర్వులు చిత్తశుద్ధికై । మానుగఁ గొల్చు
చుందు రట ♦ మర్త్యులమాట వచింప నేటికిన్॥ సీ॥ ఆద్యంతవిరహితం♦
బచ్యుతం బమలం బ, నంతం బమేయంబు ♦ శాంత మజర । మవ్యక్త
మనఘం బ ♦ నణువు నస్థూలం బ, కృశ మదీర్ఘంబు సం♦కీర్తనీయ।ము

ను నిర్మలము జగ ♦ న్మూలంబు సత్యంబు, నిత్యంబు దివ్యంబు ♦ నిర్గు
ణంబు । విభువు సర్వేశంబు ♦ వీర్యశక్తిబలాది, షడ్గుణపూర్ణంబు ♦
శాశ్వతంబు॥ తే. గీ॥ ప్రకృతిజీవాంతరస్థంబు ♦ ప్రకృతిజీవ । గర్భితము
సర్వసేవ్యం బ ♦ ఖండసకల । మంగళగుణాన్వితము దివ్య ♦ మంగళాంగ।
మంతమై విష్ణుతత్త్వంబు ♦ వఱలుచుండు॥ తే.గీ॥ సకలజనయజనీయుం
డు ♦ చక్రధరుఁడు । సకలసత్కర్మఫలమండు ♦ జలజనాభుఁ । డఖిలలో
కైకకర్త జ ♦ నార్దనుండు । గాని విధిరుద్రముఖ్యులు ♦ గారు సుమ్ము॥ క॥
మనుజుఁడు కామముచే నై । నను దన్ను భజింప నిమ్మ ♦ నరసఖుఁడు
కృపా । వనధి యగుటఁ గామ్యము లి । చ్చిన మానిన మోక్షగతికిఁ♦
జేర్చు నిజము గాన్॥ శా॥ భానుండై వెలిఁగించు విశ్వము జగ♦త్ప్రాణా
కృతిం బ్రాణముల్ । నానాచేష్టల నొందఁ జేయు హరుఁడై ♦ నాశంబు
గావించు వా।గ్జానిత్యంబున సృష్టి సేయు జఠర♦ జ్వాలాకృతిం జంతు
భు । క్తానేకార్థములన్ బచించు జలమం ♦ డై శౌరి వర్ణించెడిన్॥ మ॥
భరియించున్ ఫణినాథుఁ డౌచు ధరణిన్ ♦ భర్జించుఁ గాలాకృతిన్ ।
నరులం జందురుఁ డౌచుఁ నోషధుల నా ♦ నందింపఁగాఁ జేయు శ్రీ । త
రుజల్ మాన్పును వహ్ని యౌచుఁ బటువై ♦ త్యశ్రేణులన్ ప్రోదిసీ ।
స్ఫురణన్ ద్రుంచును విష్ణుదేవుఁ డతనిన్ ♦ భూషింపఁగా శక్యమే॥ మ॥
రవిచంద్రానలవిద్యుదాదికములన్ ♦ రాజిల్లు తేజంబు శ్రీ । ధవు తేజం బని
యున్ దిలీపనలమాం ♦ ధాత్రంబరీషాదిరా।జవరైశ్వర్యము లెల్ల దైత్య
దమనై ♦ శ్వర్యంబు లంచున్ సుతీ । క్ష్ణవసిష్ఠాదులశక్తి శౌరి దనుచున్♦
వర్ణించు వేదాంతముల్॥ క॥ నరహరిగోపాలకముఖ । శరీరములమాఢ్కి
సుమ్ము ♦ సకలజగంబుల్ । హరికిన్ దేహము లనుచును । నరుఁడు దెలిసి
హింస వర్జ ♦ నము సేయ వలెన్॥ క॥ లీలార్థము సంకల్పము। చే లక్ష్మీ
శుండు సృష్టిఁ ♦ జేసి జగములం। బాలించును విలయించును । బాలునిచం
దమునఁ దోఁచుఁ ♦ బ్రభునిచరితముల్॥ సీ॥ గడగడలాడుఁ బ్రా ♦ క్క
ర్మాధిదేవత, హరినామకీర్తనం ♦ బాచరింప। భయముచేతను నుల్కి ♦ పడు

ను బ్రధానంబు, భగవంతుదివ్యరూ♦పంబుదలఁపఁ।గదలకుండఁగ నిల్చుఁ♦
గాలాఖ్యదేవత, యంబుజాక్షునిస్ఫూఁజ♦నం బొనర్పఁ।జదలవెంబడినిబ♦ర్వె
దరు యామ్యభటులు, నారాయణునిపురా ♦ ణములు చదువ॥ తే. గీ॥
హరికి వందన మొనరించు ♦ నవసరమున । భీతితోడను సంసృతి ♦ బెదరి
పాఱు।నహహ హరివంటిదైవంబు♦నతనిసేవ।వంటి సత్కర్మమును లేదు♦
వసుధలోన॥ తే. గీ॥ అఖిలవిశ్వంబు హరిదేహ♦మనియుఁదాను । హరికి
దాసుండ ననియుఁ ద♦న్నతఁడె కాని।శర్వముఖ్యులు రక్షింపఁ♦జాల రని
యు । నిశ్చయము సేయవలయు మ ♦ నీషి మదిని॥ మ॥ ప్రళయాంతం
బున గారణప్రకృతిగ♦ర్భంబం దచిత్ప్రాయులై । వెల లేనట్టిమహో
గ్రదుఃఖతతిచే ♦ విధ్వస్తులై యున్నప్రా । ణుల వీక్షించి కృపాతిరే
కమున నిం♦దుర్ సృష్టి గావింపఁగాఁ। దలఁచెర్ జీవపురాకృతంబు వెలి
గా♦ద్దైత్యారి మోదంబునర్॥ చ॥ తలఁచినయంతలోపల ను♦దగ్రతరా
బ్జభవాండభాండల । కులును సమస్తదేహములు♦సంభవ మాటను వా
నిలోన నా। త్తలఁగొని చొచ్చి విష్ణుఁడు ము♦దంబున రక్షణ మాచరిం
చుచుర్।గలుషసమేతులైనయెడ♦గ్రక్కున నందఱఁ ద్రుంచుచుర్ ద
గుర్॥ మ॥ తనకుర్ గార్యము లేక పోయిన నజాం♦తర్మగ్నసప్తాత్మలర్।
గని తొల్దొల్తనుసృష్టిఁ జేసి పిదపం ♦ గర్మానుగుణ్యంబులై । చను భో
గంబుల నిచ్చుచుర్ దురితముల్ ♦ సాంద్రంబులై తోఁచుచో । వనటం
జంపెడిచక్రి కెట్లు గలుగుర్♦వైషమ్యనైర్ఘృణ్యముల్ ॥ తే. గీ॥ హరికి
విశ్వంబు తనువౌట ♦ నంగి యైన । దనుజవైరికి నన్య మిం ♦ తయు
నుఁ గార్య।కారణావస్థలును లేమిఁ♦గాంచి చెప్పఁ । బడియె నద్వైతము
విశిష్ట♦భావమందు॥ మ॥ హరికంటెర్ జగ మెల్ల భిన్నమును ద ♦ థ్యం
బౌట మచ్ఛాస్త్రము । ద్వర నద్వైతము గాదు చక్రికిని వి♦శ్వం బం
గమున్ దేహి శ్రీ।ధరుఁ డంగాంగు లభిన్నులై పరఁగుటన్ ♦ ద్వైతం♦
బు గా దింక శ్రీ । హరి విశ్వంబులు రెంట నుండుట విశి ♦ ష్టాద్వైతమై
భాసిలున్॥ క॥ భేద మనిరూప్య మగుటను । భేద మభేదంబు లేక ♦ ప్ర

ధవీస్థలిలోఁ । బ్రోది విశిష్టాద్వైతము । నాఁ దనరున్ మనమతము
జ♦నమ్ములు పొగడఁగ ॥వ॥ మఱియు నపృథక్సిద్ధసంబంధంబు దేహదేహు
లకు నియతం బౌటఁ జేసి చిదచిచ్ఛరీరి యైనభగవంతునకును భగవచ్ఛ
రీరంబు లైనచిదచిత్తులకును నపృథక్సిద్ధసంబంధంబు ప్రసిద్ధంబై యుం
డుఁ గావున బాల్యశరీరంబు యౌవనశరీరంబునకుంబోలెఁ బ్రళయస
మయంబునఁ గలభగవచ్ఛరీరభూతసూక్ష్మ చిదచిద్ద్రవ్యంబు సృష్టి
స్థితికాలంబుల స్థూలచిదచిద్రూపంబులుగాఁ బరిణమించుటవలనను సూ
క్ష్మచిదచిద్విశిష్టుం డైనచక్రధరుండె స్థూలచిదచిద్విశిష్టుండగుటవలనను
శ్రీహరికి జగదుపాదానకారణత్వంబు శరీరద్వారకంబై సంభవించు నని
మఱియు నిట్లనియె॥ తే.గీ॥ ఆత్మసంకల్పమున విశ్వ♦ మాచరించి। యీ
జగంబులకు నిమిత్త♦ హేతు వైన। శౌరి శారీరపరిణామ♦శక్తిఁ జేసి।జగ
దుపాదానకారణం♦ బగుచుఁ దనరె ॥ తే.గీ॥ అఖిలవస్తువులకు నంత♦
రాత్ముఁ డగుట । నఖిలశబ్దంబులకు వాచ్యుఁ♦ డయ్యె శౌరి। దేహవాచక
శబ్దముల్ ♦ దేహియందుఁ । దెలుపరే కర్మకాండంబుఁ♦ దెలియు బు
ధులు ॥తే.గీ॥ కర్తయును భోక్తయును హర్త♦ కారకుండు । ప్రేరకుం
డనుమోదియుఁ♦గారణత్రయంబు రక్షకుఁడును బ్రభుం♦ డంగి యగు
చు।జగము పాలించుచుండును♦ జక్రధరుఁడు ॥ మ ॥ తనసంకల్పముచే
జగజ్జననవి♦ ధ్వంసాదికం బౌట శ్రీ। వనజాతాక్షుఁడు దుఃఖ గాఁడు
జగముల్ ♦ బ్రహ్మాదిజీవాళి త । త్తనుభూతంబు లనంగ నొప్పె నని త♦
థ్యం బెంచుచో హేయసం। గనిమిత్తంబును లేదు వాని కని వే♦
ద్యన్ వేదముల్ దెల్పెడిన్ ॥ మ ॥ కరుణాపూర్ణుఁడు భక్తవత్సలుఁడు
లో♦కస్వామి సర్వజ్ఞుఁ డ । క్షరసామర్థ్యసమన్వితుం డఖిలర♦ క్షాదీ
క్షితుం డైనశ్రీ।హరికంటెన్ మముఁ బ్రోవ నన్యుల కసా♦ ధ్యం బంచు
నూహించి త।చ్చరణంబుల్ శరణంబుఁ బొంద వలె ను♦త్సాహంబుతో
మానవుల్ ॥ క॥ పరమస్థానముఁ గోరిన । నరుఁ డంచితభక్తితోడ♦
నారాయణు శ్రీ। చరణాంబురుహద్వంద్వము। శరణముఁ బొందంగవలె

న ♦ సంశయబుద్ధిన్॥ క॥ హరిచరణకమలయుగళము। శరణముఁ బొందక
చరించు ♦ జనముల కెల్లన్ । బరమస్థానము దొరకదు। నరకమ్ములు వారి
సొమ్ము ♦ నం గనుపట్టున్॥ తే. గీ॥ శరణ మొందుటకంటెఁ గే ♦ శవునిఁ
జేర।మఱి యుపాయంబు లేదు భూ ♦ మండలమున । నట్టిశరణాగతుఁడు
దృప్తుఁ♦డనఁగ నార్తుఁ।డనఁగ రెండువిధంబుల ♦ నలరుచుండు ॥ తే.గీ॥
ఆర్తుఁ డనసహిష్ణుఁడు షడంగి ♦ న్యాసి నిర్భ । రుఁడునశక్తుఁడు శరణాగ♦
తుఁడు ప్రపన్నుఁ।డనఁగ నేకార్థబోధకం♦బగుస్వతంత్ర । భక్తిసాధ్య
ప్రపత్తి త♦త్ప్రదనంబు ॥తే.గీ॥సాధకుఁడు యోగిజనుఁ డుపా ♦ సకుఁడు
దృప్తుఁ । డును సహిష్ణుఁడు భజనస్థుఁ ♦ డును మఱియుఁ బ్ర । పన్నుఁ
డష్టాంగి శరణార్థి♦భక్తియోగి।సాధనాంగప్రపన్నుఁడై ♦ జగతిఁబరఁగు॥
క॥ప్రపదనమున్ శరణాగతి।ప్రపత్తి యనఁగను షడంగ ♦ భజనమ్ములఁ
జె। ప్పుపదము లష్టాంగం బం । గపదావళిచేతఁ దెల్పఁ ♦ గాఁ బడును
జుమీ॥క॥విను దృప్తుం డన నష్టాం । గనియూథుఁడు గాని మదము♦గదు
రఁగ సుగ ద్రా।వినవానిగతిఁ జరించెడి। జనుండు గాఁ డనుచుఁ దెలియ♦
శాస్త్రము చెప్పున్॥ తే. గీ॥ శీఘ్రకాలంబులో ముక్తిఁ ♦ జెందువాఁడు ।
సాధ్యసిద్ధికి మాధవు ♦ శరణమొందు । నంగములఁ గోరువాఁ ♦ డన్యునా
శ్రయించు ।సుకృతపరిపాకభేద మా ♦ చొప్పఁ గనుట ॥మ॥ జననానేక
శతంబులందు ఫలకాం ♦ క్షన్ ద్వాదసుల్ తీర్థసే। వనముల్ గోతిలధా
న్యరౌప్యవసుధా ♦ వాసోగుడక్షౌద్రకాం । చనకన్యాముఖదానముల్
వ్రతములున్ ♦ జన్మంబులుం జేయుసు।జ్జనుఁడంహోరహితాత్ముఁడై నతతి
శా ♦ ప్రజ్ఞానియై భాసిలున్॥ సీ ॥ సురసంఘములలోనఁ ♦ బరమేష్ఠికై
వడి, గిరులలోపల మేరు♦గిరివిధమున । గ్రహసమూహములోనఁ♦గమ
లబాంధవుపోల్కి, భములలోఁ జంద్రబిం ♦ బంబుపగిది। హస్తిసంఘము
లలో♦నైరావణముజాడ, నదులలో జాహ్నవీ ♦ నదితెఱఁగున । క్ష్మారు
హంబులలోనఁ♦ గల్పవృక్షమురీతి, ఖగములలోపల ♦ గరుడునట్లు॥ తే.గీ॥
ప్రచురరత్నంబులను గౌస్తు♦భంబుకరణిఁ । జాపధరులందు శ్రీరామ♦

చంద్రశేఖ। జనులలోపల వేదాంత ♦ శాస్త్రజనిత । సమధికజ్ఞాని దన
రారు ♦ జగము లెన్న ॥మ॥ కరుణాపూర్ణుఁడు సత్యసంయుతుఁడు లో♦
కస్తుత్యచారిత్రుఁ డా । దరణీయప్రబలప్రచారుఁడు దమా ♦ ధారుండు
దక్షుండు మ । త్సరదంభాద్యరివర్జితుండు విపులై ♦శ్వర్యుండు శాంతాత్ముఁ
డై । ధరణిన్ భాసిలు దైవదత్తనిగమాం♦తజ్ఞానధుర్యుం డొగిన్॥ తే.గీ॥
కడుపుకూటికిఁ జదివెడి ♦ కష్టమతుల । కెల్ల వాదంబె కాని స ♦ ర్వేశు
నెఱుఁగ । మార్గములు బోధపడునె యా♦మాట కేమి । వినుము శా
స్త్రార్థవిజ్ఞాని ♦ విధము మరల ॥మ॥ హరికిన్ జీవులు దేహ మాట నతఁ
డే♦ట్లాడించు మే మట్ల త్రి।మ్మరుచున్నారము గానఁ గర్మఫలముల్ ♦మ
మ్మింతయున్ జెందవా। హరివే యంచుఁ దలంచు చుండియు ఫల♦త్యా
గైకబుద్ధిన్ దయా । కరకర్మంబులు చిత్తశుద్ధికొఱకై ♦కావించు నాతం
డిలన్ ॥ మ॥ విమలాంతఃకరణంబు గల్గి కృతియై ♦ వెల్గొందువిజ్ఞాని ని।
ర్మమతాపూర్తి వహించి కర్మగతిఁ జే ♦ ర న్మాని యష్టాంగయో ।
గమ్మునై నాసల నంగ సిద్ధికొఱకై ♦కంసారిపాదాబ్జముల్ । విమలుండై
శరణంబుఁ బొంది గురు న♦న్వేషించుచో నత్తఱిన్॥క॥ భగవంతునికృప
చేతను । దగినగురుఁడు దొరకి యోగ♦తత్త్వము దెలుపం । దగ విని
నివృత్తిమార్గము।మొగిఁ జొచ్చి వతండు గళిత ♦ మోహుండగుచున్॥
క॥ యమము దశాంగయుతంబు ని । యమము దశాంగాన్వితంబు♦
నాసనములు పె । క్కమగు మరుదవరోధ।క్రమ మేకవిధంబు ధ్యాన♦
గతి ద్వివిధ మగున్ ॥ క ॥ ధ్యానము నిల్చుట ధారణ । మై నెగడున్
ధారణము ని♦రంతరస్మృతధా। రానూన మగుచుఁ దనరిన । దానిఁ దగ
సమాధి యనియె ♦ దరు యోగవిదుల్ ॥ క ॥ క్షమయు నహింసయు
నస్తే । యము సత్యము బ్రహ్మచర్య ♦ మార్జవమును శౌ । చము ధృతి
మితాశనము దయ।యమదశకం బిదియె మొదటి♦దష్టాంగములోఁ ॥
క॥జపమునుద త్త్వజ్ఞత కృష్ణపూజదానంబు వ్రతము♦శ్రద్ధయుమతియున్।
దపమును హర్షము లజ్జయు । విపులనియమదశక మంద్రు ♦ వేదాంతవి

దుక్॥ తే. గీ॥ పద్మమునుస్వస్తికము బద్ధ♦పద్మమును మ। యూరమును
గుక్కుటమ్ము కం♦ఠీరవమ్ము।నాది యగునా సనమ్ముల♦నభ్యసింప।వలయు
సు మ్మారురుక్షుండు♦వలసినట్లు॥సీ॥ఆసనం బభ్యస్త♦మైనపిమ్మట విజ,సము
సుఖప్రద మౌచు ♦ నమరుపాడు। గుడిలో నయినఁ గొండ♦గుహాలోన
నైన మ,ఱొండుచో నైనఁ గూ ♦ ర్చుండి పూర । కము కుంభకము
రేచ ♦ కము కలాకాష్ఠాది, కక్రమంబున హృషీ♦కమ్ము లైదు। తనకు
వశ్య మగునం ♦ తకు లఘుశుచిమిత, హితమధురాహార ♦ యుతుఁడు
బ్రహ్మ॥ తే. గీ॥ చర్యకలితుండు సుస్థిరా ♦ సనుఁడు నగుచు। సమముగాఁ
గంఠకాయము ♦ స్తకము దనరఁ। ద్వరపడక యేమఱక వాత ♦ ధార
ణంబు। గురునికడ నభ్యసించుటఁ ♦ గోర వలయు॥ ఉ॥ ప్రాణముఖాని
లంబుల ను ♦ పాయముచే నరికట్టి యింద్రియ। శ్రేణుల నెల్ల నెమ్మదిని♦
జేర్చి మనంబును లక్ష్యమందు గీ। ర్వాణులు మెచ్చ నిల్పి ముని ♦
వర్యుఁ డబీజము జోలిఁ బోక ద। ప్రాణుతర ప్రదేశమున ♦ నచ్యుతు
ధ్యానము సేయఁగాఁ దగున్॥ సీ॥ తోలుకారు మెఱుఁగుఁదీఁ♦గెలచాలు
వలెఁ దళ,త్తళ లాడుపసిఁడిచె ♦ ల్వలువవాని । వేల్పురాయనిరాల ♦
వెల కమ్మఁ దగి చక,చ్చకలాడు చున్నమై♦చాయవానిఁ।బూఁపవేఁడివె
లుంగు♦పోఁడిమి గొని ధగ, ద్ధగలాడురతనాల ♦ నగలవాని। నిండుక
ల్వలరాయ♦నికి జోడుపడి నిగ, న్నిగలాడు లేనవ్వు ♦ మొగమువానిఁ॥
తే. గీ॥ జుట్టువాలునుసంకుచేఁ♦బట్టువానిఁ।గలిమిజవరాలుఱొమ్మునఁ♦గలు
గువాని। బత్తి తనమదిలోపలఁ♦బాదుకొల్పి। పాయక కనంగ వలె నిరా♦
బారితేఁడు॥ తే. గీ॥ తైలధారానవిచ్ఛిన్న ♦ తాసమేత। మైన శ్రీకృ
ష్ణవిగ్రహ ♦ ధ్యాన మిల స। మాధి యనఁబడు వానికి ♦ మాధవుండు।
వశ్యుఁడై సంచరించును ♦ వలసినట్లు॥ చ॥ అతఁడు నిజాంగికంబులు న ♦
జాండభవంబులు నైన రిష్టసం। తతులను దేహపాతనము ♦ దంచితకాల
మెఱింగి యెంతయున్ । మతి నియతంబుగా నిలిపి ♦ మాధవుమందిర
మర్చిరాదివ। ద్ధతిఁ జనుఁ గాని విఘ్నసము♦దాయము దీని లభింప నీ ది

లన్॥ తే. గీ॥ కాన దృష్టప్రపత్తిసాం ♦ గత్య మెల్ల। విడిచి యార్తప్రప
న్నుఁడై ♦ వెలయ వలయు। యోగి కగుఁ గష్ట మార్తున ♦ కొదవు
సుఖము। విశదముగ దీని మున్ను తె ♦ ల్పితిని గాదె॥ వ॥ పంచసంస్కా
రసంయుక్తుం డగునతండు మధ్యమనిష్ఠయందు వసించె నేని యోగంబు
నకంటె సుకరం బగుషడంగప్రపత్తిచే భవబంధవిముక్తుం డగుం గావున
మధ్యమనిష్ఠా పూర్వక షడంగప్రపత్తి వచించెద వినుం డని యిట్ల
నియె॥ ఆ. గీ॥ అర్థసాధకము ల ♦ నర్థ సాధకము ల। నర్థహారకమ్ము♦
లనఁగ మూఁడువిధము లగుచుఁ గృతము ♦ వెలయు నందర్థసా। ధక
ములను వచించె♦దను వినుండు॥ క॥ ప్రకటముగ నిత్యనైమి। త్తికకా
మ్యవిభేదమునను ♦ త్రివిధం బగుచున్। సుకృతము దనరారును ద।
ప్పక కొనవలె బుధుఁడు బుద్ధి ♦ భాసుఁడు డగుచున్॥ తే. గీ॥ తప్పుఁ
జేయనియెడల బా ♦ తకఫలంబు। నలిపి వర్ణాశ్రమవిభేద♦సరణిఁ బ్రత్య।
హంబు నూక్తావసరముల ♦ నాచరింప। వలయునది నిత్యకర్మంబు ♦ వసు
ధలోన॥ క॥ స్నానము గాయత్రీమం। త్రానుష్ఠానంబు పంచ ♦ యజ్ఞ
ములు బృహ। ద్ధ్యానుసమర్చనమును మొద। లైనవి నూ నిత్యములు
ధ ♦ రామరతతికిన్॥ తే. గీ॥ నిత్యములకీతిఁ గర్తవ్య ♦ నియమ మెల్లఁ।
గలిగి యుండి నిమిత్తముల్ ♦ గలుగునపుడు। మానక యొనర్ప వల
యుక ♦ ర్మములె సుమ్ము। ధాత్రి నైమిత్తికములు నాఁ ♦ దనరుచుండు॥
క॥ సుతజన్మం బుపరాగము। పితృమరణం బతిథిరాక ♦ ప్రియభామినికిన్।
ఋతుదినము లగుట యాదిగ। క్షితి నైమిత్తికము లనుచుఁ ♦ జెప్పఁ
బడుఁ జుమీ॥ తే.గీ॥ సమయనియమంబు ప్రత్యవా ♦ యమును జెప్పఁ।
బడిన వౌటను సంక్రాంతిఁ ♦ బౌర్ణమాసి। హరిదినంబున మన్వాదు ♦
లందుఁ జేయు। కర్మములు నిత్యనైమిత్తి ♦ కమ్ము లగును॥ తే. గీ॥ చేయ
కున్నను బాపంబు ♦ చెందకుండి। చేసినను గర్మ కీప్సిత ♦ సిద్ధి సేయు।
కర్మములు కామ్యము లగుఁ ద ♦ త్కామ్యతతి య। నియతనియత

ఫలం బనన్♦ద్వివిధ మయ్యె॥ తే.గీ॥ కర్తృసంకల్ప భేదంబు♦కరణి భిన్న।
ఫలము లొన గూర్చు హయమేధ ♦ పౌండరీక। సర్వ పృష్ఠాదులును
బూర్త ♦ సమితి యనియ। తఫలకామ్యంబు లండ్రు పె♦ద్దలు జగమున॥
క॥ తరుబీజమ్ములగతి ఫల। కరమ్ము లగు శ్యేనయాగ♦కారీ రేష్ట్యా।ద్యురుక
ర్మంబులు లౌకిక। సరణులగుచు నియతకామ్య ♦ సంజ్ఞ వహించెన్॥
క॥ ఫల మాసించి యొనర్చిన। ఫలమొసఁగున్ గోరకున్న ♦ బ్రహ్మ
జ్ఞానం। బలవఱచు నియతఫలముల। వెలి యగు కర్మత్రయం
బు ♦ విన్మఁడు తెలియఁగన్॥ వ॥ ఇవి యర్థసాధకంబు లింక
నతిపాతకంబులును మహాపాతకంబులును సమపాతకంబులును నుపపాత
కంబులును సంకలీ కరణంబులును మలినీ కరణంబులును నపాత్రీకర
ణంబులును జాతిభ్రంశకరంబులును బ్రకీర్ణకంబులును ననునవవిధ పాత
కంబులు ననర్థసాధకంబు లనఁబడుఁ దత్ప్రకారంబు లేర్పరించెద వినుం
డని యిట్లనియె॥ క॥ తనతల్లితోడ నైనను। దనకోడలితోడ నైనఁ ♦
దనయలతోనై। నను మదనకేళి సేయుట। జనముల కతిపాప మండ్రు♦
సంయమివర్యుల్॥ క॥ సుర గ్రోలుటయును విప్రునిఁ।బరిమార్చుట గురువ
ధూటిఁ ♦ బట్టుట కార్త। స్వరచౌర్యము సేయుట ను। మ్మరసి మహాపా
తకంబు♦లని యండ్రు మునుల్॥ క॥ విను మీపాతకములఁ జే।సినవలువు
రు వీరితోడఁ♦జెలిమి మిగులఁ జే।సినవాఁడనునీ యేవురు।జనుల మహాపాత
కులుగఁ ♦ జాటుమరు మునుల్॥ తే॥ గీ॥ నిర్నిమిత్తంబు గురువుల♦నింద
సేయు।టయును మిత్త్రునిఁ దునుమాడు♦టయు నధీత। వేదవిస్మృతియు
ను మఱి ♦ వేదనింద।బ్రహ్మహత్యాసమంబులై ♦ పరఁగుచుండు॥ ఆ. గీ॥
భువి నిషిద్ధసేవి ♦ యవుట యాత్మోత్కర్ష। కొఱకు నన్నృతమాడు ♦ కొ
నుట పుష్ప।వతిని ముద్దుగొనుట♦మతిని గౌటిల్యంబుఁ। బూనుటయును
మద్య♦పాన సమము॥ క॥ తురగముల నరుల మణులం। దరుణుల నిక్షే
పములను ♦ ధర ధేనువులన్। హరియించుటయే కార్త। స్వరచౌర్యస

మం బటండ్రు ♦ సకలమునీంద్రుల్॥ క॥ చెలికాని భార్యఁ గన్యను। జెలి యలి నిజగోత్రజ లగు ♦ చేడియలం గో। దలి సంత్యజునివధూటిని। గలి యుట గురుతల్పపాత ♦ కప్రతిమంబుల్॥ సీ॥ తనతల్లితోఁ దన ♦ పినతల్లి యును మేన, మామభార్యయు మిత్త్రి ♦ భామినియును।దనమమేనత్త యుఁ ♦ బినతండ్రిభార్యయుఁ, గోడలు శిష్యుని ♦ కోమలియును। బుత్త్రి కయును దోడఁ ♦ బుట్టినకాంతయు, గురునివధూటియు ♦ గోత్రజయును। బెంపుడుతల్లియుఁ♦ బృథ్వీశుభార్యయు,సన్న్యసించినయట్టి♦జవ్వనియును॥ తే.గీ ॥ శరణుచొచ్చినకాంతయు ♦ ధరణిసురుని। వనితయును గురు పుత్త్రిక ♦ యును బతివ్రి। తయును సాపత్న్యమాతృసో ♦ దరియుఁ దు ల్య।లనుచు నారదమునివర్యుఁ ♦ డానతిచ్చె॥ సీ॥ క్షితి నకాలోపనీ ♦ తత ధేనువధ దొంగ, తన మప్పు దీర్పమి ♦ యును ననాహి। తాగ్నిత లవ ణాదు ♦ లమ్ముట జ్యేష్ఠుని, కంటెను మును గర ♦ గ్రహణ మాట। వెల యిచ్చి చదువుట ♦ వెలకుఁ జెప్పుటయును, దాను బెండ్లాడక ♦ తమ్మునకు ను। బెండ్లి సేయుట పర ♦ ప్రేయసీగమనంబు, వడ్డిచే బ్రతుకుట ♦ వసు మతీశ॥ తే. గీ॥ వైశ్యశూద్రవరాంగనా ♦ వధయు నింది। తార్థముల చేత బ్రతుకుట ♦ నాస్తికతయు।బ్రహ్మచర్యవ్రతంబు లోఁ♦పంబు సేత। ఘనులు వీనిని నుపపాత ♦ కంబు లనిరి॥ సీ॥ పిల్లల నమ్ముట ♦ పితృమా తృసుతపరి, త్యాగంబు సేయుట ♦ ధాన్యకుప్య। సీసపశ్వాదిక ♦ స్తేయ మయాజ్యయా, జనము కన్యాప్రదూ ♦ షణము కుటిల। భావ మా రామస ♦ రోవరవిక్రయం, బును బరివిందక ♦ మనుజునకును। నా త్మజ నిచ్చుట ♦ యాత్మార్థమై భక్ష్య, ములు వండుకొనుట క ♦ ల్లలమిఁ ద్రావు॥ తే. గీ॥ వనితఁ గూడుట స్వాధ్యాయ ♦ వహ్నివర్జ। నంబు పు త్త్రుని కుచితకా ♦ లంబునందు।సంస్కృతులు సేయమియు బంధు ♦ జనవి రోధ। మరయు నుపపాతకంబు ల టం♦డ్రు మునులు॥ సీ॥ వెఱవక వంట కై ♦ తరువు గొట్టుట గాను, గాడుట వ్యసనంబు ♦ లందుఁ బడుట।స్త్రీ మూలమునను హిం ♦ సామూలమున భిష, గ్వృత్తిమూలమున జీ ♦ విం

నిత్యంబు సర్వార్థముల్ । చూఁజల్ సేయుచు సేవ సేయవలె నం ♦ చున్ మున్నె నేఁ జెప్పితిన్॥ మ ॥ హరికిన్ భక్తి నొసంగ వచ్చును గృపా ♦ యత్తాత్ముఁడై దీనులం। బరిపాలింపఁగ వచ్చుఁ గూపముఖదీ ♦ ర్ఘ్యాత్స్వష్ట సంతానముల్ । పరిశుద్ధంబుగఁ జేయ వచ్చు హరిబిం ♦ బ శ్రేణులం జూడ ను। ర్వర పైఁ ద్రిమ్మర వచ్చు దేహబల మ ♦ ర్థశ్రేణియుం గల్గి నన్॥సీ॥ హరిమూర్తిదానంబు♦లాచరింపఁగ వచ్చు, బీదమానునులకుఁ♦ బెట్ట వచ్చు। మూకాంధపంగుప్ర ♦ ముఖులకు నీ వచ్చు, మంచిబ్రాహ్మణులను ♦ మనుప వచ్చుఁ। దీర్ఘయాత్ర లొనర్చు♦దేహి కీయఁగ వచ్చు, సత్త్రసంఘంబులు♦జరుపవచ్చు। ధన మిచ్చి పెండ్లిండ్లు ♦ దగఁ జేయఁగా వచ్చు, హరిని దెల్పెడికృతు ♦ లంద వచ్చుఁ॥ తే. గీ॥ బ్రపలు ఘటియింప వచ్చుఁ జ ♦ ప్పరము లుంపవచ్చు నైమిత్తికములందు ♦ వలసినట్లు। దాన ము లొనర్పవచ్చు మా ♦ ర్యమికనిష్ఠ । దీనిచేతను జెడదు సం♦దియము లేదు॥ ఉ॥ శాంతి విరాగముం గరుణ♦సత్యము శౌచము శ్రద్ధ లజ్జయున్। దాంతియు మైత్త్రి యార్జవము ♦ దానము శుద్ధియు సుస్థిరత్వమున్।సంత సమున్ సుబుద్ధియును ♦ సర్వసమత్వము నీతి ధైర్యమున్ । సంతతముం బ్రపన్నుఁడు ఘ ♦ నంబుగ గల్గి చరింపఁగా వలెన్॥ ఉ॥ కామము లోభమున్ భయము ♦ గర్వము దంభము మచ్చరంబు హిం । సామద మానతృష్ణలును ♦ సాహసమున్ విషయానురక్తియుం । బామరవృత్తి క్రోధమును ♦ బాప మహంమమకారముల్ మదిన్ । వేమఱు మానుచుం డవలె ♦ విష్ణునిదాసుఁడు దీప్తహాసుఁడై ॥ మ॥ దివిషల్లోక మొసంగుచో ఘులినబు ♦ ద్ధిన్ శుద్ధి గావించుచో । సవనశ్రేణులఁబోలు సత్క్రియలు భూ ♦ చక్రంబునన్ లేమి యో। గవిధానంబు మడంగిచందమున యా♦గంబుల్ ప్రపన్నుండు మా । న వలెన్ మాననివాఁడు సాధనఫలాం♦తఃపాతియై కుందెడిన్॥ మ॥ శౌరిం జెప్పు పురాణముల్ చదువుచుం♦ జక్రాయుధధ్యాన మిం । పారఁగ జేయుచు విష్ణుభక్తులకు ని ♦ త్యంబన్న దానంబు స । త్కారం బొప్ప ఘటించుచున్ జనుఁడు త ♦ త్త్వజ్ఞాన

సంపన్నుఁడై । మీఱన్ మధ్యమనిష్ఠ పోవ దనుచున్ ♦ మీ కే నెఱిం గించితిఁ॥ ఉ॥ కూడవు తీర్థయాత్రలును ♦ గూడవు కామ్యఫలవ్రతా వళుల్ । కూడవు నక్తమార్గములు ♦ కూడ వయో మహిషాది దాన ముల్ । కూడవు తంత్రమంత్రములు ♦ కూడవు విష్ణు కథాన్య శాస్త్ర ముల్।కూడదు దేవతాంతరము♦గొల్చుట మధ్యమనిష్ఠఁ బూనుచోఁ॥ మ॥ తన వర్ణంబున కాశ్రమంబునకు సూ ♦ క్తం బైన మార్గంబునఁ। ధనముల్ గూర్చుచు యుక్తభోగములచే ♦ తం దృప్తుఁ డౌచున్ మహా। జనులెల్లన్ వినుతింప విష్ణునిపదా ♦ బ్జద్వంద్వముం గొల్చుచున్ । మను జుం డుండిన నిష్ఠ వోవదు సుమీ ♦ న్యాసంబునం దింతయుఁ॥ క॥ కర ణత్రయప్రపన్నుఁడు । హరిదాసవివృద్ధికొఱకు ♦ నాత్మజులను బ।ల్వురఁ బుట్టింపఁగ వలయును । విరక్తుఁ డగునాతని కిది ♦ విధి గాదు సుమీ॥ క॥ తనమీఁదఁ గబ్బములఁ జే । సినవారిని గృతులు దన్నుఁ ♦ జెందిం చినవా । రిని దనలోకంబునకుం । గొనిపోవును జక్రధరుఁ డ ♦ కుంఠిత దయతోఁ॥ క॥ హరి సంబంధము గలయవి । విరతి చెలఁగు నవియుఁ గరుణ ♦ వెలయునవియుఁ ద । త్కరణత్రయప్రపన్నుఁడు । సురుచిరగతిఁ జేయవలయు ♦ సుకృతవితతిలోఁ॥ క॥ తనశక్తికొలఁది నిత్యము । లును నైమిత్తికచయంబు ♦ లును బ్రాయశ్చి । త్తనివహములోనఁ జేయం।జను మధ్యమనిష్ఠఁబూను ♦ జనుఁడు సతతముఁ॥ క॥ దురితసమూహము శ్రీ హరి । విరహితపుణ్యములు దయకు ♦ వెలి యైనపనుల్ । కరణత్రయ ప్రపన్నుఁడు।మఱచియయినఁ జేయరాదు ♦ మహిమండలిలోఁ॥ క॥ ఈ విధమున సుమతిం గ । ర్మావళి పరికించి చేయు ♦ నవియును మానం। గావలయు నవియుఁ దెలియం । గావలయును గాక చెప్పఁ ♦ గా వశ మగునే॥ శా॥ శాపానుగ్రహశక్తిమంతులు సమ♦స్తజ్ఞానపూర్ణుల్ ఘన। వ్యాపారాన్వితు లయ్యు నీ ప్రపదనా ♦ ధ్వం బూహకుఁ రామి సం। తాపం బొందుచు మానులందఱును మున్♦ద్వైపాయనుం జేరఁగా।నా పుణ్యాత్ముఁడు దెల్పె దీని మహిమం ♦ బల్పంబె చింతింపఁగఁ॥ సీ॥ భువి

స్వర్గనిరయహే ♦ తువు లైన పుణ్యాఘ, కర్మంబులును మోక్ష ♦ కార
ణంబు । లగుకర్మధీభజ ♦ నాఖ్యయోగములు కృ, చ్ఛ్రాదిమలు కరణ
త్ర ♦ యమున మాని । సలుపకున్న నఘంబు ♦ సమకూడ దనుభీతి,
మే లైననిత్యనై ♦ మిత్తికాఖ్య । కర్మమాత్రంబులె ♦ కావించుచును
దాప, పుండ్రవందననామ ♦ పూజనప్ర॥ తే. గీ॥ దక్షిణము లనుకాయిక ♦
తతియు మంత్ర । జప మనెడి వాచికము తద ♦ ర్థపరతయను । మాన
సము గల్గి హరిఁ గొల్చు ♦ మనుజుఁ డలరు । చుండుఁ గరణత్రయప్రప ♦
న్నుం డనంగ॥ తే. గీ॥ కామ్యకర్మంబులెల్లఁ ద్యా ♦ గంబు సేఁత । న్యాస
శబ్దార్థ మనుచు ధ ♦ నంజయునకుఁ । జక్రి వచియించె నది యిది ♦ సమము
లగుట । న్యాస మయ్యెను గరణత్ర ♦ యప్రపత్తి॥ తే. గీ॥ న్యాస శబ్దార్థ
మయ్యె యా ♦ గాదికంబు । పాసనపదార్థ మయ్యెను ♦ భక్తియోగ ।
మింతకంటెను వేఱు లే ♦ దీశుఁ జేర్చు । సాధనం బని సకల శా ♦ స్త్ర
ములు దెలుపు॥ తే. గీ॥ న్యాస మన యోగముఖము లు ♦ పాసన మన ।
యోగమును నగు సర్వశా ♦ స్త్రాగమముల । నెంచ హరిఁ జేర్ప నింతకు ♦
మించుసాధ । నంబు లే దని నారదీ ♦ యంబు పలికె॥ చ॥ నిగమపురా
ణశాస్త్రములు ♦ నేర్చినపండితుఁడైనఁ బాతకం । బగు తెరు వూనె నేని
విల ♦ యంబును జన్మము దక్క న్యాసయో । గగతులలోన నెద్దియును ♦ గ
ల్గదు పాపము మాని యోగ్యుఁడై । దగుసుజనుండు పుణ్యదురి ♦ తంబుల మా
నినన్యాసియై తగున్॥ తే. గీ॥ న్యాసి యగువాఁడు తామసుం ♦ డైన సా
త్త్వి । కుం డయిన రాజసుం డైన ♦ నొండు కూయి । మాని మధ్యమనిష్ఠ
తాఁ ♦ బూనవలయు । ననుచుఁ దెల్పెను చరమమం ♦ త్రార్థవేళ॥ సీ॥ వినుముపా
సనమందు ♦ వేదాంతవిజ్ఞాన, కార్యంబుకర్మయో ♦ గంబుకర్మ । యోగకార్య
ము జ్ఞాన ♦ యోగంబు దానికా, ర్యం బగు భక్తియో ♦ గంబు దాని ।
కార్యంబు మోక్ష మీ ♦ కరణి నేకారణ, ములఁ గోరక స్వతంత్ర ♦
ముగను దాను । ముక్తి గూర్చుటకును ♦ ముఖ్యకారణ మాట, వలన
నీన్యాసప్ర ♦ వర్తనంబు॥ తే. గీ॥ భువి నుపాయాంతరనివృత్తి ♦ పూర్వ

కముగ।నగు స్వతంత్రప్రపత్తి య ♦ టంద్రు బుధులు । మాధ్యమిక
నిష్ఠ దీనికి ♦ మఱవ దగ ద । టంచుఁ జెప్పిద మాదిఁ బట్టు ♦ నట్లు
మీకు॥ సీ॥ అర్థసాధకము ల ♦ నర్థహారకములు, భావిభూతానర్థ♦భంజ
కమ్ము । లనెడికర్మచతుష్ట ♦ యంబులోపలను బ్రా, యశ్చిత్తపాపపు ♦
ణ్యాంబు లనెడి । కర్మత్రయము మాని ♦ గావింప కుండినఁ, బాతకం
బగు నను ♦ భీతి గలిగి । మే నైననిత్యనై ♦ మిత్తికంబులను ద, త్ఫల
సంగియును ఫల ♦ త్యాగి గాక॥ తే.గీ॥ చేఁత మధ్యమనిష్ఠనై ♦ చెలఁ
గు ననియుఁ । గలియుగంబున మోక్షంబు ♦ గలుగుటకును । దీనికంటె
నుపాయంబు ♦ గానిపింప । దనియు వచియించె లక్ష్మి బ ♦ లారితోడ॥
తే.గీ॥ న్యాసి యయ్యును జనుఁడు మా ♦ ధ్యమికనిష్ఠ । వదలఁగా రాదు
వదలుచో ♦ వ్యభిచరించి । నట్టిసంపూర్ణచంద్రబిం ♦ బాస్యపోలె । వాని
వెలివేయవలె న్యాసి ♦ వర్గమెల్ల॥ క॥ అని యీగతిఁ గాంతిమతీ । తన
యుఁడు వచియింప శిష్య ♦ తతిలో ముఖ్యుం । డనఁ దగుయాదవుఁ
డాతనిఁ । గనుఁగొని యీరీతి శంక♦గావించెఁ దగన్॥ తే. గీ॥ సాత్త్వి
కుఁడు గానివానికిఁ ♦ జక్రిపురము । గలుగ దంచు శ్రుతిస్మృతుల్ ♦
దెలుపుచుండ । న్యాసిమాత్రుల కెల్ల ము ♦ రారిపురము । చూఱ
యని మీరు వల్కుట ♦ చోద్య మయ్యె॥ ఉ ॥ వాతము పిత్తముంగఫ
ము ♦ వర్తిలునప్పుడు తద్వికారముల్ । చేతనకోటిఁ జెందుగతిఁ ♦ జెంద
వె సత్త్వరజస్తమోగుణో । ద్భూతవికారకోటు లవి ♦ పొందినవానికి
సూక్తనిష్ఠ యే। రీతిని నిల్చు మాధవుపు ♦ రీస్థలి కేగతి నేగుఁ జెప్పుమా॥
వ॥ అనిన రామానుజగురుం డిట్లనియె॥ తే.గీ॥ సాత్త్వికతలేక మోక్షం
బు ♦ సంభవించు । ననుచు నేనును దెల్ప లే ♦ దయ్య వినుము । పాప
ములు చేయఁ దగ దంట ♦ పాడి గాదె । దీనికి గుణత్రయం బేల ♦
తెలిపె దీవు॥ క॥ నరుఁడు రజస్తమములచేఁ। బరిభూతుం డగుచు దురిత♦
పథమునఁ దిరుగన్ । నిరయమున కేగు నని నే । నెఱిఁగించితిఁ గాక
ముక్తి ♦ యేల వచింతున్॥క॥ భువిని గరణత్రయముచేఁ ।ద్రివిధం బగు

ప్రపదనంబు ♦ త్రిగుణమ్ములచే । నవవిధ మగుఁ గావున స । త్త్వావం
తునికి సుమ్ము మోక్ష ♦ దశ లభియించుఁ॥ వ॥ తదీయప్రకారంబు
వినుము తామసకాయికంబును దామసవాచికంబును దామసమానసి
కంబును రాజసకాయికంబును రాజసవాచికంబును రాజసమానసి
కంబును సాత్త్వికకాయికంబును సాత్త్వికవాచికంబును సాత్త్విక
మానసికంబును ననం బడు నిందుఁ గరణత్రయంబు సాత్త్వికం బగు
నతం డానుకూల్యసంకల్పాదిషడంగంబులుం గలిగి తజ్జన్మంబున ముక్తుం
డగుఁ దత్ప్రకారం బాకర్ణింపుము॥ మ॥ తనభక్తుల్ వెలి గాఁగ నెల్ల
జనులం ♦ దత్పూర్వకర్మానువ । ర్తనులం జేయుచుఁ దా స్వతంత్రుఁ
డగు చా ♦ త్మల్ మోక్షబీజంబు లౌ । టను దాపాదులు గల్గి మాధ్యమి
కని ♦ ష్ఠం బూని యున్నట్టిదా । సనికాయంబులఁ బ్రోవఁగా హరివిశే ♦
షస్ఫూర్తితో వర్తిలుఁ॥ ఆ.గీ॥ ఒక్కదేశమందు ♦ నొక్కకాలమ్మున ।
నొక్కభాగవతున ♦ కొసఁగుఁ దొలుత । రమ్య మగుఘుణాక్ష ♦ రన్యా
యమునను యా । దృచ్ఛికాఖ్యసుకృత ♦ మీశ్వరుండు॥ తే.గీ॥ దాని
మిషఁ జేసి విష్ణుండు ♦ దాసజనునిఁ । బ్రోవ సమకట్టు నంతటఁ ♦ బూర్వ
కర్మ । గరిమచే మృతుఁడై వధూ ♦ గర్భమునఁ బ్ర । విష్టుఁడై వాఁడు
జన్మించు ♦ వేళయందు॥ ఉ॥ నల్లనితారకంబులు ద ♦ నర్పఁగ నంచి
తపక్ష్మపంక్తి రా । జిల్ల దయారసంబు విల ♦ సిల్లఁగ వీనులదాఁక నేగి
సం । ఫుల్లసితాంబుజంబులను ♦ బోలి వెలుంగువిలోచనంబులం । జల్లఁద
నంబుగా దనుజ ♦ శాసనుఁ డాతనిఁ జూచుఁ బ్రీతితోఁ॥ క॥ నరుఁడు జని
యించువేళన్ । హరుఁడు కటాక్షింపఁ దామ ♦ సాత్ముఁ డగు నజుం । డరసిన
రాజసుఁ డగు శ్రీ । హరి కరుణించినను సాత్త్వి ♦ కాత్ముఁ డగుఁ జుమీ॥
మ॥ హరినిర్హేతుకజాయమానకరుణా ♦ వ్యాపారుఁ డై నట్టి తా । న్నరుఁ
డంతంతకు సాత్త్వికుం డయి హరి ♦ న్వర్ణించుశాస్త్రంబు లా । దర
మొప్పం గని తత్పదాబ్జయుగస ♦ క్తస్వాంతుఁడై దేహసౌ । ఖ్యరతి న్మాని
చరించు సత్పురుషసాం ♦ గత్యంబు నిత్యంబుగన్॥ క॥ సంసారదుఃఖ
కోటిఁ బ్ర । శంసించుచు దీని విడిచి ♦ సంతతమును శ్రీ । కంసారిప

యము జగ్గ మని। హింస వదలి సంయమీంద్రు ♦ లెన్నఁ జరించుర్‌॥
చ॥ నరకమునం దపించెడిజ ♦ నమ్ములకంటెను వహ్నికీలలం। బొరలెడు వారికంటె ఫణి ♦ పుంజతమోభరితాంధ కూపమం। దుఱికినవారికంటెను స ♦ మున్నత దుఃఖయుతాళి యుండు సం। సరణసమన్వితుం డనుచు ♦ స్వాంతమునం దతఁ డూహఁ జేయుచుర్‌॥ తే.గీ॥ దొరకెనా సాత్త్వికుం డైన ♦ గురునిచేత। లేనిచో నర్చ మైన శ్రీ ♦ జానిచేతఁ। బంచసంస్కారి యైన యా ర్థ ♦ భావ మూన। నపుడె వాని వరించు ష ♦ డంగపూర్తి॥ క॥ వినుము షడంగంబులు గల। ఘనులకు నపవర్గసిద్ధి ♦ గలుగునిజ మటం। చును రామానుజుఁడు వచిం। చినగతి సూతుండు వేడ్కఁ ♦ జెప్పె మునులకున్‌ ॥ శా॥ సారాహారపటీరహీరదివిష ♦ త్సంబేరమోదారడిం। డీరస్ఫారమరాళ హారచయపా ♦ టీరస్ఫురత్తారనీ। హారక్ష్మాధరతారతా రగిరికా ♦ శాహీంద్రమందారక। ర్పూరాకా రయశోవిభాస్థగితవి ♦ స్ఫార్జన్మహీమండలా॥ క॥ అక్షీణబలహతప్రతి। పక్షక్ష్మానాథయూథ ♦ భరితగిరిగుహా। ప్రక్షోభకరణదక్షను। లక్షణభంభానిరర్గ ♦ ళస్ఫుటనినదా॥ మాలిని॥ సకలధననిధీనా ♦ శౌర్యకీర్తిప్రధానా। సుకవివినుతదానా ♦ శూరసంస్తుత్యసేనా। ప్రకటితపటుమానా ♦ పాలితాశేషదీనా। స్వకులజననిధానా ♦ సత్యదానాద్యనూనా॥

గద్య॥ ఇది శ్రీమదుభయవిధకవిత్వరచనానల్పచాతుర్య కోటికెలపూడివంశకమలవనసూర్య హరితసగోత్రధుర్య జ్యోతిషాగమాచార్య శ్రీమన్నారాయణాంబుజధ్యాన గతస్థైర్య సకలమత వేదాంతసిద్ధాంతానివార్య వేంకటకృష్ణస్సోమయాజికుమారవర్య కోదండ రామయార్య కార్యంబైన ప్రపదన పారిజాతంబను దివ్యప్రబంధంబునందుఁ చతుర్థాశ్వాసము.

శ్రీరామార్పణమస్తు.

శ్రీరస్తు.

# ప్రపదనపారిజాతము.



## పంచమాశ్వాసము.

శ్రీజితఖగరాజ మహా । రాజ యశోజితమరాళ ♦ రాజ ధృతీ కుభృ । ద్రాజ పరాక్రమజితమృగ । రాజా శ్వేతాచలపతి ♦ రంగారయా॥ వ॥ అవధరింపుము సూతుండు శౌనకాదులం గనుంగొని యిట్లనియె॥ క॥ అనుచు జగద్గురుఁడు వచిం । చిన విని యాదవుఁడు భక్తిచే ముక్తి పడం । గనిరూపణమ్ము దెల్పవె । యని వేఁడిన వానికిట్లు ♦ లనె గురుఁడు దయన్॥ వ॥ ఆనుకూల్యసంకల్పంబును ప్రాతికూల్యవర్జనంబును రక్షించు ననువిశ్వాసంబును గోప్తృత్వవరణంబున నాత్మనిక్షేపంబును గార్పణ్యంబును ననుషడంగంబులు విరోధిసహితంబుగా నేర్పరించెద సావధానచిత్తులై వినుండు॥ మ॥ దనుజధ్వంసికటాక్షమొండు వెలిగాఁ ♦ దత్ప్రాప్తికిన్ వేఱె సా । ధనముల్ లే వని నిశ్చయించుచుఁ దగం ♦ దత్పారతంత్ర్యంబు మ । న్నన మీవేళను బూనచున్నదనుజ్ఞా ♦ నంబాత్మనిక్షేపణం । బనుముఖ్యాంగముగా వచించెదర వే♦దాంతజ్ఞు లెల్లన్ రహిన్ ॥ సీ ॥ మోక్షం బొసంగఁగా ♦ ముఖ్యహేతువు లైన, కర్మధీభక్తియో ♦ గములు దుస్త । రంబు లంచున విలం ♦ బంబు లంచును వాని,వాసనారుచులతో ♦ వదలి సాధ్య । మగు ముక్తి సిద్ధింప ♦ హరికృపామాత్రమే, సాధనం బనెడి ని ♦ శ్చయమవనీప । యపవర్గకాంక్షికి ♦ ననమానఫల మంచుఁ, దెలిసి నామది కృపాజలధి శక్తుఁ॥ తే.గీ॥ డఖిలసంపూర్ణుఁడు సమర్థుఁ ♦ డైనశౌరి । చరణపద్మంబు లిప్పుడు ♦ శరణ మొందు । చున్న దని సంతతము దెలియుటయె మనుజు । నాత్మనిక్షేపణం బనా ♦ నలరు జగతి॥ తే.గీ॥ క్షితి

ఫలశ్రద్ధ యాత్మని ♦ క్షేపవైరి । యగు ఫలశ్రద్ధయనఁగఁ దా ♦ నాచ
రించు । నిత్యనైమిత్తికంబు ల ♦ న్నిటికిఁ దనకు । ఫలము గల దను
సంశయ ♦ భావ మునికి॥ సీ॥ అజ్ఞానతిమిరంబు ♦ నందు మగ్నుండనై,
వాసనాధీనప్ర ♦ వర్తనుండ । నవుటచే మోక్షహే ♦ తువు లైనకర్మ
ధీ, భక్తియోగంబు లె ♦ ప్పటికి దొరక । వది గానఁ దాపత్ర♦యా
ర్తులఁ దొలఁగింప ♦ నాకు భవత్కరు ♦ ణారసంబు । దక్క మఱొండు
నా ♦ ధనము లే దని దీన, భావుఁడై యుంట కా ♦ ర్పణ్య మగును॥
తే.గీ॥ విరతియును జ్ఞానమును గల్గి ♦ వేదవినుత । కర్మధీభక్తియోగసం♦
గతి వహించి।శౌరిఁ జెందెద ననియెడి ♦ ధీరబుద్ధి।దీనికి విరోధి యండ్రు
వి ♦ జ్ఞానఘనులు॥ మ॥ తనకుం బ్రాణులచేత నయ్యెడినిమి♦త్తం బెద్ది
యున్ లేక యున్నను నిర్హేతుకజాయమానకృప త ♦ న్నైసర్గికం
బౌటఁ జే । తనసంరక్షణలాలసుం డయినసీ ♦ తాభర్త న న్నేలు నం।
చును నిక్కంబుగ నమ్మియుంటయె సుమీ ♦ చూపట్టు విశ్వాసమై॥
మ॥ తనకర్మానుగుణంబు గాని ఫలముల్ ♦ తా నొందునే శ్రీజనా।ర్దను
సంకల్పము భిన్న మాట గలదే ♦ రాముండు వైషమ్యన । ర్తనముం
బూనునె నన్ను మాత్రమె దయన్ ♦ రక్షింపఁగా వానికిం । బని యే
మున్న దటంచుఁ బల్కుటయె త ♦ త్ప్రాతికూల్యభ్రమై భాసిలుర్॥ మ॥ కరు
ణాశక్తులచేతఁ బూర్ణుఁడయి భ♦క్తశ్రేణులంబ్రోవఁ బెన్బిరుదుల్ పూని
జగచ్ఛరీరి యగుచుం ♦ బెంపొందు శ్రీమద్రమా । వరుపాదంబులె
మాకు గోప్త లనుచున్♦వర్తించుటే గోప్తృతా।వరణం బంచు సమస్త
వేదములు భా ♦ ష్యద్వ్యాప్తితోఁ దెల్పెడిన్॥ క॥ జ్ఞానయుతుం డగు
లక్ష్మీ।జానిన్ గుణహీన మైన ♦ జ్ఞానాకారుం । బై నెగడు ననుచు దలఁ
చుట । దీనికి విద్వేషి యనుచుఁ ♦ దెలియ వలెఁ జుమీ ॥ తే.గీ॥
దేవుఁడు విధాయకుండు వి♦ధేయు లాత్మ।లగుటఁ బ్రామినుకులఁ గూడ♦
దనువినోద । శాస్త్రము లఘుమ్ములును విన ♦ ర్జనము సేఁత । జగతిఁ
దగుఁ బ్రాతికూల్యవ♦ర్జన మనంగ ॥ క ॥ వనజాక్షుని వచియింపని ।

వినోదశాస్త్రములయందు ♦ వేడ్క పడుట త । ద్వనజాతుకథలు చను
వమి । యును దీనికి వైరి యందు ♦ రుత్తములు భువిన్॥ మ॥ హరికిన్
స్థావరజంగమాత్మకజగం ♦ బంగంబు తద్దేహి శ్రీ । హరి యంచున్
మది నిశ్చయించి తనకున్ ♦ వ్యాఘాతముల్ సేయుదు । ర్నరు నైనన్
వధియింప కుండుటయె శ్రీ ♦ నాథానుకూల్యం బ టం । చు రహిం బ్రా
మ్నరు టానుకూల్యమతి యం ♦ చున్ వేదముల్ దెల్పెడిన్॥ క॥ వేదో
క్తం బగుహింస య । వైదికహింసయును దీని♦వైరి యగుఁ జుమీ ।
శా దనక దీని నరుఁ డు । న్నాదంబునఁ బూన స్వర్గ♦నరకగతు లగున్॥
క॥ నిపుణతఁ గరణత్రితయ । ప్రపదన మ ట్లఖిలమనుజ ♦ పాళికిఁ జొర
వా । టపడదు షడంగసహిత । ప్రపత్తి విను సాత్త్వికైక ♦ భావ్యం
బగుటన్॥ క॥ నిమిషార్ధ మైనఁ దనుయో । గమున బొడముతద్విలంబ♦
గతి కోర్వనియు । త్తముఁడీషడంగి పీనికిఁ । గమలానాథునిపురంబు ♦
గలుగు నిజముగాన్॥ క॥ కరణత్రయప్రపన్నులు । హరిపురికిం బోదు
రనుట ♦ కర్థము జన్మాం । తరముల షడంగయుతులై । వఱలినచో ముక్తి
వారి ♦ వశ మనుట సుమీ॥ సీ॥ ఇది యెఱుంగనిమూఢు ♦ లీకరణత్ర
య, ప్రపదనం బొకముక్త్యు ♦ పాయమనుచు । భ్రాంతిఁ బొందియును
శా ♦ స్త్రముల్లెల్ల క్షణమాత్ర, తనుయోగజవిలంబ ♦ తకు సహింప ।
గాఁ జాలఁడు ప్రపత్తి ♦ కలితుం డటంచును, బలుకుట విని యట్టి ♦
బహుతరార్తి । తనయందు లేకుంట ♦ తలపోసి తలపోసి, ముజ్జగంబులు
నవ్వ ♦ లజ్జ విడచి॥ తే. గీ॥ చచ్చునందాఁక సంసృతి నైఁ ♦ చుకతన ।
దృప్తులము మే మటంద్రు దు ♦ ర్వృత్తు లగుచు । నట్టినీచులు గా
వింప ♦ నట్టిపాత । కమ్ము లుండునె యెల్లలో ♦ కములందు॥ తే.గీ॥
ఆర్తుఁడును దాఁ బ్రపన్నాఖ్యు ♦ లగుట నిష్ఠ । సమ మగుటఁ బంచసం
స్కార ♦ సరణి యేక । మగుట విభ్రాంతుఁడై తన♦కార్తి లేమి । తాను
దృప్తుఁడ నను న్యాసి ♦ తగవు దప్పి॥ చ॥ వినుము షడంగసిద్ధుఁ డగు♦
వేళను గల్గెడుమోక్షలక్ష్మి త । జ్జననమునందె కల్గు నను ♦ చందమునన్

శ్రుతు లాఁస గొల్ప నొ। య్యనఁ గరణత్రయప్రపద ♦ నాన్వితుఁ డింత
యు భ్రాంతి నమ్మి వి। ష్ణునిపుర మట్టె తాను దగఁ ♦ జొత్తు ననున్
విబుధుల్ హసింపఁగన్॥ తే.గీ॥ వినుము ధీకర్మయోగసం ♦ జనిత మైన।
భక్తియోగంబు దృష్టప్ర ♦ పత్తి యయ్యె। న్యాస మయ్యెను గర
ణత్ర ♦ యప్రపత్తి। గాని యీతండు దృప్తుండు ♦ గాఁడు సుమ్ము॥ క॥
విను దృష్టప్రపదనపరుఁ। డనఁ దగునష్టాంగయోగి ♦ కార్తునకున్ స।
త్త్వనిరూఢి సమానం బా।జను లిర్వురు దలఁప శుద్ధ♦సాత్త్వికులు సుమీ॥
తే.గీ॥ ప్రపదనద్వితయంబు శ్రీ♦భర్తృకరుణ।గలుగ నిమ్మందహేతుక♦
కరుణ మూల।మయ్యె నార్తప్రపత్తిక♦ష్టాంగయోగ।మునకును సహేతు
కకరుణ♦మూల మయ్యె॥సీ॥సాధనమ్ములచేత♦సాధ్యంబు గైకొంట, సాధ
కుండయ్యె నీ♦శ్వరునియందు। నంగసిద్ధికి శర♦ణాగతుం డగుటనం,గప్ర
పన్నుఁడు సాధ♦నప్రపన్నుఁ। డయ్యె విష్ణునిమంగ♦ళాంగంబున నిజాశ,
యంబు గూర్చుట యోగి ♦ యయ్యె నింద్రి। యముల నిరోధించి ♦
హరిని భజించుట, భజనస్థితుండు ను ♦ పాసకుండు ॥తే.గీ॥ నయ్యె య
మనియమాదుల ♦ నధిగమించు। కతన నష్టాంగి యయ్యె మో ♦ క్ష
మున మిగులు। నతులితైశ్వర్యసిద్ధి ద♦ర్పాతిశయము।పరఁగుటను దృ
ప్తుఁ డయ్యెను♦భక్తియోగి ॥తే.గీ॥ చిరసమయసాధ్యవిద్య లా ♦ సించు
కతన। వర్షకోటులు బ్రతుకుట ♦ వలన ముక్త। జీవుఁడును బోలె మ
హిమ లా ♦ర్జించుకతన। భాసిలు సహిష్ణుఁ డనుపేర♦భక్తియోగి॥ సీ॥
క్షణమాత్రదేహసం ♦ సర్గవిలంబ మొ,క్కింత యోర్వమి నస♦హిష్ణుఁ
డయ్యె। నష్టాంగములు మాని ♦ హరియె స్వముక్తికి, సాధనం బనుట
న ♦ శక్తుఁ డయ్యెఁ ।దనభార మెల్ల శ్రీ ♦ ధవునందు నిల్పుట, చే నిర్భ
రుం డయ్యె♦ శ్రీనివాసుఁ।జేర నాటంకమై ♦ ప్రారబ్ధ ముండుట, కతిదుఃఖి
యౌటచే♦నార్తుఁ డయ్యెఁ ॥ తే.గీ॥ దొలుదొలుత ముక్తిగోరుట♦వలన
సాధ్య।భక్తుఁడు స్వతంత్రుఁ డయ్యె ని♦రుక్తకామ్యుఁ। డగుటచే న్యాసి
యయ్యె ష ♦ డంగకలితుఁ। డౌటను షడంగి యయ్యె రెం ♦ డవయు

తండు ॥క॥ అంతిమవేళ నశక్తుఁ డౌ । కింతయు జ్ఞానంబు లేక ♦ యెల్ల
జనము ల । ట్లింతముఁ బొందును యోగి ని । తాంతజ్ఞానమున నై
న ♦ దలఁ పుదివేళన్ ॥క॥ ఒకటి యుపాయత్యాగం । బొకటి యుపా
యావలంబ ♦ ముభయంబును మోక్షకరము లయ్యె హరి సహేతుక
నిర్హేతుకకటాక్ష ♦ దోహలత భువిన్ ॥ తే.గీ॥ ఒకఁడు శక్తుండు దృప్తుం
డు ♦ నొకఁ డశక్తుఁ । డార్తుఁ డీయిర్వురి తెఱంగు ♦ లరయఁ బూర్వపశ్చి
మాంబుధిపథముల ♦ భంగి భిన్న । మయ్యె నేకవిధమున శ్రీ ♦ హరిని
జేర్చు ॥క॥ శతవర్షంబులలో శ్రీ । పతిలోకం బార్తునకును ♦ బ్రభవిం
చును దృ । ప్తతతి కనేకాబ్దంబులు । గతియించినఁ గాని ముక్తి ♦ గలుగదు
సుమ్మీ ॥ తే.గీ॥ పిల్లి తనకూనలను బోలె ♦ నల్లనయ్య । యార్తులను బట్టి
తనపురి ♦ కరుగుఁ గోఁతి । పిల్ల కోఁతినిబలె దృప్తుఁ ♦ డెల్లగతుల । హ
రిని దాఁ బట్టుకొని ముక్తుఁ ♦ డగును జుమ్మి ॥ మ॥ భజనస్థుండు శరీరజ
శ్రమముచేఁ ♦ బల్మాఱుశుష్కించు నా । ర్తజనశ్రేణియు మానసశ్రమ
ముచేఁ ♦ దప్తం బగుం గాన నీ । సుజనద్వంద్వములోన మానసిక మ ♦
త్యుద్రంబుగాఁ జూచి వే । గ జగద్వల్లభుఁ డార్తసంతతికి మో ♦ క్షం
బిచ్చు సంప్రీతితోన్ ॥ చ॥ తనువునఁ బ్రాణముల్ విడుచు ♦ దాఁక నశక్తుఁ
డు విష్ణుదేవునిన్ । మనమున నమ్మి నిక్కముగ ♦ మధ్యమనిష్ఠ వహిం
చి యుండఁగాఁ । జను నటువంటివాఁ డఘము ♦ నల్పఁ డొకానొకవేళఁ
జల్పినన్ । దన కది దైవికం బని పు ♦ నశ్చరణం బొనరింపఁగాఁ దగున్॥
క॥ విను మరల ద్వయము చదువుట । పునశ్చరణ మగును దానిఁ ♦ బూనని
చో నా । తని కైహికసంతాపము । లొనగూర్చుచు శౌరి మోక్ష ♦
మొసఁగు నిజముగాన్ ॥ చ॥ అలకరణత్రయప్రపద ♦ నాన్వితుఁ డైనన
రుండు మత్తుఁడై । కలుష మొనర్ప భ్రష్టుఁ డగుఁ ♦ గాని పునశ్చరణం
బుచేత నా । ర్తు లయినవారిచందమున ♦ దోషవిహీనుఁడు గాఁడు ని ।
ర్మలుఁ డగుసాధనంబు శ్రుతి ♦ మండలి చెప్ప దిఁకేమి సేయుదున్ ॥

క॥ భువి మిశ్రసాత్త్వికుఁడు విష । యవిరక్తుఁడు గాదు నారులఁ ♦ బ్రార్థిం
పక శ్రీ । ధవునిన్ భోగము మోఁడు । మ్మవితథగతిఁ గోరు విష్ణుఁ ♦ డా
తని కిచ్చుగ॥ చ॥ హరి మధురాపురంబునకు ♦ యాన మొనర్చినపో
గోపికా । తరుణులు మిశ్రసత్త్వసము ♦ దంచిత లోలను భోగకోటి
యుం । బరమపదంబు గూర్చు మని ♦ ప్రార్థన సేయఁగ వారి కన్ని
యుం । గరుణ నొసంగినాఁ డనుచు ♦ గ్రక్కున భాగవతంబు చెప్పదే॥
క॥ కరణత్రయ మొక్కటిగా । పరఁగుగ సాత్త్వికున కట్టి ♦ భవ్యుఁడు
హరికిన్ । శరణాగతుఁడై మఱువక । యొఱుక గలిగి యుంటయే స ♦
త్కృచ్ఛరణ మగున్॥ మ॥ తనకున్ మున్ను ప్రపన్నుఁడై పిదప నౌ ♦
ద్ధత్యంబుతోఁ జంపఁ జూ । చినమర్త్యాధము నొక్కనిన్ వనమునన్ ♦
జీవించుభల్లూక మిం । పున రక్షించెను గా ప్రపన్నుఁ డొకచో ♦ మా
హాత్మ్యుఁడై నిష్ఠ ద । ప్పను గా కాతనికిన్ స్వకీయపద మం ♦ భోజాక్షుఁ
డీ కుండునే॥ తే.గీ॥ సాధనంబుల విడిచి వి ♦ శ్వాసి యగుచు । నుండుట
ప్రపత్తి యనుచు వ్యా ♦ సుండు మున్ను । వాహినీగతనామధ్య ♦
పర్వులైన । మునుల కేర్పఱచెను మీకు ♦ వినుట లేదె॥ వ॥ అనిన విని
యజ్ఞశర్మ యిట్లనియె॥ చ॥ హరికి విరోధులైనమను ♦ జావళు లాతని
చేతఁ జచ్చి త । త్పరమపదంబుఁ జెంది రని ♦ భాగవతాదులు దెల్పు
చుండ శ్రీ । హరిచరణారవిందశర ♦ ణాగతుఁ డొక్కఁడుదక్క ముక్తి
కిం । బరుఁడు దగం డటంచుఁ దగఁ ♦ బల్కితి వీ విధి యేమొ చెప్పుమా॥
వ॥ అనిన గురుం డిట్లనియె॥ మ॥ హరిచేఁ జచ్చినసర్వదైత్యులకు మో ♦
క్షావాప్తి లే దందు లో । హరిపాదంబుల మానసప్రపదనం ♦ బాస
క్తితోఁ జేసి సం । గరమైన మిత్తికకర్మసక్తుఁ డగుచుం ♦ గంసారిచే నత్తఱిన్ ।
మరణం బొందినదానవుండు హరిధా ♦ మం బొందు నంద్రుత్తముల్॥
ఉ॥ వైరముచేత నెల్లపుడు ♦ వారలు హృత్సరసీరుహంబులన్ । సారస
నాభు నిల్పుట నె ♦ సర్వదురితక్షయ మయ్యెఁ బిమ్మటన్ । భారము శౌరి

పై నిలిపి ♦ ప్రాణము లొల్లక యాజి సల్పిత । దుర్భారిశరంబులం దెగు
టం ♦ బొందిరి విష్ణుని శంక యేటికిన్ ॥ శా ॥ దారార్థాత్మజమిత్త్రమంది
రపరి ♦ త్యాగంబు గావించి మ । ర్వారుం డైనవిభీషణుండు పలభు ♦
గ్రాజ్యంబు కాంక్షించుచుం । జేర న్వచ్చి ప్రపన్నుఁ డైన దనుజ ♦ శ్రీ।
కర్షునిం జేసెఁ జె । న్నారన్ మోక్షు మొసంగు నింక జలజా ♦ తాక్షుం
డు దివ్యద్దయన్ ॥ క ॥ పాతక మైనను సుకృత । వ్రాత మయిన నరుఁడు
సంభ ♦ వం బగుచో న । న్నాతతి దలఁచిన నిష్ఠకు । ఘాత పొడమ
నీయ ననుచుఁ ♦ గమల వచించెన్ ॥ క ॥ తన కొకసహాయము గై ।
కొనకనరుల కీప్సితములఁ ♦ గూర్చునకామున్ । వనజాక్షుఁ జేర్చు నీస్ప్ర
ప । దన మనుచు సనత్కుమార ♦ తాపసుఁ డనియెన్ ॥ క ॥ విశ్వాస
వంతుఁ డగుచున్ । విశ్వేశుని శరణ మొందు ♦ విద్వాంసునకున్ । శాశ్వ
తఫలము లభించు న । విశ్వాసికి నీశరణము ♦ వితథ మగుఁ జుమీ ।
శా ॥ సీతాన్వేషణకాంక్షు రావణుపురిన్ ♦ శ్రీవాయుజుం డున్నచో
దైతేయాధిపసూతి వైనఁ దొలుదొ ♦ ల్తన్ బ్రహ్మబాణంబు సం । ప్రీతిం
గట్టదె దాని నమ్మ కసురా ♦ రిశ్రేణి పాశవ్రజా । న్వీతుం జేసిన నిల్చెనే
శరణమున్ ♦ విశ్వాసమూలం బిలన్ ॥ తే. గీ ॥ సాధనంబులఁగూడియుఁ
సాధనాంత । రరహితం బయ్యు నరుల కీ ♦ ప్రపదనంబు । సాధ్యసిద్ధి
యొనర్చు బీ ♦ జమును మనువు । నగుచుఁ బ్రణవంబు ఫలకరం ♦ బైన
రీతి ॥ క ॥ విని యోగము దుర్లభ మని । జనుఁ డపవర్గంబుకొఱకుఁ
జక్రి శరణ మొం । దినఁ బ్రోచుననుచుఁ దద్వ ర్తన విష్వక్సేనసంహి ♦ తం
దనరారున్ ॥ తే. గీ ॥ ఏకవారంబె నీవాఁడ ♦ నేన టంచు । నన్ను శర
ణంబు నొందిన ♦ నరుల కభయ । మొసఁగు టిది మద్వ్రతంబంచుఁ
నుదధితీర । మందు రాముఁడు కపిసేన ♦ కాన తిచ్చె ॥ చ ॥ హరిచరణప్రపన్నుఁ
డగు ♦ నంతకుఁ బూర్వమె సుమ్ము కామమ । త్సరమదమానలోభభయ
దంభసముజ్జ్వలవైభవంబు సం । సరణమహోగ్రదావశిఖి ♦ సంభృతఘో
రతరార్తి స్వర్గభూ । నిరయదురధ్వయానమును ♦ నీరసభావము ప్రాణికో

౩౪౯॥ శా॥ శ్రీనారాయణ దివ్యపాదయుగళా ♦ జీవప్రపత్తిప్రభా ।
వానూనం బగుజన్మ మొక్కటియె మ ♦ ర్త్యశ్రేణికిన్ సార్థకం । బై
త్యంబు వెలుంగుఁ గాని మఱి య ♦ న్యం బైనజన్మంబు స । న్మానింపం
డ దాతఁ డెంత ఘనుఁ డై ♦ నన్ దుఃఖముల్ వాయునే॥ క॥ ఎల్లజ
లకును శ్రీ హరి । తల్లియు జనకుండు నగుటఁ ♦ దనదాస్యమునం ।
ల్ల మిఁకువారిఁ గరుణా । కల్లోలయుతేక్షణములఁ ♦ గనుఁగొని ప్రో
చున్॥ క॥ సర్వచరాచర హృదయాం । తర్యాసుం డైనదైత్య ♦ దమను
శరణం । బుర్వి ఫలదము తదన్యసు । పర్వాల సజ్జుల భజింప ♦ ఫల
మెట్టులగున్॥ తే.గీ॥ వాసుదేవప్రపన్నుని ♦ వైదికక్రి।యాచయం బెల్ల
సఫలమై ♦ యలరు చుండు । వాసుదేవాప్రపన్నుల ♦ ర్వక్రియలును ।
వ్యర్థము లటంచుఁ బలికె స ♦ ర్వాగమములు॥ మ॥ స్థలభేదంబును
కాలభేదము వయో ♦ జాతిప్రభేదంబు త । త్కులభేదంబును లింగభేద
ము క్రియా ♦ కోటిప్రభేదం బవ । స్థలభేదంబును వర్ణభేదము గుణో ♦
ద్యద్భేద మొక్కింతయున్ । వల దేతచ్ఛరణార్థి కంచును భర ♦ ద్వా
జుండు దెల్పెం దగన్॥ ఉ॥ జీవులలోన నొక్కరునిఁ ♦ జేరి నరుండు
ప్రపత్తి పూనఁ ద । జ్జీవబలార్థలబ్ధములు ♦ చేకుఱు నట్ల తదన్య మైన
। త్సేవను సంభవింపవు వి ♦ శేషఫలంబుల కెల్ల సంభవం । బై విల
సిల్లుచుండు శర ♦ ణాగతి దీని నుతింప శక్యమే॥ మ॥ ఘనకల్యాణగుణ
ప్రజాంబునిధియై ♦ గన్పట్టులక్ష్మీకళ । త్రునిపైఁ జేయుప్రపత్తి స్వేష్టఫ
లసం ♦ దోహంబులం గూర్చి త । జ్జనుతాపత్రయబాధలం దునిమి మో ♦
క్షప్రాప్తునిం జేయుటన్ । వనజాతాక్షునియందె యీప్రపదనా ♦ ద్వం
బుత్తమంబై తగున్॥ ఉ॥ ఎన్నటి కౌను మర్త్యుఁడు త్ర ♦ యీశిఖ
లందుఁ బ్రవీణుఁ డాతఁ డిం । కెన్నఁడు కర్మయోగి యగు ♦ నెన్నటికిన్
లభియించు జ్ఞానయో । గోన్నతి భక్తి నెన్నటికి ♦ నొందు దు
రాశలు మాని చక్రికిన్ । మున్నె ప్రపన్నులై చనుఁడు ♦ ముక్తికి శ్రీ
హరిదాస్యయుక్తికిన్॥ క॥ కలియుగమం దార్తునకున్। వెలిగా మోక్షం

ము. బొందు ♦ విద్వాంసుఁడు లేఁ। డలఘుతరసాధనం బిది। తలఁపుఁడ
దీనికి సమంబు ♦ ధర లే దనుచున్॥ క॥ యోగంబు దీనిలో శత
భాగంబున కైన రాదు ♦ పరమపురుషసం। యోగం బాజన్మమున
ని। రాగుఁడై పొందుఁ బ్రపద ♦ నాన్వితుఁడు దగన్॥ క॥ కరుణా
సాగరుఁ డగు శ్రీ। హరియందు ననర్థసిద్ధి ♦ కై మానవుచేఁ। బరికింఁ
చేయఁబడు నిజ। భరార్పణము తామసప్ర ♦ పత్తి యనఁ బడున్॥
క॥ కామైకవత్సలుం డగు। శ్రీమాధవు నుచితకామ ♦ సిద్ధికొఱకు ను
ద్దామగతిఁ బొందుశరణము। క్ష్మామండలి రాజసాఖ్య ♦ శరణ మన
దగున్॥ క॥ పరిహృతకాముఁడు తద్దా। స్యరతుండును భక్తియుక్తుఁ
డగుచున్ స్వాత్మే। శ్వరు హరిని బొందుశరణము। పరికింపఁగ సాత్త్వి
కప్ర ♦ పత్తి యనఁ దగున్॥ క॥ విను కాయికంబుకంటెను। ఘన మగు
వాచికము దాని ♦ కన్న నధికమైఁ। దనరున్ మానసికము గా। వున
మానససాత్త్వికం బ ♦ పుమ.ముక్తి కిలన్॥ సీ॥ కామమోహద్వేష
గర్వాదిసహితుఁడై, శరణాగతునిఁ దన ♦ శక్తికొలఁదిఁ। బ్రోవక వి
నాడు ♦ పురుషుని బ్రహ్మహ, త్యాసహస్రము పొందు ♦ నాక్షణంబ। వా
డున్నభూముల ♦ వర్షింపఁ డింద్రుండు, వానికి నిష్కృతి ♦ గాన రాదు
తనపాప మెల్ల నా ♦ ర్తజనుఁ డాతని కిచ్చి, యతనిపుణ్యం బెల్ల
నపహరించు॥ తే.గీ॥ వాఁ డొనర్చిన సత్క్రియల్ ♦ వ్యర్థము లగు,
వానికంటెను బాపాత్ముఁ ♦ డైనవాఁడు। గానఁగా రాఁ డటంచును
బూని తెలిపె। నఖిలశాస్త్రము లైకకం ♦ ఠ్యము వహించి॥ క॥ అఁ
ర్తాధి యయ్యుఁ దనకుం। బ్రపదన మొనరించు నెఱుకుఁ ♦ బాపాత
నిజాంగపిశితమున రక్షించెను। గపోతము మనుష్యుఁ డంత ♦ కన్న న
ముఁడే॥ మ॥ కరముల్ రెండును మోడ్చి దీనుఁ డగుచున్ ♦ గంపించ
గాత్రంబుతో। శరణం బంచును నమ్మి చేరుజనుఁ దా ♦ శక్తాత్ముఁడై
త్రోచుమ। ర్నరునిం బట్టి జముండు హవ్యవహజా ♦ గ్రజ్వాలికాభీలనై

తరణీ రౌరవభూములందుఁ బ్రళయాం ♦ తం బుంచుఁ గ్రుద్ధాత్ముఁడై॥
తే.గీ॥ వేదశాస్త్రంబులను నిట్లు ♦ విష్ణుదేవుఁ। డానతిచ్చియు శరణార్థు♦
లైనవారిఁ। గావకుండునె గజరాజు ♦ కంటె మనుజు। లల్పులే సందియం
బేటి ♦ కయ్య మనకు॥ వ॥ ఇట్టి యార్త ప్రపన్నుండు శరీరావసానసమ
యంబున సకలచేతనసమానంబుగా స్మృతివిరహితుండును గాఢపాషా
ణసన్నిభుండును నుచ్ఛ్వాసమాత్రావశిష్టుండునునై యున్నసమయంబున
భగవత్ప్రేరణంబున నర్చిరాదిదేవత లరుదెంచి తద్దేహంబు వెడలించి
వేఱొండుదివ్యదేహం బొసంగి దివ్యవిమానారూఢుం జేసిన నతం డుత్త
రాయణశుక్లపక్షదివాగ్ని సూర్యపరిపాలిత దేవయానంబునం బోవుచు
భూర్భువస్సువర్మహర్జనతపస్సత్య లోకంబు లతిక్రమించి గ్రహతార
కానక్షత్ర మండలంబులం దాఁటి బ్రహ్మాండోపరిస్థిత హిరణ్మయకటా
హంబు నోరసి తదీయబ్రహ్మ రంధ్రద్వారంబుఁ జొచ్చి పృథివ్యప్తే
జోమరుదాకాశాహంకార మహత్తత్త్వ ప్రకృత్యావరణంబులు లం
ఘించి పథిగతలోకనివాసులచేతఁ బూజితుం డగుచు క్షణమాత్రం
బున విరజానదీప్రాంతంబుఁ జేరి తద్విమానంబు విడిచి పాదచారియై
విభూతిద్వయసంస్థిత యగుతన్నదిలోన సుస్నాతుం డగునట్టిసమయం
బున॥ క॥హరిచేత నియోజితుఁడై। విరజానదిచెంత కేగి ♦ విష్ణుభటా
గ్రే। సరుఁ డగునమానవుఁడు తత్కా। రము కరమ్మునను బట్టఁ ♦ గా నవ్వే
ళన్॥ క॥ విలయ మగు లింగదేహము। కలుషసుకృతవాసనావి ♦ కార
ము లణఁగున్। బులుగడిగినముత్తియముం। బలె నిర్మలుఁ డగుచు నా
త్మ♦భాసిల్లుఁ జుమీ॥ క॥ అంతటఁ జతుర్భుజంబు ని। రంతరతారుణ్య
సహిత♦మసితచ్ఛాయా। వంతము హరితనునిభ మతి। కాంత మగుశరీ
ర మచటఁ ♦ గలుగు నతనికిన్॥ క॥ ఆతరువాత నమానవుఁ। డాతనిహ
స్తంబుఁ బట్టి♦యచ్యుతపురికిం। బ్రీతిఁ గొని పోవుటకు విర। జాతీరస్థి
తమహిజ ♦ సన్నిధిఁ జేర్చున్॥ ఉ॥ అంతటఁ గామినీశతము ♦ లచ్యుతు

పంపున గంధకజ్జలా । నంతలతాంత రత్నమయ ♦ హారకిరీట సువర్ణచేల
ముల్ । చెంతకుఁ దెచ్చినం బ్రియము ♦ చిల్కఁగ వాని ధరించి భక్తుఁ
డ । త్యంతము భాసిలున్ రవిస♦హస్రసమప్రభ లుప్పతిల్లఁగన్॥ చ॥ పర
మపదంబునం గలుగు ♦ భవ్యజనంబులు పెక్కువేలు త । న్నరయుట
కేగుదేరఁ గని♦యందఱుఁ గౌఁగిటఁజేర్చుచుఁ మహా । దరమునఁ బల్క
రించుచును ♦ దండముఁ బెట్టుచు వారితోడ శ్రీ । హరిపురసీమ కేగి
కల ♦ యం గని యబ్బుర మందు నత్తఱిఁ॥ ఉ॥ సూత్రవతీశుసంప్రన
వి ♦ శుద్ధచరిత్రులు హేమరత్నస । ద్వేత్రధరుల్ మహోజ్జ్వలులు ♦ వి
ష్ణుభటుల్ చనుదెంచి యాతనిఁ । స్తోత్రము లాచరించుచును ♦ దూ
ర్యరవంబులతో ధ్వజాళితోఁ । బాత్రలయూటతోడ హరి ♦ పాలికి వే
గొనిపోయి యచ్చటఁ॥ మ॥ ప్రళయాదిత్య సహస్రనిర్భరనిభ ♦ ప్ర
ఖ్యాతనారాయణో । జ్జ్వలతేజఃపటలంబు లొక్కటఁ గనఁ ♦ శక్యం
బు గా దంచుఁ ద । జ్జలజాతాక్షునిమౌళిల హేమమణిభా ♦ స్వచ్ఛిత్ర
నేపథ్య మ । ర్మిలి నిర్మించి ప్రపన్ను నవ్వెలిని సం ♦ ప్రీతిఁ వసిం
పించుచుఁ॥ చ॥ క్రమమున విష్ణుదాసులు తి ♦ రస్కరిణిం బయికెత్త
శౌరిపా । దములును జంఘ లూరులు ని ♦ తంబము నాభి యురమ్ము హ
స్తప । ద్మములు గళమ్ము నెమ్మొగము ♦ మస్తకముఁ ఘనభూషణాయు
ధో । త్తమములతోడ దర్శనము ♦ దాసుఁ డొనర్చి నమస్కరించుచున్॥
క॥ చకితాంతరంగుఁడై త । న్నికటప్రభఁజూడ లేక ♦ నివ్వెఱపడి తా ।
నొకవాక్యం బైనను బ । ల్కక పటికపుబొమ్మగతి ని♦లంబడి యున్నఁ॥
మ॥ కరుణాపూర తరంగితేక్షణములం ♦ గంసాంతకుం డామహా ।
పురుషుం గన్గొనిచెంతకుం దిగిచి సం ♦ ఫుల్లాస్యుఁడై రత్నభా । సుర
కేయూర మహోర్మికావలయవి ♦ స్ఫూర్జజ్జగద్రక్షణా । కరహస్తంబు
తదీయమౌళిపయి వే ♦ డ్కంబెట్టె తా ని ట్లనుఁ॥ మ॥ సకలైశ్వ
ర్యసమృద్ధి గల్గి నిజవి ♦ జ్ఞానంబుపూర్ణంబుగా । నకలంకాకృతితోడ

శాశ్వతసమ ♦ గ్రానంద మొప్పార మా । మకదాసావళిఁ గూడి
మత్పురిని సా ♦ మర్థ్యంబు రెట్టింప ను । త్సుకత న్నిల్వుము
నీయభీష్టములు గూ ♦ ర్తుఁ భీతి నీ కేటికిఁ ॥ మ॥ ధనదారా త్మజ
భోగముల్ విడిచి మ ♦ త్పాదాబ్జకైంకర్యవ । ర్తన మెల్లప్పుడు
పూనుటఁ శ్రమముచే ♦ తఁ ధాత్రిలోఁ గుందు ని । న్గని కా
రుణ్యరసాతిరేక మెసఁగం ♦ గా మత్పురిఁ జేర్చినాఁ । డను నీ కే జన
కుండఁ గాని పెరవాఁ ♦ డం గాను మాటాడరా॥ ఉ ॥ పిమ్మట గొట్టి
యాకరణి ♦ భీతి వహించెద వేల నేను నీ । సొమ్మయి నాఁడ నీతలఁపు ♦
చొప్పున ♦ నింకఁ జరించువాఁడ జి । త్తమ్మున నమ్ము భోగసము ♦
దాయము గొమ్ము పురమ్ము సర్వముఁ । సమ్మతితోడఁ జూడు మని ♦ చక్రి
ప్రియ మ్మెసఁగఁ వచించినఁ॥ క ॥ గడగడ వడఁకుచు నడుగులు ।
తడఁబడ నిశ్చేష్టుఁ డగువి ♦ ధంబునఁ దాల్మిఁ । విడిచి మఱుమాటఁ
బలుక । జడునిగతిఁ దాసుఁ డున్న ♦ సదయుం డగుచుఁ॥ సీ॥
తమ్మిరేకులరీతిఁ ♦ దగు నేత్రములదానిఁ, దలిరులఁ బోలుపా ♦ దముల
దాని। హల్లకంబులమాడ్కి ♦ నలరు చేతులదానిఁ,జంద్రమండలనిభా ♦
స్యంబుదాని । బసిఁడికుండలయోజఁ ♦ బరఁగుచన్నులదాని, బింబఫలా
ధరో ♦ ష్ఠంబుదాని । వల్లికాసుమలస ♦ న్మందహాసముదానిఁ, గాదంబి
నీతుల్య ♦ కచముదాని॥ తే.గీ॥ దివ్యవస్త్రవిభూషణ ♦ దివ్యగంధ।దివ్య
సుమమాలికాంజన ♦ దివ్యసుగుణ । నివహదేదీప్యమానయై ♦ నెగడు
దానిఁ । బాలముస్నిటిపట్టిని ♦ బ్రభుఁడు చూడ॥ చ ॥ మణిమయ
కింకిణీగణస ♦ మంచితకాంచనమేఖలాఝుణం। ఝుణనినదంబు పాదజల ♦
జద్వయనూపురహస్తకంకణ। క్వణనముకర్ణపర్వమయి ♦ క్రాలవిభూషణ
దేహదీధితుల్ । ప్రణుతగతిఁ దిగంతములఁ ♦ బర్వ రమాసతి నిల్చి
యుత్తఱిఁ॥ చ॥ కలువలు తోరణావళులు ♦ గట్టి కదల్చినభంగి సారస।
మ్ములు వికసించుపోల్కి ఝష ♦ ముల్ మదసంపద దాఁటు కైవడిఁ ।
పొలకరిమించుమించు తెగ ♦ దోఁచి తళత్తళలాడుమాడ్కి భా । సిలుకరు

కాకటాక్షముల ♦ శ్రీసతి యాతనిఁ జూచునంతటన్॥ సీ॥ సలలితా
ష్టైశ్వర్య ♦ సంపూర్తి వరియించు, సకలలోకాధిక ♦ జ్ఞాన మొదవుఁ।
బద్మాక్షుసన్నిభ ♦ ప్రబలశక్తి లభించుఁ, బ్రకటవేదాంతవా ♦ క్పటిమ
పొసఁగు। నిరుపాధికాత్మైక ♦ నిబిడభక్తి జనించు, శేషత్వ మపరోక్ష ♦
సిద్ధ మగును। స్వానంద వార్ధి దే ♦ హం బెల్లఁ గప్పును, గల్యాణగుణ
సమ♦గ్రత వెలుంగు॥ తే.గీ॥ వింతయును భీతియుఁ దొలంగు ♦ విపులధృ
తియు। శ్రద్ధయును దయ మేధల ♦ జ్జయు విశుద్ధి। చెంతఁ జేరును బరి
చయ♦వంతునట్లు। దాసుఁడలరును శ్రీదేవి ♦ దయను జూడ॥ ఉ॥ నీవు
మదీయపుత్త్రికవు ♦ నీకు సమస్తశుభంబు లిచ్చితిం। గావునఁజూడునీజం
నకుఁ ♦ గంజదళాక్షుని మేరుశైలసం। భావితరత్నకాంచనవి ♦ భాపరి
పూర్ణమృగేంద్రదివ్యపీ। ఠావసథున్ జగత్ప్రభు న ♦ టంచురమాసతిపల్కె
దాసుఁడున్॥ మ॥ సరసీజాప్తకిశోరదీధితులు భా ♦ స్వచ్చక్రచాపాసిచా।
మరపద్మాంకుశశంఖమత్స్యముఖస ♦ మ్యక్సౌమ్యరేఖాధురం। ధరముల్
వజ్రమయాంగుళీయవలయో♦ ద్యన్నూపురాన్వితముల్। పరమోత్కృ
ష్టము లైనతద్వనధిజా ♦ పాదంబు లీక్షించుచున్॥ ఉ॥ దండమువిష్ణువల్ల
భ కు ♦ దంచితమంగళభూమికిన్ నతా।ఖండలశర్వముఖ్యసుర ♦ కంజద
ళాక్షికి వార్ధికన్యకున్। మండితరత్నకాంచనస♦మగ్రవిభూషణభూషితాం
గికిం। బండితగేహవాస కని ♦ పల్కుచు మ్రొక్కె నతండు భక్తితోన్॥
తే. గీ॥ ఇట్లునతిచేసి శ్రీసూక్త♦మింపుతోఁ బఠించి వినుతించి తత్కృప ♦
గాంచితాను। మున్న పడ్డ శ్రమం బెల్ల♦విన్నవించి।మఱితదాజ్ఞ ముకుం
దునుం♦ దరను నిల్చె॥వ॥ తదభిముఖుండై ఘర్మవేళామధ్యందినప్రచండ
మార్తండ మండలార్బుదంబు లొక్క మొగి గగనమండలంబెల్ల నిండి
యుండుచందంబునఁ బ్రళయసమయసముదితజలధరపటలగర్భకుహరజని
తబహుళవిద్యుల్లతానీకంబులు రోదోంతరంబునం దెడ తెగక నిలిచి
యున్నవిధంబునఁ దోఁచు తేజోమండలంబులోపలవార్ధికావసరసముత్థిత

కాదంబినీవినీలవిగ్రహుండును హారకటకకిరీటకేయూర మంజీరాంగుళీయకకుండలకాంచీగ్రైవేయక కౌస్తుభప్రముఖానర్ఘమణివిభూషణవిభూషితుండును రత్నసింహాసనోపరివిరాజమానశేషపర్యంక సమాసీనుండును దష్టజాంబూనదాంబరుండును దివ్యమాల్యానులేపనతాంబూల శోభితుండును విశుద్ధోభయ పార్శ్వగత సుందరీసుందరతరకరారవిందగత హైమదండమండిత చామరవ్యజనసంవీజ్యమానుండును నాఖండలశుండాలశుండా దండమండితాఖండ చతుర్భుజ విరాజమానసుదర్శన పాంచజన్యాదిదివ్యాయుధుండును ధర్మాధర్మాభిమాన వేదాభిమానకాలాభిమాన ప్రకృత్యభిమాన పరమపదాభిమాన క్షేత్రజ్ఞాభిమాన యోగాభిమాన వేదాంతాభిమాన ప్రముఖదేవతా జేగీయమాన చరణకమలుండును సౌందర్య లావణ్య గాంభీర్య ధైర్య స్థైర్య వీర్య సౌలభ్య సౌశీల్య వాత్సల్య ప్రముఖ నిత్య నిరవద్య నిరతిశయ నిర్మల నిరుపమానానవద్య హేయప్రతిభటాసంఖ్యేయ సహజ మంగళగుణగణాధారుండును జరణకమలనిష్ఠ్యూత సౌందర్యమరంద ధారా విభ్రాంతిప్రద జాహ్నవీ ప్రవాహుండును సులలితమృగమదతిలక విలసితవిపులఫాలతలుండును నిర్హేతుకజాయమానానూన కరుణారస పరిపూర్ణ ప్రఫుల్ల పుండరీక సంకాశ విలోచనుండును వదనరాకేందుమండల చంద్రికాయమానమందస్మి తాధికరణ బింబఫలనిభాధరుండును జతుర్ముఖముఖోద్భూత ఋగ్యజుస్సామాథర్వణవేదనినాద ముఖరిత నాభీసరోరుహుండును శ్రీమదిందిరాసుందరీ సుందరతర పురందరమణిమయ మందిరాయమాన విశాలవక్షఃస్థల విభాసమానాసమాన శ్రీవత్స కౌస్తుభ వైజయంతీ వనమాలి కాభిరాముండును ననంత గరుడ విష్వక్సేన నిత్యసూరి సంసేవితుండును నారద ప్రహ్లాద పుండరీక పరాశర వ్యాసాంబరీష ముఖ భక్తగణ స్తూయమానుండును విమలాదిశక్తిపరివేష్టిత పాద పీఠుండును నైన శ్రీమన్నారాయణుం గాంచి తదీయ చరణకమలంబులకు సా

ష్టాంగ దండప్రణామంబు లాచరించి లేచి ముకుళితహస్తుండును వినమ్ర శీర్షుండును విగతశ్రముండును భక్తిపరవశుండును నగుచుఁ బురుషసూక్తంబున నారాయణ మహా నారాయణ మహోపనిషద్వాక్యంబుల వినుతించి యపరాధక్షమణంబు వేఁడుచున్న దాసునిం గని భగవంతుం డిట్లను॥ తే.గీ॥ పరమపదమందు మది కింపు ♦ వఱ్ఱచోట, నీవు వసియింపు మచ్చోట ♦ నేను సిరియుఁ। గూడి నిల్తుము నీమది ♦ కోర్కులెల్ల। సంతత మొసంగుచును నీకు ♦ సఖుల మగుచు॥ మ॥ అనినారాయణుఁ డానతిచ్చినఁ దదీ ♦ యాజ్ఞన్ శిరంబందుఁ దాల్చి। కొని లక్ష్మీసతికిన్ ముకుందున కసం ♦ కోచంబుతో మ్రొక్కి ని। త్యనివాసాంతిక భూమి నొక్కయెడ దీ♦వ్యద్రత్నసౌధాంతరం। బున సంవాస మొనర్చి యుండు నతఁడం ♦ భోజాక్షుఁ బూజించుచున్॥ క॥ అనుచున్ ముక్తజనమ్ముల। ఘనచరితము గురుఁడు సెప్పఁ ♦ గా విని యతనిం। గని యజ్ఞశర్మ యాదవు। లనుశిష్యులు పరమపదమ ♦ హత్త్వ మడిగినన్॥ వ॥ రామానుజుం డిట్లనియె॥ క॥ విరజానది కవ్వలఁ దగు। పరమపదము దాని వినినఁ ♦ బంచజనులకున్। హరికరుణచేత మోక్షము। దొరకొను నని బుధులు చెప్పు ♦ దురు మోదముతోన్॥ మ॥ అమలం బవ్యయ మప్రమేయ మజరం ♦ బానందరూపంబు శాం। తము తేజోమయ మాదిమధ్యలయ శూ ♦న్యంబున్ మనోవాగగ। మ్యము నారాయణ తత్త్వతుల్యము తదీ ♦ యస్థాన మం చాగమాం। తము లెల్లన్ వచియించియుం దెలిపె గా ♦ ణస్ఫూర్తిఁ దత్పద్ధతుల్॥ సీ॥ పరమేష్ఠిముఖ మహో ♦ పనిషన్మయాంగంబు, భానుకోటిప్రభా ♦ బంధురంబు। జ్ఞానశక్తిబలాది ♦ షడ్గుణపరిపూర్ణ, మాదిమధ్యాంత శూ ♦ న్యప్రభవము। దివ్యాంగయుతవాసు ♦ దేవైకభోగ్యంబు, విక్రియాహేయత్వ♦ విరహితంబు। వాచామనోవృత్తి ♦ వర్తనాగమ్యంబు, గోవిందదాసాను ♦ కూలరూప॥ తే. గీ॥ మపరిమిత మఘపరిహిత ♦ మతుల మమర। గణ

వినుత మజరమును దుః ♦ ఖమతిసుఖద । మగుచుఁ దత్పరమవ్యోమ♦
మందు వఱ్ఱు । ణాప్రకృతి త్రిచరణభూతి ♦ నావెలుంగు ॥ మ ॥ ఇన
చంద్రానల విద్యుదాదికవిభా ♦ హీనంబుగాఁ దప్తకాం । చనమాణిక్య
మరీచులం బ్రబలతే ♦ జఃపుంజసంయుక్తమై । కనదారామగిరీంద్ర
పట్టననదీ ♦ గ్రామవ్రజాన్వీతమై । జనసంపూజితమై వెలుంగుఁ బరమ ♦
స్థానం బనూనంబుగన్॥ సీ॥ కర్పూరచందన ♦ కస్తూరికాకోటి, బంధురం
బచ్చోటి ♦ గంధగుణము । శర్కరామృతపయ ♦ స్సాంద్రమాధుర్య
ధు, రంధరం బచ్చోటి ♦ రసగుణంబు । ఘర్మావసరమధ్య ♦ గతనిర్బ
దార్కసం, యోగ మచ్చోటి తే♦జోగుణంబు । కఠినస్తనీస్వాయం♦గ్రాహ
సౌఖ్యార్బుద, సాదృశ్య మచటిసం♦ స్పర్శగుణము॥ తే. గీ॥ షడ్జమధ్య
మగాంధార ♦ సహితగాన । శతసుఖప్రద మచ్చోటి ♦ శబ్దగుణము ।
సంతతముకుందపాదాంబు ♦ జద్వయప్ర । చారసంయుత మచటివి ♦
జ్ఞానగుణము॥ క॥ కాలాతీత మచంచల । మాలస్యజడత్వశూన్య ♦ మప్రా
కృత ము।త్తాలధ్వజగోపురసా । ధాళీసంయుతము తత్ప♦రాకాశ మగుఁ॥
తే.గీ॥ కోటిసూర్యప్రకాశంబు ♦ కోటిచంద్ర । శీతలంబు నిజాంశువి ♦
ద్యోతమాన । మర్చిరాదిపదాభిగ ♦ మ్యంబు యోగి । కామితార్థంబు
తత్పరా ♦ కాశ మెన్న॥ మ॥ మురజిద్దివ్యభవత్త్వమంగళగుణం ♦ బుల్
దెల్ప లే న్నలు త । త్పరమవ్యోమనివాస దాసజనదీ ♦ వ్యద్వర్తనాకార
ముల్ । వరుసన్ శేషవిరించివాక్పతులకున్ ♦ వాక్రుచ్చి వర్ణింపఁగాఁ ।
దరముం గా దన నేను దెల్పఁగలనే ♦ ధారాళవాక్యంబులన్॥ సీ॥ అణు
మాత్రదేశంబు ♦ నం దజాండావళుల్, రచియింపఁగాఁ జాలు ♦ రుచిర
శక్తి । తా రున్నచోట సం ♦ తత ముండియును సర్వ, దేశముల్ చరి
యించు ♦ దివ్యమహిమ । యతిసూక్ష్మలయ్యు షు ♦ గార్థంబులోన వి,
భూతిద్వయము గాంచు ♦ భూరివిద్య । నిమిషంబులోపల ♦ నిఖిలవేదం
బులు, పారాయణ మొనర్చు ♦ ప్రౌఢిమంబు॥ తే.గీ॥ గలిగి శ్రీశానుకూ

లని ♦ ర్మలనిజస్వ । భావులు నధోక్షజార్చన ♦ ప్రవణు లమిత । హారిప
దాంబుజభ_క్తియు ♦ క్తాత్ము లగుచుఁ । దనరు చుందురు పరమప ♦ దస్థ
జనులు॥ మ॥ పరమవ్యోమమునన్ వెలుంగుసకల ♦ ప్రాణుల్ మహానంద
బం । ధురు లుత్కృష్టతరప్రభోధులు విశు ♦ ద్ధుల్ చక్రికైంకర్యత । త్పరి
నిర్నిద్రతరప్రచారు లురుస♦ త్త్వప్రౌఢిమాధ్యుల్ పర। స్వరతుల్యాంగవ
తుల్ విశోకు లజరుల్ ♦ శాంతస్వరూపుల్ చుమీ॥ మ॥ సకలప్రాణుల
తత్పరంబున నిజే ♦ చ్ఛాసిద్ధనానావిధాం । గకు లాత్మేశ్వరబద్ధశుద్ధహృ
యుల్ ♦ కంసారిదాస్యప్రచా । రకులున్ వర్జితకామలోభమదగ
ర్వద్వేషశోకాదికుల్ । ప్రకటార్కానలకోటి దీధితియుతుల్ ♦ ప్రజ్ఞాప్ర
చారాన్వితుల్॥ క॥ స్వర్గస్థితుండు నారక । దార్గత్యముఁ బొందునరువి
ధంబున వేధో । భర్గసురేంద్రముఖాండాంతర్గతులన్ వారు చూచె ♦ దర
సతతంబున్॥ సీ॥ ఒరులచే నగుబాధ ♦ లొక్కించుకయు లేవు, కామలో
భాదులు ♦ గాన రావు । మరణజన్మము లను ♦ మాటయు విన రాదు
నిత్యసుఖం బెందు ♦ నిండి యుండుఁ । గామితార్థములు త ♦ త్కాలం
సిద్ధించు, దారిద్ర్యమును రోగ ♦ తతులు వింత । షడ్గుణాష్టగుణముల్
సంతతంబు వెలుంగుఁ, దలఁచినరీతి మా ♦ ధవుఁడు దిరుగు॥ తే.గీ॥ నిత
నిరవద్యనిస్తుల ♦ నిరతిశయని । తాంతనిర్మలనిజసము ♦ ద్యత్ప్రబోధ
నిఖిలలోకంబులం దెల్ల ♦ నిండి యుండుఁ । దరమె వర్ణింపఁ బరమప
దస్థ మహిమ॥ చ॥ తనయులఁ బ్రోచుకార్యములు ♦ తల్లియుఁ దండ్రి
యొనర్చి సమ్మదం । బనుదిన మందుచందమున ♦ నంబుజనాభుఁడు ము
జీవుని । చ్ఛ ననుసరించి ద్రిమ్మరుచు ♦ సంతస మొందుటఁ జక్రిదాస్య
_ర్తనమున వాని కించుకయుఁ ♦ దాపము పుట్ట దనున్ జుమీ శ్రుతుల్
శా॥ మాతంగాశ్వరథాదికంబు విలస ♦ న్మాణిక్యజాంబూనదస్ఫీ
తాందోళికలున్ నటీనటులు దా ♦ సీదాసులున్ వాద్యసం । ఘ
తంబున్ గరదీపికాళులు పతా ♦ కల్ ఛత్త్రముల్ తానె యై

యాతం డచ్యుతు నుత్సవప్రతతి ని ♦ త్యం బచ్చటం జేసెడిన్॥ క॥ అ
చ్చటి కేగినజనములు । ముచ్చటకున్ మరలి రారు ♦ మురమర్దనుతో ।
నచ్చుపడి యుందు రిచ్చకు । వచ్చినగతిఁ దిరెగద రని ♦ వారితు లగు
చున్॥ మ॥ సకలామ్నాయవిదుండు వ క్తయు వయ ♦ స్సంపూర్ణుఁ డా
ర్యుండు రా । జకులీనుండు నరోగి శౌర్యబలవి ♦ స్తారుండు వేగాధికుం ।
డకలంకుం డతిసుందరుండు సకలా♦ర్థాన్వితభూచక్ర నా । యకుఁ డైనట్టి
మనుష్యునంమఁ దగు మ ♦ ర్త్యానంద మత్యున్నతిన్ ॥ తే. గీ॥ మానవా
నందశత మేక♦మైన నపుడు । మనుజగంధర్వులందు సా♦మర్థ్యయుతున।
కొక్కయానంద మగు నది ♦ యుండు నంద్రు । శ్రోత్రియుం డైనకా
మసం ♦ శూన్యునకును॥ సీ॥ మనుజగంధర్వస ♦ న్మానితానందశ, తము
గూడి దేవగం ♦ ధర్వతతుల । కొక్కయానందమై ♦ యుండుఁ దదానం
ద, శతము గూడినఁ బిత్రు ♦స్థలసనాత । నస్థుల కొక్కయా ♦ నందమై
తగు నవి, శత మైన నాజాన ♦ జత్రిదశుల । కొక్కయానందమై ♦
యుండుఁ దచ్ఛతము క,ర్మామరానందమై ♦ యమరుఁ దచ్ఛ । తము
సురానంద మగుఁ దచ్ఛ♦తంబు గలిసి॥ తే. గీ॥ యమరపతి కొక్కయా
నంద ♦ మగును దచ్ఛ । తము బృహస్పతి కొకప్రమో ♦ దం బి వెల్లఁ।
గలుగు శ్రోత్రియుఁడైనని ♦ ష్కామకునకు॥ క॥ అమరాచార్యానందశ ♦
తము కశ్యపముఖ్యులకును ♦ దగ నేకానం । ద మగు నవి నూఱుగూ
డిన। నమరుం బద్మజున కొక్క ♦ యానందంబై॥ క॥ కామవిరహితశ్రో
త్రియుఁ। డీమహితానందశతము♦లెల్ల వెలుంగన్ । భూమిఁ జరియించుఁ
బరమ । వ్యోమానందము తదర్బ్య♦దోన్నతము సుమీ॥ క॥ ఇట్టిమహా
నందము లా । పట్టునఁ గలజీవతతికి ♦ బహుశతకోటుల్ । దిట్టముగఁ
గలుగు బోధయు । నట్టిదమై వెలుఁగుచుండు ♦ ననవరతంబున్॥ క॥
అందుఁ బ్రమోదనపుర మా । నందప్రదమై వెలుంగు ♦ నవసారసపూ।
ర్ణేందురుచిరమందరధర । సుందరతరవదనకాంతి ♦ శోభిత మగుచున్॥
సీ॥ ఆపరవ్యోమంబు ♦ నందుఁ గాంచనరత్న, ఘటితమ్ములు విచిత్ర ♦

కల్పనములు । బహుయోజనోన్నత ♦ ప్రాకారములు మూఁడు, గలి
జాంబూనద ♦ నిలయములును । వజ్రసౌధములు సౌ♦వర్ణగోపురములు
మణిహేమమయకుట్టి ♦ మస్థలములు । బలభేదిరత్నసో ♦ పానములే
ముక్తావి, తానజాలకము లు♦ద్యద్విమాన॥ తే.గీ॥ సముదయము లొప్ప
నూఱు యోజనము లాయ।తమ్మునంతియె మఱి విశా♦లమ్మునగుచుఁ।బ
గుచుండుఁ బ్రమోదన♦పురము దాని।యందు వసియించు ననిరుద్ధుఁ♦డ
ముదమున॥మ॥ మదదంతావళకోటినిర్భరదసద్ర♦జ్యధ్యస్థలోచ్చాభ్రియ్యమై
యుదయాదిత్యసహస్రదీధితిచయం♦బొకుఁ మ్మడిం దిక్కులం । బొదువ
ద్రష్టృనిరీక్షణప్రతిహతిం♦ బుట్టించుచుం జిత్రసం । పదలం బూను చ
కరత్నరచిత ♦ ప్రాకార మచ్చోఁ దగుఁ॥ ఉ॥ అంబరమధ్యభాగసము
దంచితభానుశతాయుతప్రభా । డంబరమై మురాంతకభ ♦ ట వ్రజసం
తియోగ్యశీర్షమై । తుంబురునారదాదిముని ♦ ధూర్జటికోటినుతప్రభ
వమై । యంబుజరాగదుర్గమున ♦ కవ్వల వజ్రపుకోట భాసిలుఁ॥ శా
ప్రావృట్కాలపయోధరాంతరతటి ♦ ద్వ్రాతప్రభాన్వితమై । లావణ్యా
కనూత్నచిత్రయుతమై ♦ రాజన్మహాఖేయమై । భావాతీతపటుప్రతా
యుతదీ ♦ వ్యద్యోధసంవాసమై । సౌవర్ణోజ్జ్వలదుర్గ మావెలి విరా
జద్వల్లిత్తితో భాసిలుఁ॥ చ॥ మరకతనాళసంయుతస ♦ మంచితకాంచ
హల్లకాంబుజో । త్కరఘనవాసనాన్వితసు ♦ ధారసపూరతరంగజాతశీ
కరపరిపుష్టకూలగత ♦ కర్బురసాలచయమ్ములై సరో । వరములు పెక్కు
వేలు చెలు ♦ వమ్ముగఁ దత్పురమందు భాసిలుఁ॥ చ॥ సరసులు నూత
లుఁ నదులు ♦ జక్కరలున్ దిగుమెట్టుబావులుం । జెఱువులు బట్టె లచ
టఁ బ ♦ సిండితోవల్ రతిసంపుఁదమ్ములున్ । సురుచిసమన్వితామృతవి
శుద్ధసుశీతరసంబు లొప్ప శా । ఘరబకహంససారసవి♦ భావటలోజ్జ్వలిత
బులై తగుఁ॥ శా॥ అంభోజాక్షులు కంకణాంగదవిశు ♦ ద్ధాజానుజ
హార్గళుల్ । జంభారాతిశిలాసితాంగసహితుల్ ♦ సౌవర్ణచేలావృతుల్
శుంభద్విక్రము లిందుకోటివిలస ♦ చ్ఛోభాన్వితుల్ సద్గుణా । దంభు

చక్రిభటుల్ చరించెదరు త ♦ త్ప్రాకారమధ్యంబులన్॥ మ॥ నవరత్న
ద్యుతిధాగధగ్యసహితాం ♦ తర్గేహసౌవర్ణసం । స్తవనీయోన్నతపంజ
రాంతరవిరా ♦ జచ్ఛారికాకీరముల్ । కవనంబుల్ హరిపై ఘటించి ♦
యెలమిన్ ♦ గానంబు గావింప భా।గవతవ్రాతము లాలకింతురు మహో♦
త్కంఠంబుగా నచ్చటన్॥ సీ॥ కలువపూదండలు ♦ గదలించుగతిఁదోఁచు,
బెళుకుఁజూపులతళ ♦ త్తళలతోడ । బలుహజ్జమెకముల ♦ చెలువమ్ము
హసియించు, రమణీయమందయా ♦ నములతోడ । శారదచంద్రికల్ ♦
జగము గప్పినజాడఁ, దనరారుమందస్మి ♦ తములతోడ।శారికాపికకీర ♦
సముదాయములఁగేరు, మధురవాక్యములసం ♦ పదలతోడ॥ తే.గీ॥గంధ
కర్పూరవీటికా ♦ కజ్జలాంక । నములతోడను బుష్పదా ♦ మములతోడ।
వజ్రమయదివ్యభూషణా ♦ వళులతోడఁ । బరఁగుచుందురు భామ ల ♦
ప్పురవరమున॥ మ॥ జలజాతప్రతిమాననేత్రములు రా ♦ జద్రాజబింబా
నన । ములు సౌవర్ణఘటస్ఫుట స్తనయుగం ♦ బుల్ సింహమధ్యంబు లు।
జ్జ్వలకాన్తస్వరవల్లిభాంగములు భూ ♦ చక్రాంచితశ్రోణులున్ । జలద
శ్యామకచంబు లొప్ప హరిపూ ♦ జల్ సేతు రచ్చో సతుల్॥ ఉ॥ హాట
కరత్నసంఘటిత ♦ హర్మ్యములందు వసించి భూమిభృ । త్కోటి హ
సింపఁజాలుచనుఁ ♦ గొండల నంటఁగ వీణలూని య । చ్చోట వసించు
ముక్తు లతి ♦ చోద్యముగా విని సంతసింపఁగాఁ । బాటలగంధు లచ్యు
తునిఁ ♦ బాడెద రంచితభక్తియుక్తలై॥ తే.గీ॥ అచటికాంతల వర్ణిం
ప ♦ నబ్జభవుని । కైన శక్యంబు గాదు వే ♦ యనఁగ నేల । యచట
వసియించుకోఁతితో ♦ నైన సాటి । రాదు మనయూర్వశియు మన ♦
రంభ వింటె॥ శా॥ భేరీశంఖమృదంగ తుంగపటహా ♦ భీలధ్వనుల్
భూరిసై । న్యారావంబులు మింటఁ బర్వ జలద ♦ శ్యామోన్న
తాంగంబు చె।న్నారం బర్వతరాజతుల్యసితవే ♦ దండస్థుఁడై వైష్ణవా।
చారంబుల్ తగఁ బోఁచుచున్ దిరుగు వి ♦ ష్వక్సేనుఁ డుద్యద్గతిన్॥

ఉ॥ కాంచనపత్రదీధితులు ♦ కాలసముత్థిత చంచలావళిన్ । మించి వెలుంగ వజ్రనఖ ♦ నిర్మలదీప్తులు భానుమండలో । దంచితవృత్తి నొప్పఁ గులి ♦ శాధిక తీవ్రతరప్రభాలస । చ్చంచువుతోడ నప్పరిని ♦ సంతతమున్ గరుడుండు దిప్పరున్॥ మ॥ హతనక్రంబు నిజాంగవల్గనసము ♦ ద్యద్ధూళిరిన్రగ్నాదని । ర్జితరాత్రించర యోధచక్ర మయుత ♦ గ్రీష్మార్క బింబప్రభా । తతినిర్వక్రము రాహునిర్దళనజా ♦ తస్థైర్యసంతుష్టసూర్య తుషారద్యుతిశక్ర మాచు హరిచ ♦ క్రం బప్పరిఁ భాసిలున్॥ మ॥ అరవిందాహితకోటిదీధితియుతం ♦ బై దక్షిణావర్తసుం । దరమై రత్నసువర్ణ సంకలితమై ♦ దైతేయసేనాభయం । కరభూరి ధ్వనికారియై దివిజసం ♦ ఘస్తుత్యమై కంసభి । త్కరసంస్థం బగుపాంచజన్యఘనశం ♦ ఖం బప్పరిన్ భాసిలున్॥ క॥ మణిమయ దండయుతమ్ములు । గణనాతీతములు తప్త ♦ కాంచనచేల। ప్రణుతములై గరుడధ్వజ । గణములు తత్పట్టణమునఁ ♦ గర మొప్పుఁ జుమీ॥ సీ॥ ఘనబృంహితధ్వాన ♦ గర్జితంబులు గల్గి, జలధరమ్ములఁ బోలు ♦ సామజములు । చంద్రాతపోజ్జ్వల ♦ చ్ఛవులతోఁ బాలేటి, తెరలవై ఖరిఁ దోఁచు ♦ తురగములును । మణికింకిణీఝణం ♦ ఝణనిక్వణములతో, నలరారుచున్నశ♦తాంగములును । గొదమసింగముల సం ♦ పద హరింపఁగఁ జాలు, వి క్రమంబులు గల్గు ♦ వీరభటులుఁ॥ తే. గీ॥ గలిగి భేరీపటహశంఖ ♦ కాహళోరు । దుందుభీముఖవాద్యసం ♦ దోహజనిత । మహితరవముల శబ్దాయ ♦ మానమగుచుఁ । బరఁగుఁ దత్పురి కన్నుల ♦ పండువుగను । ఉ॥ విరజామధ్యగతామి తామృతరసా ♦ విఖ్యాత కల్హారవారిరుహామోద భరాలసాలసములై ♦ క్రీడావనాంతస్థితా । మరధాత్రీజలతాంతసంతతిగళ ♦ న్మారందధారాపరం । పరలన్ సిక్తములై సమీరములు పే్రి ♦ మన్ దత్పురిం ద్రిమ్మరున్॥ మ॥ జవనారట్ట జకోటి పాటవవిరా ♦ జద్భంగసంఘాతసం । భవసంపూర్ణఘుమంఘుమారవ సము

త్పన్న ప్రతీతిధ్యానసం । స్తవనీయో భయభాగకూలగతభా ♦ స్వత్కాం
చనత్సౌజదీ। ప్తవనంబై విరజాతరంగిణి సము♦ద్యత్స్ఫూర్తితో భాసిలున్॥
క॥ ఘన మగుప్రమోదపుటభే । దనమునఁ దనరారుసంప ♦ దల నొ
కలవ మే । వినిపించినాఁడఁ దత్పర । మునఁ దగువైకుంఠవిభవ ♦ ము
న్నీనుఁ డింకన్॥ సీ॥ యోజింపఁగ సహస్ర ♦ యోజనాయతము త,దర్ధ
విశాల ము ♦ ష్ణాంశుకోటి । తేజంబు రత్నమం ♦ దిర హేమగోపుర,
వజ్రమయధ్వజ ♦ వ్రాతకాంచ । నాట్టాలకము మణి ♦ కుట్టిమస్థలమును,
మరకతమయసౌధ ♦ మండితంబు । నమృతనిర్ఝరము క ♦ ల్పాగమ
యారామ, బహుళంబు శ్రీసతీ♦పద్మదాభ ॥ తే.గీ॥ సదృశపుం యావ
తము బహూ♦ చ్ఛ్రాయ హేమ । రత్ననిర్మిత పంచమా♦ర్గంబు నగుచుఁ♦
దనరు వైకుంఠ మాపరం♦ధామమందు । నచటఁ బ్రద్యుమ్నుఁ డెలమి
తో ♦ నధివసించు॥ సీ॥ అమితాహ్వదాయామ ♦ మమితవిశాలమ, ర్కా
గ్నివిద్యున్మధ్య ♦ మంచితప్ర । భూత తేజఃపుంజ ♦ మాతతమణిసువ, ర్ణా
గారచంద్రశా ♦ లాన్వితంబు । మణిమయవేదికా ♦ గణ మింద్రనీలధ్వ,
జానీక మంబుజా♦తాంచితోరు । దాసగణంబు శ్రీ ♦ తరుణీనిభాంగనా,
సముదయం బమృతర ♦ సప్రపూర్ణ॥ తే.గీ॥ వాహినీసంయుతంబు న ♦
వచనహృదయ । గమ్యమును దుర్గసప్తక♦కలిత మగుచు । వఱలు నమ్మో
దనా హ్వయ ♦ పురము దాని । యందు సంకర్షణుండు చె♦న్నారు
చుండు॥ శా॥ ఆనందాఖ్యపురంబు దానికిఁ బరం ♦ బం దొప్పుఁ దేజో
ధిక । జ్ఞానానందమయంబు హేమమణిభా ♦ స్వత్కుట్టిమోద్భాతసం ।
తానత్సౌరుహకల్ప వృక్షకుసుమో ♦ ద్యద్వాసనాబంధురో । ద్యానా
రామ సమాగతానిలకిశో ♦ రాక్రాంతసౌధాళియై॥ మ॥ హరిదశ్వా
యుత కోటిదీ ధితిసమే ♦ తాత్యున్నతద్వాదశా । వరణోపేతము నిత్య
మంగళరవ ♦ వ్యాప్తంబు మాణిక్యభ । వ్యరుచిస్ఫీతము యోజనార్బుద
విశా ♦ లాయామమై యొప్పు త । త్పురమం దుండును వాసుదేవుఁడు

జగ ♦ త్పూజ్య ప్రభావంబుతోన్॥ సీ॥ శతయోజనోచ్ఛ్రాయ ♦ సౌవర్ణ
సౌధముల్, మరకతమయకుట్టి ♦ మస్థలములు । పుష్యరాగోజ్జ్వల ♦
భూరిమందిరములు, గోమేధికాంచిత ♦ గోపురములు । శక్రోపలోజ్జ్వల ♦
చ్ఛాదనంబులు సాంద్ర, శౌక్తికోరువితాన ♦ జాలకములు । మాణిక్య
ఘటితస ♦ మంచితవేదికల్, వైడూర్యనిర్మిత ♦ ధ్వజచయములు ॥
తే.గీ॥ విద్రుమ స్తంభములు నర ♦ వింద రాగ । ఘనకవాటంబులునుశంఖ ♦
కాహళాది । వాద్యఘోషంబులును వేద ♦ వాదకోటి । గలిగి తనరారు
శ్రీకాంతు ♦ నిలయ మచట॥ తే.గీ॥ అందు మధ్యందినార్కచ్ఛవి ♦ భాస్వి
తంబు । విద్రుమ స్తంభసాహస్ర ♦ విలసితంబు । ప్రబలసుజ్ఞానమయము
ప్ర ♦ పన్నకోటి । భాసురం బైనయొకమండ ♦ పంబు గలదు॥ క॥ ఆమం
డపమధ్యంబున । శ్రీమంతం బైనరత్న ♦ సింహాసన ము । ద్దామాకృతిఁ
దనరుఁ ద్రయీ । భామాపరివేష్టితాష్ట ♦ భాగం బగచున్॥ తే.గీ॥ అ
ష్టవర్ణ దళాన్వితం ♦ బతివిశాల । మధిక తేజోవి రాజితం ♦ బైనదలము।
దానిమీఁద వెలుంగుఁద ♦ త్పద్మగర్భ । మందు మాణిక్యకర్ణిక ♦ యల
రుచుండు॥ ఉ॥ దానిపయిన్ సుధాంశుశత ♦ ధామముతోడ ఫణాసహ
స్రస । న్మానితరత్నదీధితిస ♦ మగ్రతతోడ శిరీషమల్లికా । సూనమరాళ
తల్పమృదు ♦ శుద్ధశరీరముతోడ సామబు । ద్గానముతోడ నొప్పు
నుర ♦ గప్రభుఁ డంచితభక్తియుక్తుఁడై ॥ఉ॥ ఆతని దేహమందు ధవ ♦ ళాంబు
జనేత్రుఁడు వేదశాస్త్రవి । ఖ్యాతచరిత్రుఁ డంబుదస ♦ మంచితగాత్రుఁడు
ఘోరపాతక । వ్రాతతమోబ్జ మిత్రుఁ డమ ♦ రవ్రజకాననచైత్రుఁ
డిందిరా । త్మాతరుణీకళత్రుఁ డగు ♦ చక్రధరుండు వసించుఁ బ్రీతి
తోఁ॥ ఉ॥ హారకిరీటకుండలస ♦ మంచిత నూపురమేఖలాదివి । స్తార
విభూషణావళులు ♦ దాల్చి సువర్ణపటంబు మేనఁ జెల్వారఁగ । దివ్య
గంధకుసు ♦ మాంజనముల్ తగ దిద్ది మేలిక । స్తూరిని బొట్టు పెట్టు
కుని ♦ తోయజనాభుఁడు చూడ భాసిలున్ ॥ శా ॥ శ్రీభూనీలలు
నిత్యముక్తులును బ ♦ క్షిశ్రేష్ఠుఁడున్ యోగవి । ద్యాభామామణి

మూర్తిమత్ప్రకృతి ధ ♦ ర్మాధర్మకాలత్రయీ। శోభైశ్వర్యధృతిస్మృతుల్
విజయుర ♦ క్షోనాథపుత్త్రాదినా। నాథక్ష్మాగ్రణులుం జమూపతియు నా ♦
నందంబుతోఁ గొల్వఁగన్॥ తే.గీ॥ శంఖచక్రగదాఖడ్గ ♦ శార్ఙ్గములును।
వైజయంతియు వనమాల ♦ వనధికన్య। కయును శ్రీవత్సచిహ్నంబు ♦
కౌస్తుభంబు। వేడ్కతోఁ బూని దనరారు ♦ విష్ణుఁ డచట॥ సీ॥ జలజ
సన్నిభపాద ♦ ములు కమఠోపము, ప్రపదముల్ కమలగ ♦ ర్భప్రశస్త।
జంఘికల్ కరికర ♦ సదృశోరువులు గొప్ప, పిఱుఁదులు నిమ్ననా♦భియు
మృగేంద్ర। మధ్యంబు వటపర్ణ ♦ మహితోదరమ్ము వి,శాలవక్ష మసిత♦
స్తనయుగంబు। నాజానుదీర్ఘబా ♦ హాచతుష్టయ మున్న, తాంసముల్
శంఖస ♦ మగ్రగళము॥ తే.గీ॥ చంద్రబింబాననము బింబ ♦ శతసమాధ।
రము సునాసయు వరకపో ♦ లములు పద్మ। నయనములును నవాంకక ♦
ర్ణములు విపుల। ఫాల మసితాలకములు శ్రీ♦పతికిఁ దనరు॥ మ॥ మదదం
తావళతుల్యయానము సుధా ♦ మాధుర్యభృద్వాక్యసం। పద చాంద్రీని
భమందహాసము కృపా ♦ పారీణదృష్టుల్ సవాం। బుదసంకాశశరీరనై
ల్యము శతాం ♦ భోజాప్తతేజంబు వా। రిదగంభీరరవంబు గల్గి యచ
టన్ ♦ శ్రీభర్త భాసిల్లెడిన్॥ చ॥ అగురుసుగంధబంధురస♦ముంచితనీలప
యోదవిగ్రహ। స్థగితసువర్ణరత్నసము ♦ దగ్రవిభూషణ ధాగధగ్యదీ।
ప్తగరుడముఖ్య పార్శ్వచర ♦ భక్తగణేప్సిత దానదక్షుఁడై। తగు నర
కాసురాంతకుఁడు ♦ తత్ఫణితల్పమునందుఁ బొంచుగన్॥ తే. గీ॥ బొమ్మ
దేవర వసియించు ♦ బొడ్డుదమ్మి। తమ్ముల వసించుపడఁతుక ♦ కిమ్ము
వడిన। వెడఁదఱొమ్మును మిన్నేటి ♦ వెల్లఁదివెలయు। నడుగులును గల్గి
మున్నీటి♦ యల్లుఁ డలరు॥ చ॥ కలుముల నీనుకొమ్మ దయ♦ గల్గినచేడియ
తమ్మిపువ్వులన్। మొలచిన ముద్దరాలు నగు ♦ మోము వెలుంగుపడంతి
పువ్వుము। ల్కులదొరఁ గన్నతల్లి జిగి ♦ గుల్కెడిచక్కనిబోటి మే
గ్గొన। మ్ములు దగుపువ్వుఁబోఁడి సిరి ♦ ముద్దియ గొల్వ నతండు భాసి

లున్॥ తే. గీ॥ ఇట్టిపరమపదమ్మున ♦ కేగుఁ బ్రపద। నాన్వితుం డీప్ర పత్తి లే ♦ నట్టివాఁడు । జననమరణప్రవాహమం ♦ దున మునుంగుఁ। గాని తుది ముట్టఁ డెన్నటి ♦ కైన నిజము॥ క॥ అని ప్రపదనమార్గం బె। ల్లను గారుణ్యమున శిష్యు ♦ లకుఁ దెల్పియుఁ డ। న్ననముల ధృడవా సన సం। జనితమగుటకొఱకపుడు వి ♦ చారించి తగన్॥ క॥ కరుణార సభరితాంతః। కరణుండై శిష్యసమితి ♦ గని సకలజగ। ద్గురుఁడు ప్రప త్తి ప్రకారము। మరల మితాక్షరములను స ♦ మస్తము దెల్పెన్। వ॥ అది యెట్లనిన॥ తే. గీ॥ పరమపద మాసపడునట్టి♦ నరుఁడు సత్త్వ॥ గుణగరిష్ఠత గల్గిన♦గురునిపాల। నైన నారాయణునిపాల♦నైన వేడ్కఁ। బంచసంస్కారి గా వలెఁ ♦ బ్రథమమందు॥వ॥ అవియెవ్వి యనిన శంఖ చక్రాంకనంబును బుండ్రమాలాధారణంబును భగవద్దాస నామకరణం బును దిరుమంత్ర ద్వయమంత్ర చరమమంత్ర తదర్థోపదేశంబును భగవదర్చారాధనానుజ్ఞయు ననంబడు నేతత్పంచసంస్కారవంతుండు కరణత్రయప్రపన్నుం డనంబడు నని మఱియు నిట్లనియె॥ తే.గీ॥ బంధ కంబుల నన్నిటిఁ ♦ బాపి నాకు।స్వస్వరూపార్హదాస్యంబొ ♦ సంగు మను చు। హరిని వేఁడుకొనుటయె నా ♦ రాయణాష్ట। వర్ణమంత్రార్థభా వమై♦వఱలుజగతి॥ మ॥ హరి కిల్లాలగులక్ష్మి గొల్చుటను నా ♦ కబ్జా క్షుపాదద్వయీ। శరణం బిప్పుడు సంభవించెను రమా ♦ సంయుక్తు నాత్మేశు శ్రీ। ధరు నీమీఁద నహంమమాత్మకకుమే♦ధన్ మాని సేవిఁ తు నం। చు రహిన్ నామదిఁ గల్గె నన్ తెలివి యే ♦ సుమ్మీ ద్వయా ర్థం బగున్॥ తే.గీ॥ విజయుఁడా సర్వధర్మముల్ ♦ విడిచి యొక్క।నన్నె శరణంబుఁ బొందు నే ♦ నిన్ను సర్వ। దురితములచే వదల్చెద ♦ దుఃఖ పడకు। మనుచు హరి ♦ యంట చరమమం ♦ త్రార్థ మయ్యె॥ తే.గీ॥ ఇట్లు మంత్రత్రయార్థంబు ♦ లెఱిఁగిఁ పిదపఁ । జిదచిదీశ్వరతత్త్వవి ♦ శేషములను । దెలియవలెఁ దత్ప్రకారముల్ ♦ తెలిపెదను వి। నుఁ

డటంచును రామాను ♦ జుండు పల్కె ॥ శా॥ జ్ఞానానందగుణస్వరూపుఁడు
జగ ♦ జ్జన్మావనాంతానుసం । ధానానూనుఁడు సర్వదేహిసకలా ♦ ధారుం
డనంతుండు ల । క్ష్మీనాథుండు పరుండు కర్త యతనిన్ ♦ సేవించినం
గాని మో । క్షానందంబు లభింప దంచును దదీ ♦ యాంఘ్రుల్ భజిం
పన్ వలెన్॥ తే.గీ॥ చక్రికిని శేష మనఘంబు♦జ్ఞానమయము।సకలసద్గు
ణవంతమ్ము♦సర్వగతము । నిత్య మణుమాత్ర మవినాశి ♦ నిర్మలము సు।
ఖార్హమై జీవతత్త్వ మొ ♦ ప్పారుజగతి॥ క॥ హేయతరప్రకృతిగుణస ।
మాయోగంబునను బద్ధుఁ ♦ డై దుఃఖములం । బాయక జననజరామర।
ణాయాసము లొందు జీవుఁ♦ డని తెలిసి తగన్॥ తే.గీ॥ ఇట్టి మనుజుండు
సుకృతంబు ♦ లెల్లఁ జేయ । యోగసంసిద్ధిచే ముక్తి ♦ కేగు నట్టి।యోగ
మధికాంతరాయమై ♦ యుంట దాని । మాని మధ్యమనిష్ఠ దాఁ బూ♦న
వలయు॥ తే. గీ॥ దురితసుకృతాఖ్యములు మాని ♦ కరుణ గల్గి । సలుప
కుండినఁ బాప మన్♦శంకఁ దగిన । గతి జనుఁడు నిత్యనైమిత్తి♦కములు
మాత్ర । మాచరించుట యగును మా ♦ ధ్యమికనిష్ఠ॥ క॥ కరణత్రయ
ప్రపన్నత । మెఱసెడిమనుజుండు మాధ్య ♦ మికనిష్ఠాత । త్పరుఁడై
న్యాసి యగును స్వ । క్షిరయములకుఁ జోఁడు న్యాస ♦ నిష్ఠుం డెప్పు
డున్॥ సీ॥ అతనికి స్వల్పజ ♦ న్మాంతరంబులలోన, యాదృచ్ఛికస్వసే ♦
వాచరణము । గలిగించి తజ్జన్మ ♦ కాలంబునను శౌరి, కరుణలోడను
జూడఁ ♦ గా సతండు । వైరాగ్యయుతుఁడు స ♦ త్త్వగరిష్ఠుఁడై మంచి,
గురు నాశ్రయించి త ♦ త్కరుణచేతఁ । బంచసంస్కారముల్ ♦ పడసి
మధ్యమనిష్ఠఁ, బూని తత్త్వత్రయ ♦ జ్ఞాని యగుచు॥ తే.గీ॥ దేవుఁ గొ
ల్చుచుక్షణమాత్ర ♦ దేహయోగ । భవవిలంబాసహిష్ణుఁడై ♦ పరఁ
గుచుండ । నతని వరియించు నపుడు ప ♦ డంగపూర్తి । వాఁడు త
జ్జన్మమున నప ♦ వర్గ మొందు॥ వ॥ ఆనుకూల్యసంకల్పంబును బ్రాతికూ
ల్యవర్జనంబును రక్షించు నమవిశ్వాసంబును గోప్తృత్వవరణంబును నా

త్మనిక్షేపంబును గార్పణ్యంబును ననుషడంగంబులు తత్తద్విరోధి యు
క్తంబులుగా నేర్పరించెద వినుం డని యిట్లనియె॥ తే. గీ॥ హరికరు
ణ దక్క హరిఁ జేర్ప ♦ నన్యములు ను। పాయములు గా వటంచుఁ
ద ♦ త్పారతంత్ర్య। మూనుచును నామనం బిప్పు ♦ డున్న దనెడి।
శేముషీస్ఫూర్తి యాత్మని ♦ క్షేప మయ్యె॥ క॥ జగతిఁ దీనికి వైరిగ।
యగుచు ఫలశ్రద్ధ దగు న ♦ హంమమకార। స్థగితముగఁ గర్మము
లు స। ల్పఁగ మనుజుఁడు పూనుటయె ఫ♦లశ్రద్ధ యగున్॥ తే. గీ॥ వా
సనాశూన్యయోగంబు ♦ వచ్చు టెట్లు। శౌరి నీదయ దక్క మో ♦
క్షమున కొండు। సాధనము నాకు లే దని♦జనుఁడు దీనుఁడై కృశించుట
కార్పణ్య ♦ మన వెలుంగు॥ క॥ కర్మజ్ఞానంబులచే। నిర్మిత మగుభక్తి
యోగ ♦ నిష్ఠగలిగి తా। ధర్మాంబరుఁ జెందెద నను। నిర్మలమతి దీని
వైరి ♦ ణియగుధరిత్రిన్॥ తే. గీ॥ సహజకరుణాన్వితుం డౌటఁ ♦ జక్రి
నరులఁ। బ్రోచుఁ గావున నన్నును ♦ బ్రోచు ననుచు। నతని నమ్ముట
విశ్వాస ♦ మయ్యెఁ గర్మ। పద్ధతులు దప్ప నీఁ డంట ♦ ప్రతిభటుండు॥
తే. గీ॥ కరుణ శక్తి సమర్థత ♦ గల్గి పూర్ణుఁ। డైనహరి తనకుం గో
ప్త ♦ యనుచు నతని। వాఁ డగుట చుమ్ము గోప్తృత్వ ♦ వరణ మ
తఁడు, నిర్గుణుం డనుకొంట దీ ♦ నికి విరోధి॥ తే. గీ॥ అచ్యుతుఁడు
శ్రుతిచేఁ గూడ ♦ దనువినోద। శాస్త్రముల పాతకముల వ ♦ ర్జన
ము సేఁత। జగతి దగుఁ బ్రాతికూల్యవ ♦ ర్జన మనంగ। వానిఁ గై
కొంట సుమ్ము త ♦ ద్వైరి యయ్యె॥ క॥ వనజాక్షునకున్ విశ్వము।
తను వనునిశ్చయము గల్గి ♦ తన కెగ్గొనరిం। చిన ప్రాణిని హింసిం
పక। చనునడవడి యానుకూల్య ♦ సంకల్ప మగున్॥ క॥ దీనికి హింస
విరోధిని। యై నెగడున్ మనుజుఁ డీష ♦ డంగము లెలమిం। బూనిన
చో స్వప్రార। బ్ధానంతర మందు ముక్తుఁ ♦ డగుఁదథ్యముగన్॥ మ।
అనుచుం గాంతిమతీతనూభవుఁడు శి ♦ ష్యానీకముం జూచి ప। ల్కిన

వా రందఱు మోదపూర్ణు లగుచుం ♦ గీర్తించి తత్పాదవం । దనముల్
చేసి మముం బ్రపన్నతతిలో ♦ నం గూర్పవే యంచు వేఁ । డిన నాతం
డొనరించె వారలకు రూ ♦ ఢిం బంచసంస్కారముల్॥ క॥ వా రంద
ఱు హరికరుణా । పూరముచే విరతు లగుచుఁ ♦ బూజ్యతరపడం । గ్గో
రుమహిమచేతను దై । త్యారాతిపురీవరమున ♦ కరిగిరి వేడ్కన్ ॥
క॥ వినుతా హేతుక జాయమానకరుణా ♦ స్ఫీతాత్ముఁడై శ్రీజనా।
ర్దనుఁ డీవేళ మదీయమానసముచే ♦ తన్ మద్భరం బంతయుం । దన
కున్ లోఁబడఁ జేసి కొంచు నిపు డు ♦ న్నాఁ డంచు నెల్లప్ప పా ।
యనివిజ్ఞానమె తత్ప్రపత్తి యని ము ♦ ఖ్యార్థం బెఱుంగం దగున్॥
క॥ ఏతత్కథ పఠియించిన । చేతనుఁడు మురారిపురముఁ♦ జేరును మర
లన్ । మాతృస్తనదుగ్ధంబులు । భాతిం గైకొనఁడు నిజము ♦ పల్కితిఁ
జుండీ॥ చ॥ ఇది వినుమానవుండు మఱి ♦ యెన్నటికిన్ సమనర్తకింక
రో । న్మదనినదంబులన్ వినఁడు♦మాధవలోక గతామితప్రభా । స్వద
పుట హేమరత్నమయ ♦ సౌధచరన్మణి సాలభంజికో । ద్యదృఢకరస్థ
చామరమ ♦ రుత్తతిచేతను బ్రీతిఁ బొందెడిన్॥ చ॥ విపులశుభాస్పదం
బును బ ♦ విత్రము పాపవిభేదకంబు వి । ష్ణుపురనివాసహేతువు వి ♦
శుద్ధసుధారస తుల్యగద్యప । ద్యపటుతరంబు సంయమిను ♦ తంబు మ
హోపనిషత్స్వరూప మీ । ప్రపదనపారిజాతము కృ♦ పామతి దెల్పితి
మీకు సర్వమున్॥ క॥ అనుచున్ సూతుఁడు పల్కిన । విని శౌనకము
ఖ్యులతని ♦ వినుతించుచు శ్రీ।వనజాక్షునిఁ గీర్తించుచుఁ । జని రచ్చోఁ
బాసి వారి ♦ సదనమ్ములకున్॥

శా॥ శుండాలాధిపహస్తసన్నిభభుజా ♦ స్ఫూర్జత్కృపాణాహతో
ద్దండారిక్షితిమండలాధిపవియ ♦ ద్యానక్రియాధ్వార్పితా
ఖండానేకపటాలయన్నిజచమూ ♦ గ్రామోజ్జ్వలద్భూరివే
దండస్యందనవాహయోధచరణో♦ద్యత్పాంద్ర పాంసువ్రజా.

క॥ రాజాధిరాజ రాజబి । డౌజ ధనుర్గుణమహోగ్ర ♦ టాంకారవిభి
న్నాజరదిగ్గజకర్ణ । వాఙ్గిజా శ్వేతాచలపతి ♦ రంగారాయా.

క॥ రాయడపాహ్వయధాత్రీ । నాయకతనయాగ్రగణ్య ♦ నారాయణపూ
జాయతనిజసుమనీషా । చ్ఛాఙ్గియా శ్వేతాచలపతి ♦ రంగారాయా.

పంచచామరము॥ సరోజనాభపూజనప్ర ♦ శస్తహస్తపల్లవా
కరస్ఫురత్కృపాణబాణ ♦ ఖండితారివల్లభా
శరత్సుధాంశుకాశహార ♦ శారదోజ్జ్వలద్యశో
ధురంధరాచ్ఛ రావువంశ ♦ దుగ్ధవార్ధిచంద్రమా.

మాలిని॥ దురితగణ విదూరా ♦ దుష్టసంహారధీరా
సురుచిరగుణవారా ♦ సూరిసంస్తుత్యసారా
హరిపదసువిచారా ♦ హాటకక్ష్మాధ్రధీరా
శరహతరిపువారా ♦ సర్వవీరాధివీరా.

గద్య॥ ఇది శ్రీమదుభయకవిత్వ రచనానల్పచాతుర్య కోటికెలపూడివంశ
కమలవనసూర్య హరితసగోత్రధుర్య శ్రుతిసాగమాచార్య
శ్రీమన్నారాయణ చరణాంబుజధ్యానగతస్థైర్య సకలమత
వేదాంతసిద్ధాంతానివార్య వేంకటకృష్ణమ్మ సోమయామా
కుమారవర్య కోదండ రామయార్య కార్యంబైన
ప్రపదనపారిజాతం బనుదివ్యప్రబంధంబు నందు
సర్వంబును బంచమాశ్వాసము

ప్రపదన పారిజాతము
సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు.

---

PRINTED BY M. V. NAIDU & CO., AT THE DIVINE PRESS, MADRAS.

| పుట. | పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 33 | 23 | హానుమ ద్దేవరు | హానుమ ద్దేవర |
| 38 | 22 | ప్రపదనముఁ | ప్రపదనము |
| 39 | 25 | మహాత్ము | మహాత్మ్ము |
| 44 | 18 | రాణమ్ములఁ♦దాను | రాణమ్ములఁదాను |
| 48 | 15 | లగు♦శంఖ | లగుశంఖ |
| 50 | 14 | వారించుచు | హరించుచు |
| 62 | 8 | జెప్పినఁవాఁడు | జెప్పినవాఁడు |
| 65 | 10 | నన్నుఁ♦గూర్చి | నెన్నుఁ♦గూర్చి |
| 71 | 6 | నందు ముఖ్యము | నందముఖ్యము |
| 72 | 1 | రూపంబ సేవ్యం | రూపం బసేవ్యం |
| 79 | 19 | బున్న_న | బునన్నైన |
| 97 | 20 | వినింజాలక | వినంజాలక |
| 101 | 12 | బునంచేసి | బునంజేసి |
| 103 | 21 | లేదురోదసియును | లేవురోదసులును |
| 107 | 2 | మట్టియు | మఱియు |
| 128 | 20 | దద్వ_ర్తన | దద్వర్తన |
| 144 | 12 | బగచుఁ | బగుచుఁ |
| | 25 | కని | కాని |
| 149 | 18 | మతిదల్పితి | మతిఁదెల్పితి |

